ఈ గ్రంథము

నా చెల్లెలును నూకల సూర్యనారాయణ
మూర్తి భార్యయును
అకాలమృత్యుగ్రస్తయును
అయిన
కనకదుర్గమ్మకు
అంకితము.

గ్రంథకర్త.

# విషయసూచిక

పుట

1. Religion being imperfect, is always subject a process of evolution and reinterpretation. Progr towards Truth, towards God, is only possible because such evolution.......All faiths constitute a revelation truth, but all are imperfect. Therefore Tolerance wh gives spiritual insight and breaks down all barriers necessary for every seeker after Truth.

*Mahtma Gandhi.*

2. There is nothing so dangerous to intellectu virility as to have an "infallible book" to fall ba upon. There is no sacred book in the world, which h not crippled human souls—

*Dr. Oliver Wendel Holmes.*

3. స్త్రీకి సంపూర్ణస్వాతంత్ర్య ముండవలెనని నే తీవ్రముగ కోరుచున్నాను. నేను పసిపిల్లలకు వివాహ చేయుట గర్హించుచున్నాను. ఒక బాలవితంతువును చూ నపుడు నాఒడలు కంపమెత్తును. ఒకడు తనపత్నిని పోగొ కొని మృగప్రాయమైన తూష్ణీంభావముతో పునర్వివాహ చేసికొన్నపుడు క్రోధావేశముచేత నాఒడలు కంపించును—

మహాత్మా గాంధీ

# సంపాదకుల పీఠిక



ఈ కొవ్వ్యూరులోని ఆంధ్రగీర్వాణ విద్యాపీఠాధ్యక్షు
లగు జటావల్లభుల పురుషోత్తముగారీగ్రంథము రచించు
నటలో, మన హైందవస్త్రీల సాంఘికస్థితి యెట్లు క్రమక్రమ
ముగా మార్పుచెందినదో చూపించుటయే వారిముఖ్యోద్దే
శ్యము. వేదకాలమునాటి స్త్రీలస్థితిగతులు, దరిమిలాను స్మృ
తులు, పురాణములనాటివి, అటుతరువాత ఆధునికయుగ
ములోనివి వ్రాయదలచుకున్నారు. వివిధజాతులలోని స్త్రీల
హక్కులు, విధులు, పోల్చిచూపుటకై మరియొక గ్రంథము
వెలువడగలదు. స్త్రీపురుషుల అన్యోన్యసంబంధములు, సాం
ఘికతరగతులు, ఆయాసంఘముల యభివృద్ధికి ప్రధానవిషయ
ములుగనుక, వీనినిగురించి సదాచర్చించి, ఆయాకాలములకు
తగినట్లు సంఘములలో సంస్కరణములను చొప్పించుటకు
నట్టి గ్రంథములు తోడ్పడగలవు. ఈప్రపంచమున్నంతవరకు
రాజకీయసాంఘిక పోరాటములు నిరంతరము జరుగుచునేయుం
డును. అట్టి చలనములులేని సంఘము స్థంభించిపోయి నశించి
పోవును. కాబట్టి కాలమే, దానిలోమార్పులు చొప్పించి
తీరును. అయినను కాలానుసారముగ సంఘమున కుపయుక్త
మగు మార్పులుచేయుటకు మనము ప్రయత్నించుచుండ
వలెను.

సాంఘిక పరిణామమును, నానాసంఘాచారముల
తమ్యమును, పోల్చి ముఖ్యవిషయముల నన్నిటిని బోధిం
గ్రంథములవలననే ప్రజాసామాన్యములో బుద్ధివికాస
వృద్ధియై వర్ణాశ్రమ ధర్మములు, స్త్రీపురుషుల అన్యోన్యసం
ధములు మొదలగునవి మానవ కల్పితములేగాని, దేవుని
ఆయాసంఘముల కవి శాశ్వతముగా నుండునట్లు సృష్టించి
నవికావని స్పష్టపడుచుండును. మనలోని కొన్ని ప్రస్తు
చారములు శాశ్వత సనాతనధర్మములనియు, అవి మా
కూడనిదనియు అట్లుమార్చినచో, నరకప్రాప్తి కలుగుననిం
భయపెట్టి పిడివాదుల నోళ్లుకట్టుటకే, యిట్టిగ్రంథము ల
ములు వెలువడవలసియుండును. కూపస్థమండూకములవ
ప్రతిసంఘములో కొందరు పూర్వాచారపరాయణులు
తమపూర్వులకే సమస్తము తెలియుననియు వారు ఆయా
ముల కుపకరించుటకు చేసిననిబంధనలను రాబోవు సం
వారందరు నిర్బంధముగ ననుసరించనిచో ముప్పువాటిల్లు
యు వాదనలు చేయుచుందురు. హేతువాదనలును, ఆధు
యుగపరిస్థితులును వీరికి గిట్టవు. కావున సత్యముతప్పకుం
ప్రమాణములతో వ్రాయబడు నిట్టిగ్రంథములు, అట్టి
దుర్వాదనలను ఖండించుట కుపయోగించును. ఈప్రమా
ములలోకూడ కొన్ని యీకాలమునకు అక్కరకురాకపో
నచో, వానిని త్యజించుటకు మనకు సర్వాధికారము కలద
ఏ మతగ్రంథమందుగాని, యే మతోద్ధారకుని యం

గాని అమోఘమైనట్టియు అనుల్లంఘనీయమైనట్టియు సమస్త సత్యముకలదని యీ విద్యాపీఠకమిటీ వా రంగీకరించరు. ఇది వారి ప్రధానసూత్రము. హేతువాదనలలో వీరిలోవీరికి భేదాభిప్రాయము లుండుగాక. ఇప్పుడు సనాతనధర్మవాదుల మని చెప్పుకొనువారి వాదనలకు భంగకరములగు శ్రుతివాక్యములను వారిమీద నుపయోగించెదము. వీనిలోకొన్ని వారి వాదననే బలపరచునవి యున్నయెడల, యీ యాధునిక యుగములో ప్రజాక్షేమమున కుపయోగించనవుడు, వానిని త్యజించితీరెదము. వారు పరమప్రమాణములని ఒప్పుకొని తీర వలసిన శ్రుతివాక్యములను వారిమీద ప్రయోగించెదము. వానిలో యేవైనను ఆధునికసంఘాభివృద్ధికి హానికరములని, సహేతువులు కనుపడినచో, వానిని విసర్జించుటకు సంకోచించము. ఎటులైనను ఆర్యాగ్రంథములలో ఉన్నది ఉన్నట్లు వ్రాయుటకు మేము వెరువవలసినపనిలేదు. వారికిని మాకును, ఒక సామాన్యప్రమాణ గ్రంథములేనపుడు మాకు సత్యమును విమర్శించుటకు యేలాటిజంకును ఉండదు.

నీతిమతసాంఘిక రాజకీయార్థిక సూత్రములన్నియు, అనేక లక్షలసంవత్సరములనుండి వివిధ పరిణామవస్థలు పొందు చున్నవి. పొందగలవు. ఇది ప్రకృతిస్వభావము. మనపూర్వ సాంప్రదాయములు, అలవాట్లు వదలలేక వానిని పట్టుకొని యెంతగా వ్రేలాడదలచుకొన్నను, కాలప్రవాహములో ఆప ట్లువిడిపోయి మనమందరము యితర సంఘములతోపాటు

కొట్టుకొనిపోవక తప్పదు. దీనిని గ్రహించజాలనివారు వెకువ
జెందుచుందురు. ఈప్రవాహము వెనుకకుపోవుటెన్నడు సంభవ
వించదనెడు ప్రకృతిసూత్రము, సాంఘిక రాజకీయాదివిషయప్రవృత్త
లలో వర్తించునని తెలుసుకొని, శ్రుతిస్మృతి పురాణకాలముల
వైపుకుచూపులను మరలించక సహేతువులమీదనే మనవ్యవసే
నల నాధారపరుచుకొనుచు కాలానుసారముగ అవసరమగుంచ
మార్పులను చేయుటకు ప్రయత్నించుచుండవలెను. అట్లుమాయి
పూర్వాచారపరాయణులు చేయుటకు మనసొప్పనియెడల
తాము తూష్ణీంభావము వహించి మౌనముదాల్చి యింటనో
కూర్చుండుటయే మంచిది. వెనుకటి గ్రంథములే శాశ్వతపుర
ప్రమాణములని వీరు వాదించదలచినచో వీరిఖండనల నంగీకరి,
రించువారు మిక్కిలి అరుదుగ నుందురు. ఇంతటితో తృప్తినుగ
నొందక పూర్వాచారముల నన్నిటిని ఆధునిక ప్రకృతిశాస్త్రవార
జ్ఞానముతో ముడిపెట్టి పూర్వగ్రంథములలో వ్రాయబడియున్న
అభూతకల్పనలన్నియు సత్యములని సమర్థించు పండిత ప్రకాండు
డులనుమాత్రము యెంత కఠినవిమర్శనలకైనను లోనుగావించవ
వలసినదే. వీరియపార్థములు, కల్పనలు, కృత్రిమ భాష్యములు, పడి
రహస్యార్థములు, లోకులను వంచింపజేయుటకే వ్రాయబడులో
చుండుటచే అట్టివారు క్షమింపతగరు.

పురుషులకువలెనే స్త్రీలకును మెదడనునది యున్నదని
కదా! ఆత్మయను నొక పదార్థము పురుషులలోనున్న యెడల
స్త్రీలలోకూడ నదియున్నదని అందరును ఒప్పుకొనవలసిన విష

వెఁకమేకదా! స్త్రీలు ప్రకృతిస్వభావమునుబట్టి అబలలును
పిల్లలను కనిపోషించువారగుటచే వారు సాధారణముగా గృహ
కృత్యములలో మునిగి తేలుచు భవిష్యత్పౌరులను తయారు
చేయుటలో మిగులతోడ్పడుచు తమజీవనమునకు పురుషులమీా
దనే యాధారపడి వారిచేత భరింపబడుటచే తాము భార్యలని
యెంచుకొనుచున్నారు. సంఘశ్రేయమునకు యిట్టివిధానము
ఋగ్వేదకాలమునాటికే యేర్పడి గార్హస్త్యవిధాన మాచర
ణలోనికి వచ్చియుండెను. కాని స్త్రీలకెట్టి స్వాతంత్ర్యములుం
డెనో కాలక్రమమున అవి యెట్లుమారెనో మన శ్రుతిస్మృతి
పురాణములే ప్రబలసాక్ష్యము. కొందరుస్త్రీలు, మేధావంతు
లై, విద్యావతు లగునపుడు, వారికి మేడలను కల్పించుటకు,
నుగవాని కెట్టియధికారము కలదు? అన్నివిద్యలలోను మగ
వారిని తలదన్నువారు, అనేకమందిస్త్రీలు నానాజాతులలో
నున్నపుడు, వారిస్వాతంత్ర్యముల నరికట్టి, యేమతగ్రంథము
లోని వాక్యములనుగాని మనము లక్ష్యపెట్టకూడదు. కాల
క్రమమున, మనస్త్రీలు పురుషులకుగల స్వాతంత్ర్యములన్నియు
బడయుటకు సంపూర్ణమైన హక్కు కలవారమని వాదించుట
లో న్యాయ మేల లేదు?

శ్రుతివాక్యములు వితంతువివాహములను నిషేధించు
నని వాదించు సనాతనధర్మవాదులు నియోగము నొప్పుకొన్న
వాక్యముల నంగీకరించి ఆచరణలో పెట్టెదరా?
తమభార్యలను యేయతిథికోరినను యిచ్చెదరా? తమ యువి

వాహితలగుకుమార్తెలకు రజస్వలానంతరముననేవివాహము చేసెదరా? పండ్రెండు విధములైనపుత్రులను స్వీకరింతురా గాంధర్వ రాక్షస పైశాచ వివాహముల నంగీకరించెదరా వీనికన్నిటికిని ప్రమాణములు శ్రుతిస్మృతులలో లేకపోలేదు ఇట్టియాచారములు మనధర్మశాస్త్రముల బట్టియే మెల్ల మారుచుండెనో యీప్రస్తుత గ్రంథములవంటివి జనబాహుళ్యమునకు తెలుపుట కుపయోగపడుచుండును. శ్రుతులే ప్రమాణములని మన సనాతనధర్మవాదు లెంచినపుడు వానిలో తమకిష్టమువచ్చిన వానిని యంగీకరించి తక్కినవాని త్యజించుటేటిన్యాయము? ఈకాలమునకు ఉపయోగించునవి ఉపయోగకరములుకానివి, మన పూర్వగ్రంథములలోనున్నవన్నియు స్పష్టముగ సత్యముతప్పకుండ వ్రాసి వానినన్నిటిని దేశకాల పాత్రానుసారముగ ప్రజలచే నవలంబింపజేయుటయే మాముఖ్యోద్దేశము. ఆపూర్వగ్రంథములంగీకరించినంతమాత్రముననే సంఘక్షేమమునకననుకూలమైనవానిని నిలబెట్టుట మాడద్దేశముకాదు.

కొవ్వూరు
11–9–33

వల్లూరి సూర్యనారాయణరావు
సెక్రటరీ
ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము.





జటావల్లభుల పురుషోత్తము బి. ఏ.

జననము 1906

# ఉపోద్ఘాతము

ఋగ్యజుస్సామాథర్వశాఖలకు చెందిన మంత్రబ్రాహ్మణారణ్యకోపనిషత్తులకే వేదమను నామమీగ్రన్థమున వాడబడినది. అథర్వవేదము వేదమే కాదని కొందఱును, మంత్రభాగము మాత్రమే వేదమని కొందఱును, మంత్రబ్రాహ్మణములకే వేదనామధేయమని కొందఱును చెప్పుచున్నారు. కాని విశేషసంఖ్యాకపండితులు 'వేద' మను పదమును నేను వాడినయర్థముననే వాడుచున్నారు. ఉపనిషత్సంజ్ఞ గలిగియుండియుగూడ నవీనములని తెలియబడుచున్న అల్లోపనిషత్తుమున్నగు వానికిందు గ్రహణములేదు.

వేదముల కాదిలేదనియు వాని నెవరును వ్రాయలేదనియు ప్రతికల్పారంభము నందును నవి ఋషులకు వినబడుచుండుననియు చాలమంది హిందువుల నమ్మకము. నాల్గువేలసంవత్సరముల క్రిందట ఋషులు వేదములను వ్రాసిరని కొందఱు పాశ్చాత్యపండితులు చెప్పియున్నారు. ఆరువేలసంవత్సరముల క్రిందటనే వేదోత్పత్తి ప్రారంభమాయెనని కొందఱు నవీనపండితుల యభిప్రాయము. ఇరువదివేల సంవత్సరములకు పూర్వమే ఋగ్వేదము రచింపబడెనని మఱికొందఱు నవీనశాస్త్రములను బట్టియే ఋజువుచేసి యున్నారు. నవీనపండితుల దృష్టిలో రానురాను వేదకాలము వెనుకకు తీసికొనిపోదగినదిగనే గన్పట్టుచున్నది.

వేదమెప్పుడు పుట్టినదని యెవరు నమ్ముచున్నారో వారికప్పుడు స్త్రీలపరిస్థితి యెట్లుండెనో తెల్పుటయే యీ గ్రంథముయొక్క యుద్దేశము. వేదమనాదియనియు నపౌరుషేయమనియు నమ్మువారికి గూడ నీ గ్రంథమువలన లాభము గలుగగలదు. వేదమునందు గన్పట్టు స్త్రీధర్మమంతయు నిందు గన్పఱుపబడుటచే వేదమార్గము ననుసరింపగోరువారి కిదియుపకరించును. సంఘమును సంస్కరింప గోరువారికిని నాసంస్కారమును ప్రతిఘటింపగోరువారికిని గూడ నీ గ్రంథమునందలి విషయము లుపయోగపడును. వేదములు హిందూమతమునకు పునాదులగుటయే కాక హిందువులకు పరమప్రమాణములై విరాజిల్లుటయే యిందులకు గారణము. అంతియేకాక దూరదేశమందుగాని యతిపురాతన కాలమందుగాని యుండిన ప్రజలస్థితిగతులను తెలిసికొనవలెననుకోరిక సాధారణముగ నందఱకును నుండును. అన్నిటికంటెను పురాతనమగు వేదకాలములోని ప్రజలలో నర్థభాగమగు స్త్రీసంఘముయొక్క పరిస్థితుల తెలిసికొనవలెనను కోరిక చారిత్రకదృష్టి గలవారి కందఱకును తప్పకయుండునని నమ్ముచున్నాను. స్త్రీలస్థితి యెట్లు మారవలెనో యెట్లుమారగలదో యెఱుగవలెనన్న వివిధదేశములలో వివిధకాలములలో వారిస్థితి యెట్లుండెనో తెలిసికొనుట యవసరము. ఏమన నన్ని దేశములలోను నన్ని కాలములలోను గూడ గన్పట్టు స్త్రీలపరిస్థితులకు హేతువు స్త్రీప్రకృతియే యనియు కొన్ని దేశములందును కొన్ని కాల

ములందును మాత్రమే గన్పట్టు స్త్రీలపరిస్థితులకు నా దేశ కాలములందు గల్గిన చారిత్రకపరిణామములే హేతువులనియు మనము తెలిసికొనవలసియున్నది. ప్రకృతినాధారముగ చేసికొని యేర్పడిన పరిస్థితులపట్ల నొకదృష్టిని చారిత్రకముగ నేర్పడిన పరిస్థితులపట్ల మఱియొకదృష్టిని సంస్కరణాభిలాషులు గలిగియుండవలెను. కావుననే వివిధకాలములయందు స్త్రీల పరిస్థితులను దెల్పుటకే నేను సంకల్పించితిని. ఇప్పటికి వేదకాలమునకు సంబంధించిన యంశముల నన్నిటిని వ్రాసి యీ గ్రంథరూపమున లోకులయెదుట బెట్టుచున్నాను. ధర్మశాస్త్రములలోను హిందువులకు ప్రమాణములగు నితరగ్రన్థముల లోను గన్పట్టు స్త్రీలపరిస్థితులను దెల్పు గ్రంథమును వ్రాయుట కిదివఱలోనే ప్రారంభించి కొంచెము వ్రాసియున్నాను. ఈ సంవత్సరాంతమునకు దానిని ముగింపగలుగుదునని యాశించుచున్నాను.

మొత్తము పైన హిందూదేశచరిత్రకాలమును కొన్ని భాగములుగ చేసి యొక్కొకభాగములోని స్త్రీలపరిస్థితులను దెల్పుట కొక్కొకగ్రంథమును వ్రాయుచున్నాను, గావున నొక్కొకకాలములోనే యవాంతరభేదములను గన్గొనుటకు నేనంతగ యత్నించుటలేదు. ప్రస్తుతగ్రంథములో బొత్తుగ యత్నింపలేదు. అట్లు చేయకుండుటకు మఱియొక హేతువు గూడ నున్నది. ఈ యుపోద్ఘాతముయొక్క యాదిలో పేర్కొనబడిన వేదవాఙ్మయవిభాగము స్థూలమైనదే యైనను నందలి

పౌర్వాపర్యమును గూడ పూర్తిగ నిర్ణయించిన వారింతవ కును బయలుదేరలేదు. ఋగ్వేదము యజుర్వేదముకం ప్రాచీనమైనదని స్థూలముగ చెప్పినవారుకూడ ఋగ్వేదమ లోనే భాగము ముందును నేభాగము వెనుకను బుట్టినదో స్పష్టముగ చెప్పలేకుండనున్నారు. సంహితలలో కొన్ని భా ములు కొన్ని బ్రాహ్మణములకంటె పిమ్మట వ్రాయబడినవ కూడ కొందరు తలచుచున్నారు. కావుననే వేదవాఙ్మయక లములోని యవాంతరభేదములను నిర్ణయించుటకీ గ్రంథమ లో ప్రయత్నించుట మూలవిషయమున కప్రాధాన్యమిచ్చు యే యగును. ఈ హేతువులచేతనే నీగ్రంథమున నట్టిప్రయ త్నము చేయలేదు. ఈ గ్రంథమందు గన్పఱుపబడిన కొన్ని పరిస్థితులకు గన్పట్టు పరస్పరవైరుధ్యము కాలముకంటె భిన్న ములగువానివలన గల్గినదనియే నేను భావించితిని. వేదకా ములోని యవాంతరకాలవిషయమై నిశ్చయజ్ఞానముగలవా వైరుధ్యమునకు కారణము కాలభేదమేయని యూహించుకొను టకు వారికి సంపూర్ణావకాశమును గల్గించితిని. ఎట్లన: వే వాఙ్మయములోని యేభాగమువలన నేయేసిద్ధాన్తములను తీ యున్నానో నేనీగ్రంథమున స్పష్టముగను వివరముగను చెప్పి యున్నాను.

వేదములను స్వయముగ చదివియే నేనీగ్రంథము వ్రాసితినిగాని యితరుల వ్రాతలపై నెంతమాత్రము నాధా పడలేదు. మూలవేదమునే చదివితినిగాని భాషాంతరీకరణమ

లపై నాధారపడలేదు నాకు స్త్రీలపరిస్థితులపట్ల గల యభిప్రాయములను వేదప్రామాణ్యముచే సమర్థించుటకుగాని, యితరులీవిషయమై వ్రాసిన యభిప్రాయములను ఖండించుటకు గాని, నే నెంతమాత్రమును నీగ్రంథమును వ్రాయలేదు. నేనీగ్రంథములో నేమిచెప్పినను గూడ నేదో యొక వేదవాక్కు నాధారము చేసికొనియే చెప్పియున్నాను. ఆ వాక్యమును దానియర్థమునుగూడ నచ్చట వ్రాసియున్నాను. ఉపనిషద్భాగములో శంకరభాష్యమును నితరవేదభాగములో సాయణభాష్యమును ననుసరించియే యర్థమువ్రాసితిని. భాష్యకర్తచెప్పిన యభిప్రాయములలో వేనికైనను మూలాధారములేదని నాకుతోచినచో నట్టియభిప్రాయములను త్రోసివైచితిని. అట్టిస్థలములొకటి రెండుమాత్రమే కలవు. అథర్వవేదమునుండి నేనుద్ఘటించిన కొన్నివాక్యములకు సాయణభాష్యములేదు. వానికి నా బుద్ధి కుచితములుగ తోచిన యర్థములను వ్రాసితిని. ఆయర్థములను పండితులకు వినిపించి వారి యామోదమును పొందితిని. శతపథబ్రాహ్మణమునకు సాయణభాష్యము ముద్రితమైయున్నదికాని నాకది లభ్యముకాలేదు. కావున వానియర్థమును నిర్ణయించుటలో కొంతవఱకు నా బుద్ధిని కొంతవఱకు పండితుల సహాయమును నాధారముగ చేసికొంటిని. నేను వ్రాసిన యర్థములు సరియైనవో కావో పరీక్షించుకొనుటకు పాఠకులకు పూర్ణమైన యవకాశమును గల్గించుటకై, యావాక్యములు వేదవాఙ్మయములో నెచ్చటనున్నవో సులభముగ

తెలిసికొనుటకై, వానిస్థలనిర్దేశమును చేసియున్నాను. ఆ
వాక్యములను బట్టి నేనుచేసిన యనుమానములు సరియైనవో
వో తెలిసికొనుటకు పాఠకుల కవకాశము గల్గించుటకై నే
హేతువులచే నేనా యనుమానములను చేసియుంటినో యా
హేతువులనుకూడ తెల్పియున్నాను. ఈవిధముగ పా
కవకాశములను గల్గింపకుండుటవలన నెట్టిమోసములు గ
వచ్చునో తెల్పుట కొక యుదాహరణమును చూపె
పరిశిష్టాధ్యాయములో 'స్త్రీసంతతి' యను శీర్షికక్రింద
బడిన 'అవభృథమవయంతి' యను మంత్రములో స్త్రీ
వును పుట్టినవెంటనే కాకులకును గ్రద్దలకును పారవేయు
వాటు పేర్కొనబడినదని భావించి యొక సుప్రసిద్ధ
పాశ్చాత్యపండితుడు యజుర్వేదకాలములో నాడపిల్ల
పుట్టుటతోడనే యీవిధముగ చంపివేయు నాచారముం
చెప్పియున్నాడు. కాని యాతడా మంత్రమును దాని
మును వ్రాసి యాపిమ్మట తానా మంత్రమునుండి యీ
మానము చేసినట్లు చెప్పియున్నచో పాఠకుల కాతడు
యూహ యెంతవఱకు సరియైనదో స్పష్టమయ్యెడిది. ఆ
న త్తవారింటికి పంపివైచుట యను నాచారమే యిందు
నబడినది గాని కాకులకును గ్రద్దలకును పారవేయు నా
మెంతమాత్రమును పేర్కొనబడలేదని యామంత్రమును
మును చూచినవారికి స్పష్టమగును. గ్రంథకర్త పాఠ
తానుచెప్పు సిద్ధాంతముల యౌచిత్యమును తెలిసికొను

యిట్టి సదుపాయములను గల్గింపకుండుచో చాలమంది పాఠకుల కవి సరియైనవో కావో యను సందేహమైనను కలుగక యవియే సత్యములను నభిప్రాయము కలుగును. సందేహము కలిగినవారికికూడ యథార్థము తెలిసికొనుట బహుప్రయాస సాధ్యమగును. అట్టి మోహముగాని చిక్కుగాని కలుగకుండుటకై యే నేను పైన పేర్కొనబడిన సౌకర్యములను పాఠకులకు గల్పించితిని. నేనీ గ్రంథములో తేల్చిన సిద్ధాన్తములలో దేనికైనను భంగకరమైనట్టిగాని క్రొత్తసిద్ధాన్తముల కాధారమైనట్టిగాని యేవేదవాక్యమునుగూడ నేను బుద్ధిపూర్వకముగ పదలివేయలేదు. నేను వేదమును పరిశీలించుసమయమున నేవైన కొన్నివాక్యములు నాదృష్టినుండి తప్పిపోయినచో నట్టిదోషము నాబుద్ధిలోనిదే కాని హృదయములోనిదికాదు, కావున క్షంతవ్యుడను. నాదృష్టినుండి తప్పిపోయిన కొన్ని వేదవాక్యములను నాకుచూపిన బ్రహ్మశ్రీ భాగవతుల లక్ష్మీపతిశాస్త్రిగారికిని, చీమలపాటి వెంకటదీక్షితులు బి. ఏ. ఎమ్. ఎల్. గారికిని నేను కృతజ్ఞుడను.

పరిశిష్టాధ్యాయమున తెలుపబడిన యంశములను మూలగ్రంథములోనే వ్రాయలేకుండినందులకు చింతిల్లుచున్నాను. మఱియు నితరుల వ్రాతలను నభిప్రాయములను పూర్తిగ విస్మరించియే నేనీ గ్రంథమును వ్రాసినను వేదకాలములో యువతీవివాహములు లేనేలేవని వాదించు కొందఱు మిత్రులకోరికపై వారివాదమును సంగ్రహముగ పరిశిష్టప్రక

రణములో తెలిపి దానిపైన నాయభిప్రాయము నచ్చ
యిచ్చియున్నాను. ఈవాదములను నేను తెలిసికొనట
కొంతవఱకు కారణభూతులైన బ్రహ్మశ్రీ విమర్శకాగ్ర
కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారికిని ఎస్. శ్రీరాములు బి.
ఆనర్సుగారికిని నేను కృతజ్ఞుడను. ఇచ్చటదక్క మఱెచ్చ
గూడ నీగ్రంథములో నితరుల యభిప్రాయములకు తావులే

నేనీ గ్రంథమును రచించుటకు కారణభూతు
యిరువురు మహాపురుషులపట్ల నాకుగల కృతజ్ఞతను తె
కుండ నేనీ యుపోద్ఘాతమును ముగింపజాలను.

అందొకరు ప్రస్తుత మాంధ్రగీర్వాణవిద్యాపీఠప
సంఘమునకు కార్యదర్శిగనున్న శ్రీ వల్లూరి సూర్యనారా
రావుపంతులు బి. ఏ. బి. ఎల్. ఎల్. టి గారు. వీ రాంధ్రగీర్వా
విద్యాపీఠమునకు విశేషధనమునిచ్చి యాధనముపై ప
వృత్తిలో చాల భాగము విజ్ఞానపరిశోధనమునకు వ్య
పఱచుచుండవలెనని నియమించిరి. పరిశోధన చేయవ
కొన్నివిషయముల పట్టిక నొకదానిని తామే సిద్ధముచే
అందు ముప్పదియెనిమిది విషయము లుండెను. వాని
నైదువిషయములు స్త్రీలకు సంబంధించినవి. వాని నన్ని
మాత్రమేకాక స్త్రీలకు సంబంధించిన యితర విషయము
గూడ తీసికొని నేనీ గ్రంథమాలారచనకు పూనుకొంటి
ఈగ్రంథముల నన్నిటినిగూడ విద్యాపీఠమువారు శ్రీమంతు
గారిచ్చిన ధనమువలననే ముద్రించుచున్నారు. కావున

నాంధ్రగీర్వాణవిద్యాపీఠముద్వారా శ్రీవల్లూరి సూర్యనారాయణరావుపంతులుగారికి మిక్కిలి కృతజ్ఞుడనై యున్నాను. వారివంటి త్యాగమూర్తులును మానవసేవాపరులును, విజ్ఞానవ్యాపననిరతులును నింకను ననేకులు మన దేశమున నుద్భవింపవలసిన యావశ్యకత యెంతయేని గలదు.

ఈ గ్రంథరచనలో నాకు విశేషముగ తోడ్పడిన మా విద్యాపీఠపండితులగు బ్రహ్మశ్రీ కొంపెల్ల సత్యనారాయణ శాస్త్రిగారికి నేనత్యంతము ఋణబద్ధుడనై యున్నాను. వీరి పాండిత్య మపారము. బుద్ధిసునిశితము. ఓపిక గొప్పది. వీరికి తైత్తరీయశాఖయంతయు కంఠస్థముగ నుండుటయేకాక వేదాంగములయందు చక్కని పాండిత్యమును గొప్ప సాహిత్యజ్ఞానమును గలవు. ఈ మహాపండితుని సహాయమే లేకుండినచో నింత స్వల్పకాలములో నీగ్రంథము వెలువడియుండెడిది కాదు. ఇట్టి విద్వత్పుంగవుల నెట్లుపయోగించుకొనవలెనో మన దేశ మింకను తెలిసికొనలేకుండుట శోచనీయము.

బ్రహ్మలిపిని మించిన నావ్రాతను తెలిసికొనుటలోను నితరవిధములుగను చాల ప్రయాసపడి నాలిఖితప్రతి నచ్చువేసిన సరస్వతీ పవర్ ప్రెస్ వారికి కృతజ్ఞుడను. ఈ గ్రంథములో నిలచిపోయిన అచ్చుతప్పులకు కారణము నేనే కాని వారు కారని చెప్పవలసియున్నది. తప్పొప్పులపట్టికను గ్రంథాన్తమందు వేయుచున్నాను. ఇందుకూడ సవరింపబడక కొన్ని తప్పులు మిగిలియున్నచో పాఠకు లౌదార్యముతో కప్పించి సవరించుకొందురుగాక !

ఈగ్రంథములో చేర్పవలసియుండియు నేను వ
దైచిన యంశములనుగాని నేనీ గ్రంథములో వ్రాసినయంశ
ములలోని తప్పులను గాని నాకెఱుకపఱచిన విమర్శకులకు
నెంతయు కృతజ్ఞుడనై యుందును.

కొవ్వూరు,
పశ్చిమ గోదావరి జిల్లా
3-10-33.

జటావల్లభుల పురుషోత్తము బి. ఏ. ప్రిన్సిపా
ఆంధ్రగీర్వాణవిద్యాపీఠము
మఱియు
శ్రీ వాడ్రేవు జోగాయమ్మ
వేదశాస్త్రకళాశాల, కొవ్వూరు.



# వేదకాలపుస్త్రీలు



## ప్రథమాధ్యాయము

### స్త్రీ సంతతి : పురుషసంతతి

పురుషసంతతి కావలెనను కోరికలు వేదమునఁ జాల గలవు. కాని స్త్రీసంతతి గావలెనను కోరిక లట్లు గానరావు. స్త్రీసంతతి కావలెనను కోరిక ఋగ్వేదములో నెచ్చటను లేనే లేదు. యజుర్వేదములో నొకటి రెండు చోట్ల మాత్ర మట్టి కోరిక గాన్పించుచున్నది. స్త్రీసంతతివలన నుపయోగములు తక్కువ యగుటయు స్త్రీలు పురుషులకంటె నెక్కుడు కష్టములనుభవింపవలసినవారుగ నుండుటయు నిందులకుఁ గారణములని చెప్పవచ్చును. అపుత్రత యనునది చాల దురవస్థగ భావింపబడుచుండెను.

మానో అగ్నేమతయే మావీరతాయైరీరథః॥

(ఋ.సం. 3వ మండలము, 16 వ సూక్తము, 5వ ఋక్కు)

అర్థము :—ఓ అగ్నీ నీవు మమ్ములను అపుత్రతకు విషయభూతులనుగఁ జేయకుము.

వీరులను పదము వేదములో తఱచుగ పురుషులను

నర్థమున వాడబడుచుండును. మమ్ములను పురుషసంత... వారినిగఁ జేయకుమనియే యిందుఁ బ్రార్థన కలదు ... స్త్రీసంతతి లేనివారినిగ జేయకుమని కాదు. దీనింబట్టి పుర్థ... సంతతి స్త్రీసంతతికంటె నెంత యుత్కృష్టమైనదిగ భా... బడుచుండెడిదో తెలియగలదు.

ఈక్రింది మంత్రములో పుత్రప్రాప్తికై ప్రార్థనగ... కాని పుత్రికాప్రాప్తికై లేదు.

రాకా...దదాతు వీరం శతదాయముక్థ్యం॥

(ఋ. సం. ౨—3౨...

అర్థము :—వీరుడైనట్టియు బహుధనము గలిగినట్టి... పుత్రుని నిండుపున్నమి నా కిచ్చుగాక!

ఈక్రింది ఋక్కులోఁ గూడఁ బుత్రులకొఱకే ప్ర... గలదు.

ఉష స్తమస్యాం యశసం సువీరం
దాసప్రవర్గం రయిమశ్వయుధ్యం॥ (ఋ. సం. 1—92...

అర్థము :—ఓ ఉషోదేవతా, కీర్తితో కూడు... నట్టియు వీరులగు పుత్రాదులు గలిగినట్టియు దానజనవ... గలిగినట్టియు నైశ్వర్యమును నేను పొందుదును గాక!

ఇచ్చట 'సువీరం' అనుటచే వీరులగు పుత్రులు ... బడిరని తెలియుచున్నది. కాని వీరురాండ్రగు పుత్రి... గూడ నిందు గ్రహింపఁబడలేదా యను ప్రశ్న రావచ్చు... ఏమన, స్త్రీలు యుద్ధము చేయుట వేదములో నచ్చటచ్చ...

న్పించుచున్నది. కాని యుద్ధముచేయు స్త్రీలు బహుస్వల్ప ముగ నుండిరి గావున నిచట వీరపదము పురుషసంతతి యను పుర్థముననే వాడబడినదని చెప్పవలసియున్నది.

ఎచటఁ జూచినను పుత్రులకై కాంక్ష కాన్పించు చున్నది.

దేవానాం పత్నీరుశతీరవన్తునః ।
ప్రావన్తునస్తుజయేవా జసాతయే॥ (ఋ.సం. 5—46—7)

అర్థము:—దేవపత్నులు బలవంతులగు పుత్రుల నొసఁగి మమ్ములను రక్షింతురుగాక !

ఋగ్వేదములో పుత్రులకై యిన్ని స్థలములలో ప్రార్థన లుండ నిందొక్కచోటను గూడ స్త్రీసంతతి కోరఁ బడకుండుట చూడ నాకాలమున పురుషసంతతియొక్క ప్రాముఖ్యము స్పష్టమగుచున్నది.

సంతానము ముఖ్యప్రయోజనముగా గల వివాహము లో వధూవరులకు చేయబడు నాశీర్వచనములో నిట్లున్నది.

ఇహైవస్తంమావియోష్టం విశ్వమాయుర్వ్యశ్నుతం
క్రీళన్తౌపుత్రైర్నప్తృభిర్మోదమానౌ స్వే గృహే॥
(ఋ. సం. 10—85—42)

అర్థము:—ఇచట నుండుడు. వేరు కాకుండుడు. పూర్ణాయుస్సును పొందుడు. పుత్రులతో మీగృహమందు సంతోషించుచు క్రీడించుచు నుండుడు.

ఇందు పుత్రపౌత్రప్రాప్తియే కోరబడినది. కాని

దుహితృదౌహిత్రప్రాప్తి కోరబడలేదు. దీనింబట్టియే
కాలములో స్త్రీ పురుష సంతతుల నడుమ నెట్టి
ముండెడిదో తెలియుచున్నది.

పైన నుదాహరింపబడిన విధమగు ప్రార్థనలు వేదము
ననేకములున్నవి. యజుర్వేదములో మాత్ర మొకట
చోట్ల స్త్రీసంతతి కోరబడుచున్నదని పైన చెప్పబడినది.
చోట్ల పురుషసంతతియే ప్రధానముగ కోరబడియు
గమనింపదగిన విషయము.

పుత్రిణేమా కుమారిణా విశ్వమాయుర్వ్యశ్నుతం

(తై. సం. ప్ర. 1

అర్థము :—పుత్రులుగల మీరు కుమార్తెలు
వారై పూర్ణాయుర్దాయమును పొందుడు.

అన్నిటిని పరిశీలించిచూడ పురుషసంతతి స్త్రీస
కంటె నెక్కుడు వాంఛనీయముగ నుండెడిదని స్పష్ట
తెలియుచున్నది.

ఇది యిట్లుండ దత్తపుత్రునకును నౌరసపుత్రిక
నడుమ నెట్టి భేదమున్నదను నంశమున వేదమేమి చెప్పు
చూతము.

నహి గ్రభాయారణః సుశేవోన్యోదర్యో మనసామ న్తవా
అథాచిదోకః పునరిత్సఏత్యాను వాజ్యభీషాడేతునవ్య

(ఋ. సం. 7-

అర్థము :—సంతోషపెట్టెడు అన్యోదర్యుడు (అ

తరులకు జన్మించినవాడు) సుఖమును గలుగచేసెడివాడై
హించుటకొఱకు మనస్సుచేతనైనను తలచుటకు తగిన
వాడుకాడు. మఱియు వాడు తనజన్మస్థానమునకే తిరిగి పోవు
వాడు. కావున అన్నము గలిగినట్టియు, శత్రువులను తిరస్కరిం
చినట్టియు నూతనుడైనట్టియు పుత్రుడు మమ్ముల నుద్దేశించి
చ్చునుగాక !

దీనింబట్టి యితరులకు బుట్టినవాడు పుత్రుడుగ వ్యవహ
రింపబడుట నాగదని చెప్పబడుచుండుటచే నానాడు దత్తత
యుండి యున్నను నది యందఱకును తృప్తికరముగ లేకుండి
నట్లు తెలియుచున్నది. ఆత డన్యోదర్యుడగుటయే యిందు
కు గారణము. కుమారితె కలవాడు దత్తత చేసికొనరాదను
సూచన యిందుగలదు. ఏమన నామె అన్యోదర్యకాదు.
కావున దత్తునికంటెను సన్నిహితయే.

కావున దుహిత యౌరసపుత్రునికంటె తక్కువయే
గాని దత్తపుత్రునికంటె నెక్కువయని తేలుచున్నది.

దుహితృదౌహిత్ర సంపత్తి యనిష్టముకాదని మాత్ర
మే చెప్పవచ్చును. ఏమన దుహితృదౌహిత్రుల యోగక్షే
మములకై ప్రార్థనలు గలవు. ఈక్రింది మంత్రమొక యుదా
హరణము.

మం మానః ప్రజాంరీరిషో మోతవీరాన్ ॥(ఋ.స.10-1-8-1)

అర్థము :—(ఓమృత్యువా) నీవు మాయొక్క దుహి

తృదాహిత్రాత్మకమగు సంతతిని వీరులగు పుత్రపౌత్ర
హింసింపవలదు.

స్త్రీసంతతి పురుషసంతతియంత ప్రయోజనకారి
డుటయు పురుషసంతతికంటె నెక్కుడు దుఃఖభాజనమగు
నను హేతువులచేత పురుషసంతతి స్త్రీసంతతికంటె నెక
వాంఛనీయముగ నుండెడిదని యిదివఱలో చెప్పబడినది.

ఇపుడు స్త్రీసంతతి పురుషసంతతి యంత ప్రయో
కారి కాదనుటకు గల హేతువులను విచారింతము.

(1) పుత్రులును పౌత్రులును మాత్రమే తమ
నుండువా రగుటచేతను దుహితలును దౌహిత్రులును
మున నుండువా రగుటచేతను పుత్ర పౌత్రులు తమ కుట
ములోనివారుగను దుహితృ దౌహిత్రులు పరకుటుం
లోనివారుగను భావింపబడుచుండిరి. ఆ కాలములో కుట
వృద్ధి విశేషముగ కాంక్షింపబడుచుండెను. కావుననే పు
తతి వలననే తలిదండ్రులు సంతోషమును బొందుట
లగుచుండెడిది. దుహితలవలన నట్టి యానందము
నాటి కుటుంబస్థితి యీరీతిగ నుండెడి దనుట క్రింది
యొక యాధారము.

ఉష స్తచ్చిత్రమాభరాస్మభ్యం వాజినీవతీ యేనతో
తనయంచ ధామ

అర్థము :—అన్నక్రియగల యో ఉషోదేవతా,

ధనముచేత మేము పుత్ర పౌత్రులను పోషింతుమో యా ధనమును మా కిమ్ము.

కుటుంబములో పుత్ర పౌత్రులకే కాని దుహితృ దౌహిత్రులకు తావు లే దని యిందువలన దేలుచున్నది.

ఆడుపిల్ల నెంత దూరముగ బారనైచిన నంతమంచిదను నూహ యాకాలమున నుండెడిది. ఇందుల కనేక హేతువు లుండవచ్చును. దుహిత తఱచుగ వచ్చి కానుకలను గొనిపోకుండుటయు నుభయపక్షములవారికిని కలహముల కవకాశము లేకుండుటయు మున్నగు ననేక హేతువులచే కుమార్తెకు దూరమున సంబంధము చేయుట మంచిదని మన పూర్వు లూహించి యుండవచ్చును. యాస్కాచార్యుడు దుహితృశబ్దమునకు వ్యుత్పత్తిని వ్రాయుచు 'దూరేహితా' యనగా 'దూరముగ నుండినచో మంచి' దని చెప్పియుండుట కిదియే హేతువు.

దీనింబట్టియే స్త్రీసంతతి యెంత నిస్సంగతతో చూడబడుచుండెడిదో తెలియుచున్నది.

(2) ఆదినములలో యుద్ధవీరుల కెక్కుడుగ నవసరముండెడిది. పైన నుదాహరింపబడిన 'దేవానాం పత్నీ రుశతీరవన్తునః ! ప్రావన్తునస్తుజయేవాజసాతయే' అనుచోట బలవంతు లగు పుత్రులు కావలె నని కోరబడుట కిదియే హేతువు. అట్లే వీరు లగు పుత్రులు కావలె నను కోరిక లనేకస్థలములలో నున్నవి. 'సహిగ్రభాయాం రణః' మున్నగు

ఋక్కులో శత్రువులను తిరస్కరించునట్టి పుత్రుడు కోరబడి నాడు. ఈవిధముగ యుద్ధమున కుపకరించువారు పురుషులే కావున పురుషసంతతియే యాకాలములో గోరబడుచుండె నని చెప్పవచ్చును. స్త్రీలలో యోధురాండ్రు లేరా యను ప్రశ్న రావచ్చును. అట్టివా రరుదుగ నుండెడివారు. కాని సాధారణముగ పురుషులే యుద్ధము చేసెడివారు. కావున పురుషసంతతికై ప్రార్థన లున్నవి. అరుదుగమాత్రమే స్త్రీ యుద్ధము చేసెడివా రను నంశము స్థలాంతరమున నిరూపింప బడును.

(౩) నేటివలెనే నాడుకూడ మరణానంతరము చేయ వలసిన కర్మ ప్రధానముగ నెంచబడు చుండెను. దానిని పుత్రుడే చేయుచుండెను. కాని పుత్రిక గాదు. పుత్రులు నపుడు పుత్రికలును చేయుచుండిరి. కావున జీవితకాలము కాక జీవితానంతరమునకూడ పురుషసంతతియే ప్రయోజనకారి యని తెలియుచున్నది.

పురుషసంతతియే యెక్కుడు ప్రయోజనకారి యనను కింకను ననేకహేతువులు గలవు. కాని పైన నిచ్చినవి చాలు నను నూహతో మిగిలినవానిని వదలుచున్నాను.

స్త్రీసంతతి పురుషసంతతికంటె నెక్కుడు దుఃఖభా ముగ నుండెడి దని పైన చెప్పబడినది. అందులకు గల తువులను గొన్నిటి నీక్రింద నిచ్చుచున్నాను.

(1) స్త్రీ యొక్క సౌభాగ్యము తన యర్హత పై మాత్రమే కాక భర్తయొక్క సౌజన్యముపైనను ప్రయో

కత్వముపైనను గూడ నాధారపడి యుండెడిది. ఆమె యెంత యోగ్యురా లయినను నాతడు సరియగువాడు కానిచో నామె జీవితము దుఃఖభాజనమే. భర్త జూదరియై ధనము నంతయు పాడుచేసినచో నామె యాదారిద్ర్యము ననుభవించుటయే కాక యితరములగు కొన్నికష్టములను గూడ ననుభవింపవలసి యుండెను. ఈవిషయమై యీక్రింది ఋక్కు పరికింపదగును.

మం॥ అన్యేజాయాం పరిమృశన్త్యస్య యస్యాగృధద్వేదనే
వాజ్యక్షః॥ (ఋ. సం. 10—34—4).

అర్థము:—ఏ జూదరియొక్క ధనమును బలవంతుడగు ద్యూత దేవతహరింప యత్నించునో, యతని భార్యను నితర ద్యూతకారులు పట్టుకొని లాగుచున్నారు.

భర్త జూదములో ధనమును పోగొట్టుకొనుచో నాతని భార్యను నితరద్యూతకారులు హింసింతురనుట కంటెను స్త్రీల భర్త్రధీనతను తెల్పుట కింకేమి కావలెను?

2. వైధవ్యమొందుటయు భర్తచే విడువబడుటయు నను దురవస్థలు స్త్రీకి ప్రాప్తించు చుండెడివి. పురుషునకన్న పునర్వివాహముండెడిది. ఈ విషయము స్థలాంతరమున ఋజువుచేయబడును.

(౩) వివాహమైన స్త్రీలకుగూడ సవతులవలని బాధ తఱచుగ నుండుటచే స్త్రీ కొక్కొక్కపుడు దాంపత్య జీవితము సుఖముగ నడచుచుండెడిది కాదని యూహింపవలసియున్నది. ఈ విషయములు స్థలాంతరమున నిరూపింపబడును.

ఈ హేతువులచేత స్త్రీ సంతతి పురుషసంతతి య
వాంఛనీయముగ నుండెడిదికాదని తెలియుచున్నది. దౌ
త్రసంపత్తి విషయమై యొకటి రెండు మాటలు చెప్ప
యున్నది. దుహిత కలుగుటకై ప్రార్థనలు లేనిమాట వా
వమే కాని దుహిత జన్మించినచో నామెకు పుత్రులు గ
వలెనను కాంక్ష స్వల్పముగ గాన్పించుచున్నది. అ
దుహితకంటెను దౌహిత్రసంపత్తియే యెక్కుడభిలషిత
నుండెడిది.

ఈ విషయమై యీక్రింది ఋక్కు నించుక పరిశీ
వలసియున్నది.

అశ్రవంహి భూరిదావత్తరా వాం ।
విజామా తురుతవా నూస్యాలాత్ ।

(ఋ. స. 1–109-

అర్థము :—ఓయింద్రాగ్నులారా, మీరు గో
తలు. అల్లునికంటెను బావమరది కంటెను గూడ నె
దాతలు.

అల్లుడు దాతయని యిచట చెప్పబడియున్నది. విద్యా
పాదులచే హీనుడగువాడు కన్యాదాతకు ధనమిచ్చి వి
మాడును గావున నిచట నల్లుడు దాతగ చెప్పబడి
సాయణాచార్యు లనుచున్నారు. కాని యీ మంత్రమే
ఋగ్వేదములో (ఋ. సం. 1–1–14–1) వచ్చినపుడచట
మంత్రాయుచు సాయణాచార్యులు అల్లుడు దౌహిత్రసం

నిచ్చువాడుగావున దాతయని చెప్పియున్నారు. ఒకేమంత్రము రెండుస్థలములలో వచ్చినపుడు ప్రకరణ భేదము లేకున్నను గూడ సాయణాచార్యులు భిన్నములగు నర్థములను వ్రాయుట వింతగనే యున్నది. ఈరెండర్థములు నొకరే వ్రాసినవగుటచే నిందేది మనము గ్రహించినను గూడ వారిపట్ల నిరాదరణ చూపినట్లు కానేరదు. అల్లుడు దౌహిత్రసంపత్తి నిచ్చువాడు గావున దాతయను నర్థమే యీరెంటిలోను నెక్కుడు ప్రశస్తముగ నున్నది. ఏమన ధనమిచ్చి కన్యను కొనువాడు మామ గారికి దాతయని చెప్పుటలో నౌచిత్యము గాన్పింపదు. దాతృ శబ్దము క్రయికు డను నర్థమున వాడబడినదని చెప్పుట యుచితముగాదు. దౌహిత్రసంపత్తి నిచ్చువాడు దాతయని చెప్పుట సమంజసముగనే యున్నది. ఏమన? దౌహిత్రుడు పుత్రునంత ప్రధానుడు గాకున్నను కొంచెము తక్కువగ నంతవాడేయను భావము వేదకాలములో నుండెడిదని చెప్పుట కాధారము లేకుండ లేదు.

శ్లో॥ ఔరసోధర్మపత్నీజస్తత్సమః పుత్రికా సుతః॥

ధర్మపత్నివలన జన్మించినవాడు ఔరసుడు. పుత్రిక యొక్క కుమారుడు ఔరసునితో సమానుడు.

అని యాజ్ఞవల్క్యస్మృతి చెప్పుచున్నది. పుత్రికకును దుహితకును భేదము లేకుండ లేదు. పుత్రికాపుత్రుడు పుత్ర తుల్యుడని యిందున్నది కావున పుత్రికాత్వము నొందకుండిన

దుహితకు గలుగువాడు పుత్రునికంటె కొంచెము తక్కు
యని చెప్పవచ్చును.

మఱియు,

శ్లో॥ పౌత్ర దౌహిత్రయోర్లోకే విశేషోనోపపద్యతే॥

అర్థము:—పౌత్రునకును దౌహిత్రునకును భేదః
లేదు.

అని మనుస్మృతిలో నున్నది. దీనింబట్టి కూడ దౌ
త్రుని ప్రాముఖ్యము తెలియుచున్నది.

స్మృతులయందు గాన్పించు నిట్టి యంశములను బ
శ్రుతులనాటి దౌహిత్రుని విషయికమైన ప్రజల యభిప్రాయ
నూహింపవచ్చును. అల్లుడు దౌహిత్రసంపత్తి నిచ్చువా
గావున దాతయను సిద్ధాంతమునకీ యూహ బలము నొస
చున్నది.

స్మృతులలోని యభిప్రాయమును బట్టి శ్రుతులనా
పరిస్థితుల నూహించుట యన్నిచోట్లను సరియగునని చె
లేము గాని విద్యారణ్యులొక శ్రుతికి చెప్పిన రెండర్థ
ములలో దేనిని మనము గ్రహింపవలెనను విచారణ చేయునపు
మన యూహలకు స్మృతు లెంత బలము నొసగుచున్నవో
చూడవచ్చును. స్మృతులలో ఆసురవివాహములు గూ
నున్నవి కావున రెండవ యర్థమునకు మాత్రము స్మృతుల
బలము నొసగుటలేదా యను శంక రావచ్చును. కాని దౌ
శబ్దము క్రయకుడను నర్థమున వాడబడెనని చెప్పుట సమ

జనము కాకుండుటచే నీ విషయము విచారణకే రాదు.

వేదకాలములో స్వయముగ తనకు జన్మించిన దైన స్త్రీకంటె నామెకు జన్మించిన పురుషసంతతియే యెక్కుడు సంతోషదాయకముగ నుండెడి దని యిందువలన తెలుచున్నది. ఈ యంశము ఆకాలములో పురుషసంతతి స్త్రీసంతతికంటె నెక్కుడు వాంఛనీయముగ నుండెడిదను సిద్ధాంతమును బలపఱచుచున్నది.



## ద్వి తీ యా ధ్యా య ము



### వి వా హ ము

ప్రాచీనసంఘములలో కొన్నిటియందు వివాహసంస్థ యనునదియే లేదని చరిత్రకారులు చెప్పుచున్నారు. మానవులు కూడ పశు, పక్ష్యాదులవలెనే వ్యవహరించుచుండిరి. అట్టిసంఘములవారు క్రమక్రమముగ నాగరకత కలవడి వివాహసంస్థ నేర్పరచుకొనిరి. హిందూదేశములో మాత్రము అట్టి సంఘమెన్నడును లేదు. అతి ప్రాచీనకాలమునుండియు ననగా మానవుని దృష్టి పూర్వమునకు పరుగిడ గలిగినంతవరకు నెచ్చట చూచినను గూడ వివాహసంస్థ నేటివలెనే నియమబద్ధమై యున్నట్లు కాన్పించుచున్నది.

విదేశములందుకూడ కొన్నిచోట్ల అనాదిగ వివా
సంస్థ యున్నది. కాని యాదేశములకును హిందూదేశము
కును నీవిషయమై యొక భేదమున్నది. కేవలము విష
లోలతను పురస్కరించుకొనియే యచటి వివాహసంస్థ యే
డినది. హిందూదేశమునందలి వివాహసంస్థకన్నో ధర్మ
మూలహేతువు. అర్థకామము లాహేతువున కంగములు.
యెట్లో విచారింతము.

యజ్ఞములద్వారా దేవతలను సంతోషపెట్టుట మా
వుని ధర్మమని వేద మతము చెప్పుచున్నది. దేవతలను
తోషపరచుట యెట్లో యను విషయమే వేదమువలన
యుచున్నది. యజ్ఞయాగాదులందులకే యుద్దేశింపబడి
వానిని చేయుట మానవుని విధి. ఈవిధిని నెరవేర్చుటకు
లము పురుషుడుగాని కేవలము స్త్రీగాని చాలరనియు భా
భర్తృ సంబంధముగల స్త్రీపురుషులు దీనిని చేయుటయే
కాలములోనియాచారమనియు స్త్రీలు—కర్మకాండయను
రణమున స్పష్టపరుపబడినది. కావున యజ్ఞమనుధర్మమును ని
హించుటకు వివాహ మవసరమాయెను. పత్ని లేకుండ పురు
నకు ఈధర్మమును నిర్వహించుట కధికారము లేకుండుటచే
స్త్రీయొక్క ప్రాముఖ్యమును వివాహముయొక్క యావశ్య
యును తెలియుచున్నవి.

అర్థముకూడ ఆర్యుల వివాహమునకు గల హేతు
లలో నొకటి. భార్యవలననే గృహముగ నిలచియున్న

యానాటి యభిప్రాయము. "జామేద స్తం" అను ఋగ్వేద వాక్యము ఈవిషయమునే తెలియజేయుచున్నది. "పత్నీ పారీణ హ్యాస్యేశా" అను యజుర్వేద వాక్యము కూడ నీయర్థమునే చెప్పుచున్నది. ధనార్జనమునకు కాకున్నను ధనరక్షణమున కును ధనమును సద్వినియోగము చేయుటకును, వివాహమవ సరమైనట్లు ఇందువలన తెలియుచున్నది.

ఇక కామ మన్ననో యదికూడ వివాహమునకు గల ముఖ్య హేతువులలో నొకటి యని చెప్పవలసి యున్నది. యుక్తవయస్కు లగు స్త్రీ పురుషులు పతి పత్నులకొరకు పరి తపించుచుండినట్లు వేదములో చాలచోట్ల గలదు.

పైన చెప్పబడిన ధర్మకామముల రెంటికిని సంబంధిం చిన వివాహ ప్రయోజనము మరియొకటి గలదు. అది వే దన సంతానప్రాప్తి. ఇది ధర్మమునకు సంబంధించిన దని చెప్పుటకు తైత్తిరీయ సంహితలోని యాక్రింది వాక్యము ప్రమాణము :—

జాయమానో వై బ్రాహ్మణః। త్రిభిర్ ఋణవా జాయతే। బ్రహ్మచర్యేణ ఋషిభ్యో యజ్ఞేన దేవేభ్యః। ప్రజయా పితృభ్యః। శేషవా అనృణో యః పుత్రీయజ్వా బ్రహ్మ చారివాసి॥ (6–3–10–4)

అర్థము :—బ్రాహ్మణుడు మూడు ఋణములతో పుట్టుచున్నాడు. అవి యేవన, ఋషిఋణము, పితౄణము, దేవఋణము. వేదము జదువుటచేత ఋషి ఋణము దీరును.

పుత్రుని గనుటచేత పితృౠణము దీరును. యజ్ఞములు చే
టచేత దేవఋణము దీరును.

పుత్రుని గని పితృౠణము తీర్చవలె నని విధి
దున్నది. కావున ధర్మముకొరకు పుత్రుని గనవలసియున్న

మానవులకు స్వభావసిద్ధమగు నొక హృదయావేశ
ఉపశమింప జేసికొనుటకు గూడ పుత్రోత్పాదన మవసర
పురూరవుడు పుత్రుడెప్పుడు కలుగునా యని ఈక్రిందివిధ
బరితపించినాడు.

కదాసూనుః పితరంజాత ఇచ్ఛాచక్రనాశ్రువర్త్తయ ద్వి
నన్ । కోదం పతీసమనసావియూ యోద ధయత్ ।

(10—95-

అర్ధము:—కుమారుడు పుట్టి తండ్రిని ఎప్పుడు కో
నోగదా! ఎప్పుడు కన్నీళ్లు కార్చునోగదా! సమానమన
లగు మాదంపతులను ఎప్పుడు విడదీయునోగదా!

ఈవిధము లగు పుత్రునికై కోరికలు చాల గల
ధర్మము కొఱకును, అర్ధము కొఱకును కామము కొ
కును గూడ వివాహ ముద్దేశింపబడినదని యింతవఱకును
నది. ఇన్ని పురుషార్థములను నెఱవేర్చుటకు సాధన
గావుననే భార్యకు విశేషగౌరవ మీయబడినది. భార్య భర్త
పుత్రుల నిచ్చునదనుటచే నామె యాతని కమృతమును ప్ర
దించున దగుచున్నదని వేదములో చెప్పబడియున్నది.
నగా దేవతలకు భక్షణీయమగు అమృత మున్నట్లే మా

లకు సంతానరూపమగు నమృతమున్నది. పుత్రులు గలవాడు మరణించినను గూడ జీవించియున్నట్లే యర్థము. ఏమన: పురుషుడు తానే పుత్రునిరూపమున జన్మించుచున్నాడు. తన దేహము నశించినను పురుషుడున్నచో తానీలోకమున నున్నట్లే యర్థము.

ప్రజాభిరగ్నే అమృతత్వమశ్యాం॥

(తై. సం. (1–4–46–1)

అర్థము:—ఓ అగ్నీ మేము సంతానమువలన అమృతత్వమును పొందెదము.

పురుషుడే పుత్రుడై పుట్టుటయే యిందులకు కారణమనుటకు చాల ప్రమాణములను చూపవచ్చును.

ప్రజామనుప్రజాయసే।
తదు తేమర్త్యామృతం॥ (తై. బ్రా. 1–5–26)

అర్థము:—ఓ మనుష్యుడా, నీవు సంతానము ననుసరించి పుట్టుచున్నావు. ఆసంతానమే నీ కమృతముగదా!

ఆత్మావై పుత్రనామాసి॥ (తై. మం. ప్ర. 2–11)

అర్థము:—తానే పుత్రునిపేర బఱగుచున్నాడు.

భార్య భర్తకు జన్మ నిచ్చుచున్నదని యిందువలన తెలియుచున్నది. ఇట్టి మహోపకారము చేయునది కావుననే భార్యకు గౌరవస్థాన మొసగబడెను. తనజీవితకాలములో

సమస్తసౌఖ్యముల నిచ్చుటయేకాక తనకు పునర్జన్మను, అ
తత్త్వమును నొసగెడు భార్య కేవలము పశువాంఛను తీ
ర్చుటకుద్దేశింపబడిన పదార్థముగ భావించుట వైదిక
మున కెంత విరుద్ధమో దీనివలన తెలియుచున్నది. భా
వలని యీప్రయోజనమును వేదము బాగుగ గుర్తించు
న్నది. భార్యకు జాయ యనుపేరు వేదములలో గాన్పించు
బట్టియే యీసంగతి తెలియుచున్నది. 'జని' ధాతువు
'పుట్టుట' యని యర్థము. జాయ యనునది యాధాతువు
డియే వచ్చినది. భర్త తనయందు పుట్టుచున్నాడు గావు
భార్యకు జాయ యనుపేరు వచ్చినది. ఈవిషయము బహ్వృ
బ్రాహ్మణములో నీక్రింది విధముగ నున్నది.

పతిర్జాయాంసం ప్రవిశతి । గర్భోభూత్వేహమాతరం।
తస్యాం పునర్నవోభూత్వానవమే మాసిజాయతే।
తజ్జాయా జాయాభవతి యదస్యాం జాయతేపునః॥

(ఐతరేతబ్రాహ్మణము 7-3-

భర్త భార్యలో ప్రవేశించుచున్నాడు. భార్యనే
నిగ చేసికొనుచున్నాడు. తొమ్మిది మాసములు నిండి
కామెయందు క్రొత్తగ పుట్టుచున్నాడు. భర్త భార్యయం
జన్మించుచున్నాడు కావుననే భార్యకు జాయ యనిపే
ఈయభిప్రాయమే ఋగ్వేదములోని యీక్రింది వాక్యము
నున్నది.

జజ్ఞిష ఇత్థాగోపీథ్యాయ॥ (ఋ. సం. 10–95–11)

అర్థము:—(ఓ పురూరవుడా) నీవు భూమిని పాలించుటకొఱకు పుట్టుచున్నావు.

పురూరవునకు కుమారుడు పుట్టబోవు సమయమున నీమాటలు చెప్పబడినవి.

పైన చెప్పబడిన యంశములు వివాహప్రయోజనమును భార్యా ప్రయోజనమును భార్యయొక్క గౌరవార్హతను వేనోళ్ల చాటుచున్నవి. వివాహమువలన భార్య భర్తకులాభకారిణియగుటయు గౌరవస్థానమును పొందుటయు మాత్రమే కాక తానుగూడ భర్తతోపాటు కొన్నిలాభములను పొందుచుండెను. యజ్ఞములో భర్తతోపాటు పాల్గొనుటచే యజ్ఞఫలము ననుభవించును. భార్య సంతానము నిచ్చి భర్తకుత్తర లోకములో లాభకారిణి యగుచుండెనని చెప్పుటచే నామెకు కూడ సంతానమువలని యీ ప్రయోజనము గలుగుచుండెనని తెలియుచున్నది. ఏమన: భర్త యేలోకమున కేగిన భార్య యాలోకమున కేగునని వేదముల యభిప్రాయము. (దాంపత్యమను ప్రకరణమున నీవిషయము స్పష్టపరుపబడినది) అర్థవిషయకమగు లాభమునుగూడ భార్య సహజముగ భర్తతోపాటు పొందును.

ఉభయులకును నిన్నివిధముల లాభకారి కావుననే వివాహ మత్యవసరమని వేదములనాటి యభిప్రాయము.

వివాహముకాకుండుట చాల దురదృష్టమని నాడు భా
చుండిరి. ఒకడు తనకేబదిమంది భార్యలు లభించిన
పరమానందభరితుడై తనకా భార్యలనిచ్చిన దేవతను
పరవశతతో స్తుతించినాడు. ఒకచోట భార్యలు లేని
భార్యలు గలవారినిగ చేయువాడని యింద్రుడు కొని
బడినాడు. భర్త దొరకక కన్యగనే నిలచియున్న యొక
తికి అశ్వినీదేవతలు భర్త నిచ్చినందుల కీవిధముగ స్తుత
బడినారు.

అమాజురశ్చిద్భవథోయువం భగోగః॥

(ఋ. సం. 10

అర్థము:—ఓ అశ్వినీదేవతలారా, మీరు పితృ
ములో జీర్ణించుచున్న స్త్రీని రూపవతినిచేసి యామె
నిచ్చిరి.

ఇంతగ నభిలషణీయమగు వివాహము వేదకాల
స్త్రీల కేవయస్సున జరుగుచుండెనో విచారింతము.

స్త్రీ కెన్నవసంవత్సరమున వివాహ మగుచు
మనము చెప్పలేము. కాని యౌవనము వచ్చినపిమ్మ
వివాహమగుట యానాటి యాచారమనిమాత్రము స్పష్ట
తెలియుచున్నది.

ఏమన: స్త్రీకి యువకుడగు భర్త కావలెనను
బయలుదేరిన పిమ్మటనే వివాహమగుచుండెనని కొన్ని
త్రములవలన తెలియుచున్నది.

స్తోమం జుషేథాం యువశేవకన్యానాం
(ఋ. సం. 8–35–5)

అర్థము:—ఓ అశ్వినీదేవతలారా, యువకులు కన్యల యాహ్వానమును స్వీకరించునట్లు మాకీస్తోత్రమును స్వీకరించుడు.

స్త్రీకి భర్తకావలెనను కోరిక పిన్నవయస్సుననే యుండవచ్చునుగాని యువకుల నాహ్వానించుటమాత్రము యౌవనము వచ్చినపిమ్మటనే కాని జరుగదు.

వివాహమునకు పూర్వము వధువు సామాన్యముగ భర్తను కోరుచున్నట్లు చెప్పబడిన స్థలములుగూడ గలవు.

సూర్యాం యత్పత్యేశంసంతీం మనసాసవితాదదాతు.
(ఋ. సం. 10–85–27)

అర్థము:—సూర్యుడు పతినిగోరుచున్న సూర్యను మనఃపూర్వకముగా సోమున కిచ్చెను.

స్త్రీ స్వయముగ భర్తను కోరుకొను నాచారముగూడ నాకాలములో నుండెనని యీప్రకరణములోనే ముందు స్పష్టపఱుపబడును. మదనవికారముల నెఱుగక లోకజ్ఞానము లేక యుండు బాలికలు స్వయంవరము చేసికొనెడివారనుట కంటె యౌవనమువచ్చి కొంత జ్ఞానము సంపాదించినవారే స్వయంవరము చేసికొనెడివారనుట యెక్కుడు యుక్తియుక్తముగ నుండును.

మఱియు వివాహసమయమునకు వధువుయొక్క శరీ

రము బాగుగ పెరిగి యుండెనని తెలియుచున్నది.
కుమార్తెయైయున్న సూర్య యిట్లు చెప్పుచున్నది.

ఉదీర్ష్వాతో విశ్వావసో నమసేళామహే త్వా।
అన్యామిచ్ఛప్రఫర్వ్యం సంజాయాం పత్యాసృజ॥
(ఋ. సం. 10-85-

అర్థము:—ఓవిశ్వావసుడా! నిన్ను నమస్కరించి స్తుతించుచున్నాను. పెద్దనితంబములుగల మఱొకతెను కోరుకొనుము. భార్యనగు నన్ను భర్తయొద్దకు చేర్పుము.

ఇచట గంధర్వుడు పెద్దనితంబములు గలిగి యున్న కన్యగనేయున్న స్త్రీ నాశ్రయించుటకై కోరబడుచున్నాడు. 'పెద్దనితంబములుగల' యను విశేషణము కన్యయొక్క యౌవనోత్పత్తిని సూచించుచున్నది.

వివాహమైనది మొదలు వధువు భర్తృగృహము యుండవలెనను నియమము వేదకాలములో నుండెను. బా వివాహములు జరుగు సంఘములో నీనియమముండుట మంజసము. అవ్యక్తురాలగు బాలికను భర్తతో కాపు చేయించునాచార మాకాలములో నుండెనని చెప్పుట నాటి నాగరికతకు మహోపచారము చేయుటయే యగు ఇంతియేకాక యట్టి బాలిక గృహిణియగుట శశవిష తుల్యము. ఆకాలములో వివాహమైనది మొదలుకొనియే భర్తృగృహమున నుండెనని చెప్పుట కనేకాధారము లున్న

ప్రేతోముంచామి నాముతస్సు బద్ధామముతస్కరం॥
(ఋ. సం. 10-85-

అర్థము:—ఈకన్యను తండ్రి గృహమునుండి విడిపించుచున్నాను. ఈభర్తృగృహమునుండి విడిపింపను. ఇచ్చట నీమెను బద్ధురాలనుగ చేసినాను.

ఇంకను వివాహము పూర్తి కాకపూర్వము వరుణుడు పైవిధముగ చెప్పుచున్నాడు. వివాహమాదిగ వధువు భర్తృగృహమున నుండుట వేదకాలములోని యాచారమని యిందువలన తెలియుచున్నది.

వివాహమునకై భర్తృగృహమున కేగునపుడే వధువు స్థిరముగ నచటనుండి గృహిణీకృత్యములన్నిటిని చక్కబెట్టుటకొఱకు వెళ్లుచున్నదని యీక్రింది ఋక్కువలన తెలియుచున్నది.

పూషా త్వేతో నయతుహస్తగృహ్యాశ్వినా త్వాప్రవహతాం రథేన । గృహాన్గచ్ఛగృహపత్నీ యథాసోవశినీత్వం వదథ మావదాసి ॥ (ఋ. సం. 10–85–26)

అర్థము:—పూషచేయిపట్టుకొని నిన్నిచటనుండి (పితృగృహమునుండి) మఱొక దేశమును (భర్తృగృహమును) పొందించుగాక! అశ్వినులు నిన్ను రథముచేత వెళ్లింతురుగాక! భర్తృగృహమును గూర్చి వెళ్లుము. నీవు గృహస్వామినివై గృహమందున్న వానినన్నిటిని వశమందుంచుకొను దానవై పతిగృహమునందున్న భృత్యాదిజనము నాజ్ఞాపించుచుండుము.

వధువు వివాహముమాత్రము భర్తృగృహమున జరిగియుకొని పితృగృహమునకు మఱలివచ్చి ముందెన్నడో కాపు

రమునకు వెళ్లుట కాక యామె వివాహమాదిగనే భర్తృ
హమున కాపురము చేయుటయే వేదములనాటి యా
మని యిందువలన తెలియుచున్నది.

భర్తృగృహమునకు వెళ్లి యచట నధికారము
చుట, అన్నిటిని వశమందుంచుకొనుట మున్నగునవి చే
టకు సమర్థురాలగు వధు వెంతవయస్సు గలిగియుం
యునో మనమూహించుకొన వలయును. ఇంకను బాల్య
ననేయుండి యౌవనము నొందకుండిన స్త్రీ యిన్ని పను
చక్కబెట్టుకొనజాలదుగదా!

ఇంతియేకాదు. వివాహమునాటికి వధువు మిథు
ర్మకు తగినస్థితిలో నుండెడిదని తెలుపుభాగములు కొన్ని
మునగలవు.

ఇహప్రియంప్రజయా తే సమృధ్యతామస్మిన్గృహే గా
త్యాయజాగృహి । ఏనాపత్యా తన్వంసంసృజ స్వాధా
విదథమావదాథ ॥ (ఋ. సం. 10-8

అర్థము:—ఓవధూ, నీపతిగృహమందుండుము. సం
నముతో వృద్ధినొందుము. ఈగృహమునందు గృహపతిత్వ
కొఱకు మేల్కొనుము. ఈపతితో నీశరీరమును కూర్చు
అనంతరము వృద్ధదంపతులైన మీరు గృహమును పాలిం
కొనుడు.

వధువు తనపతితో శరీరమును కలుపుటకై యుం
దేశింపబడుచున్నదిగదా!

వరుడు వధూపాణిగ్రహణము చేయుసమయమున నీ క్రిందివిధమున చెప్పుచున్నాడు.

తాంపూషఞ్ఛివతమామేరయ స్వయస్యాంబీజం మనుష్యా వప న్తి। యానఊరూవిశ్రయాతే యస్యాముశన్తః ప్రహ రామమశేపం॥ (ఋ. సం. 10–85–37)

అర్థము:—ఓ పూషా, ఎవతెయందు మనుష్యులు బీజమును చల్లుదురో, ఏస్త్రీ మాయూరువులను కోరుచున్నదో ఎవతె యొక్క యూరువులయందు కోరికగల మేము పురుష లింగమును స్పృశింపచేయుచున్నామో యట్టి యత్యంత మంగళభూతయగు నామెను బాగుగ ప్రేరేపింపుము.

వధువు వరుని యూరువులను కోరుచున్న ట్లిందువలన తెలియుచున్నది. ఇది కూడ వధువు యావనవతి యగుటను సూచించుచున్నది.

ఈవిషయమై యీక్రింది ఋక్కును కూడ పరికింప దగును.

అశ్రీరా తనూర్భవతి రుశతీ పాపయాముయా।
పతిర్యద్వధ్వో వాససాస్వ మంగ మభిధిత్స తే॥

(ఋ. సం. 10–85–30)

అర్థము:—వరుడు తన శరీరమును కాంతిగల పాప మగునీ వధూవస్త్రముతో కప్పుకొనుటకు కోరునేని వరుని శరీరము నిందితమగును.

కావుననే వివాహము జరిగిన వెంటనే వధువు
వస్త్రములను వదలివేయవలెను.

పరా దేహి శాముల్యం (ఋ. సం. 10-85-

అర్థము :—ఓ వధూ నీ శరీరమును కప్పియుంచు
మును విడువుము.

వధువు ధరించియున్న వస్త్రమును నామె విప్ప
గనే వరుడు కప్పుకొనుటకు కోరుచో నది పాపకరమ
గావున నామె యా వస్త్రమును విసర్జింపవలెననియు పై మ
ములు చెప్పుచున్నవి. వివాహము పూర్తియైన వె
సమావేశనము జరుగుట యుండెడిది కావుననే వరు
వస్త్రము నామె ధరించియున్న కాలముననే కప్పు
యనుదానికి ప్రసక్తి గలిగినది. కావున వివాహ మగునప్ప
వధువు సమావేశనమున కర్హమగు స్థితిలో నుండెనని
వలసియున్నది. అనగా నాకాలములో రజస్వలావివాహ
జరుగుచుండెడివనియే తేలుచున్నది.

వివాహ మగునప్పటినుండియే వధువు సంసారభ
తను వహింపవలసి యుండెనని పైన చెప్పబడినది. ఈ
యమై యేమియు సందేహము మిగులకుండునట్లు వ
గూడ వివాహమైన వెంటనే సంసారమందు బద్ధుడగుచు
డని వేదములో చెప్పబడియున్నది.

నీలలోహితం భవతికృత్యాసక్తి ర్వ్యజ్యతే।
ఏధంతే అస్యాజ్ఞాతయః పతిర్బంధేషు బధ్యతే॥
(ఋ. సం. 10-85-

అర్థము :—కృత్యయను దేవత నీలలోహితవర్ణము గలదై యున్నది. ఆకృత్య యీ వధువునందు సంబంధము గలదై యున్నది. ఇపు డా దేవత యీమెచేత వదలబడు చున్నది. ఆ దేవత పోయిన దగుచుండగా నీమెయొక్క జ్ఞాతులు వృద్ధినొందుచున్నారు; ఈమె భర్త సంసారబంధముల చేత బంధింపబడుచున్నాడు.

ఇది వివాహము పూర్తి కాబోవునప్పటి విషయము.

వివాహ మగుటతోడనే వధూవరు లిరువురును గృహ కృత్యములు నిర్వహించుకొనుట, మిథునకర్మయందు ప్రవర్తిం చుట యను కార్యముల కర్హులని యిన్ని ప్రబలసాక్ష్యములచే స్పష్టమగుచుండుటచే వేదకాలములోని వివాహము రజస్వలా వివాహమే యని చెప్పుట కేమాత్రమును సందేహింపనక్కర లేదు.

కొందఱు స్త్రీలు వివాహము లేకుండ కన్యలుగనే పితృగృహమున కాలక్షేపము చేయుచుండుట వేదములలో నచ్చటచ్చట గాన్పించుచున్నది. అట్టివారు సాధారణముగ పతి లభింపకపోవుటచేతనే యవివాహితలుగ నుండిరి గాని వివాహమునందలి వైముఖ్యముచే కాదు. కన్య నేదో రీతిగ నెవనికో యొకనికి వ్యక్తురాలు కాకపూర్వము కట్టితీరవలె నను నియమ మాకాలములో లేదు. కావున ననురూపవరుడు లభింపనిచో బాలిక కన్యాత్వములోనే యుండెడిది.

ఈక్రింది ఋక్కులో పైన చెప్పబడిన విధముగ స
హితగ నున్న స్త్రీయొక్క ప్రశంస గలదు.

అమాజూరివ పిత్రోస్సచ ।
సతీ సమానాదాసద సస్త్వామియే భగ॥

(ఋ. సం. 2-17-

అర్థము :—ఓ యింద్రుడా, యావజ్జీవము పితృగృ
మందే జీర్ణించుచు తలిదండ్రులతో నుండి భర్తను పొం
కుమారితె తనకును తండ్రికిని సాధారణమైన గృహమ
దుండి యాతని ధనములో భాగము నెట్లు యాచించుచున్న
యట్లే పొందదగిన ధనముకొఱకు నిన్ను నేను యాచి
చున్నాను.

ఇక వివాహ వయస్సు విషయమైన చర్చను చాలి
వరనిర్ణయవిషయమై కన్యకు గల స్వాతంత్ర్యమును గూ
విచారింతము.

వివాహము కావలసిన యువతీ యువకులు చక
దుస్తులు ధరించి విలాసలను గన్పఱచుచు వరులకొఱ
వధువులకొఱకును యత్నించుచుండెడివారు. తాను వల
యువకుని హృదయము నాకర్షించుటకు యువతియు త
గోరిన యువతి ప్రేమను చూరగొనుటకు యువకుడ
యత్నించెడివారు. (ఋ. వే. 8-35-5; 8-62-9; 9-56-
6-58-9) యువతీ యువకు లిరువురును నంగీకరించినచో
వివాహము జరిగెడిది. అట్లనుటచే తలిదండ్రులకు వివా

విషయములో ప్రసక్తి లేదని చెప్పరాదు. తుదకు కన్యాదానము చేసి వివాహము జరిగించు కర్తవ్యము వధువుయొక్క తండ్రిపైననే యుండెను. తండ్రి దానముచేయుట యవసరము గావున సహజముగ తన కిష్టములేని వరుని కాతడు దానము చేయుట కంగీకరించెడివాడు కాడని యూహింపవచ్చును. అనగా కన్య కోరుకొనిన వరు డాకన్యాదాతకు గూడ నచ్చినవాడుగ నుండవలసి యుండెను. కుమార్తె యెవ్వరినో వరించుటయు తండ్రి యాతని నంగీకరింపకుండుటయు నను దురవస్థలు రాకుండుటకై తండ్రి ముందుగనే మేల్కొనుచుండి యుండవలెను. అనగా కుమార్తె యనురూపులగు యువకుని పైన మాత్రమే దృష్టిని నిగుడ్చు నేర్పాటుల నాతడు చేయుచుండెనని యూహింపవచ్చును. ఒక్కొక్కప్పుడు తండ్రియే కుమార్తె కనురూపవరుని కుదిర్చి యనంతరము కుమార్తె యొక్క సమ్మతిని తీసికొనెడివాడు.

సోమో వధూ యురభవత్ అశ్వినాస్తాము భావరా।
సూర్యాం యత్పత్యైశం సంతీం మనసా సవితాదదాత్॥
(ఋ. సం. 10–85–27)

అర్థము :—సోముడు భార్య కావలెననువాడుగ నుండెను. అందులకై యశ్వినులు కన్యను వెదకుచుండిరి. సూర్య పతిని కోరుచుండెను. ఆమె తండ్రి యామెను మనఃపూర్వకముగ సోమునకు దానము చేసెను.

సంస్కృతకావ్యములలో మనము చదువు స్వయం

వరములవంటివి గూడ వేదకాలములో నుండినట్లు తె
చున్నది.

భద్రావధూర్భవతి యత్సుపేశాః
స్వయం సామిత్రం వనుతే జనేచిత్ ॥

(ఋ. సం. 9–27-

అర్థము:—ఏస్త్రీ కల్యాణియు శోభనరూపయు
చున్నదో యామె జనమధ్య నున్న ప్రియుని స్వయముగ
కొనుచున్నది.

విశేషముగ శ్రీమంతులగు రాజుల కుటుంబ
జన్మించి మంచి రూపముగల కన్యలకు తండ్రి స్వయంవర
ప్రకటించుటయు, నానా దేశములనుండి రాజకుమారులు
సభయందు కూర్చొనియుండగా రాజకన్య వచ్చి యం
పరీక్షించి వివరముల నరసి యా సభలోని కెల్ల ననురూపు
వాని కంఠమున పూలమాల నేయుటయు మనము కా
లలో నెఱుగుదుము. పై నున్న ఋగ్వేదమంత్రములోని
కల్యాణియు రూపవతియు నని చెప్పబడినది కదా! మ
నామె జనమధ్య నున్న వరుని కోరుకొనునని కూడ ని
గలదు. కావున కన్య పూర్ణస్వాతంత్ర్యమును గైకొని
నచ్చిన వరుని గ్రహించుట యానా డుండెనని చెప్పవ
ఎట్టివారిని సభ కాహ్వానింపవలెనను నియమము తండ్రిచే
లోనే యుండి యుండవచ్చును. అందువలన కన్య కేవల
బాహ్యవిషయములను చూచి మోసపోవుట కవకా
తక్కువ యగును.

పై యంశముల నన్నిటిని బట్టి చూడ వేదకాలము లోని వివాహము స్మృతులలో బ్రాహ్మవివాహ మని చెప్ప బడుదానితో పోల్పదగునని తెలియుచున్నది. విద్యాచారిత్ర బంధుశీలసంపన్నుడగువానికి నలంకరింపబడిన కన్య నిచ్చుట జరుగుచో నది బ్రాహ్మవివాహమని గౌతమధర్మసూత్రములు, మనుస్మృతి మున్నగు స్మృతులలో గలదు. వేదకాలములో వరుని నిర్ణయించుటలో కన్యాదాతయొక్క యామోద మవ సరమగుటచేతను ప్రాజ్ఞుడగు కన్యాదాత విద్యాదులను పరిశీ లించియే వరుని నంగీకరించును గావునను వివాహసమయమున కన్య యలంకరింపబడుచుండెనని స్పష్టముగ వేదములవలన తెలియుచున్నది గావునను వేదకాలములోని వివాహమునకు బ్రాహ్మవివాహలక్షణములు పట్టుచుండెనని చెప్పవచ్చును. ఆకాలములో నలంకృతయగు కన్యను దానముచేసెడివారని చెప్పుటకు గల యాధారములలో కొన్నిటి నీక్రింద నిచ్చు చున్నాను.

కన్యా ఇవ వహతు మేతవా ఉ।
అభ్యంజనా అభిచాకశామి॥ (ఋ. సం. 4–58–9)

అర్థము:—కన్యలు వివాహము చేసికొనుటకును భర్తను పొందుటకును నాభరణములను పొందునట్లు అని యొక యుప మానము వాడబడినది.

పరిష్కృతాన ఇంధవో యోషేవ పిత్ర్యావతీ।
వాయుం సోమా అసృజత॥
(ఋ. సం. 9–46–2)

అర్థము :—సోమము లలంకరింపబడినవై వా
నుద్దేశించి పోవుచున్నవి. ఎట్లనగా! తండ్రియొద్ద నున్న
యలంకరింపబడినదై భర్త నుద్దేశించి వెళ్లునట్లు.

వివాహసమయమున వధువునకు తండ్రియే కా
రులు కూడ కానుకల నిచ్చు నాచార ముండెడిది. భూ
కాశములు వధువగు సూర్యకు కానుకల నర్పించెనని ఋ
ములో నున్నది.

వరునకు కట్న మిచ్చుట కూడ వేదకాల
గాన్పించుచున్నది. దీని వివరములు మనకు తెలి
వివాహమునకు బూర్వము కట్న మొక షరతుగ నియ
బడిన ట్లిచ్చుటను గానరాదు. కట్న మేదో యలంకా
ముగ నుండిన ట్లూహించుటకు వీ లున్నది.

శాసద్వహ్నిర్దుహి తుర్నప్త్యంగా ద్విద్వాం।
ఋతస్యదీధితిం సపర్యన్॥

(ఋ. సం. 3-31

ఈ ఋక్కుయొక్క యర్థము. "స్త్రీలు—కర్మకా
యను ప్రకరణమున నీయబడినది. "దీధితిం సపర్యన్"
నదియే ప్రకృతవిషయమున కవసరము. "అల్లుని పూజించు
అని దీని కర్థము. ఇది వివాహసమయమునకు సంబంధి
విషయము. దీనికి భాష్యమును వ్రాయుచు సాయణాచార్య
"పూజించుట"కు "వస్త్రాలంకారాదులచే పూజించుట"
యర్థము వ్రాసినారు. ఈ యర్థము ననుసరించి వివాహస

మున నల్లునికి నలంకారరూపమైన కట్నమిచ్చుట యానా
డుండెనని తెలియుచున్నది. కాని యిచటి వివాహము
అభ్రాతృకన్యయొక్క వివాహమనునదొక విశేషము ఏవో
కొన్నిసమయములలో నైనను వరునికి కట్నమిచ్చుట యుండె
నని మాత్ర మిందువలన తెలియుచున్నది.

ఇఁక వేదకాలములోని వివాహవిధాన మెట్లుండెనో
యించుక చూతము. దీనివిషయమై యన్ని వేదములలోను
గూడ మనకు కొన్ని కొన్ని సంగతులు తెలియుచున్నవి.
మొత్తముపై వేదకాలపు వివాహవిధానమును సంగ్రహముగ
తెలిసికొనవలెనన్నచో ఋగ్వేదములోని దశమమండలము
లోని సూర్యాసోముల వివాహవిధానము తెలిసికొనినచో
చాలును. కావున నా వివాహవర్ణమును బట్టియానాటి వివాహ
మెట్లు జరుగుచుండెనో యాక్రింద తెలుపబడినది.

పెండ్లి కుదుర్చుట కిరువురు మధ్యవర్తులు వత్తురు. కన్య
యొక్క తండ్రితో సంభాషించి వివాహమున కాతని సమ్మతిని
పొందుదురు. కన్యను రమ్యములగు వస్త్రములచేతను నలం
కారములచేతను తండ్రి భూషించును. బంధుమిత్రాదు లామెకు
వివిధములగు కానుకల నొసంగుదురు.

కింశుకశాల్మలీదారువులతో నిర్మింపబడిన రథముపై
కూర్చుండబెట్టి రథమునకు చక్కని గుఱ్ఱములను కట్టి వధు
వును భర్తృగృహమునకు తీసికొనిపోదురు. మాఘమాసములో
దేవతలకు బలినిత్తురు. ఫాల్గుణమాసములో వివాహమగును.

వధువు భర్తృగృహము చేరిన పిదప వరుణ
క్రిందివిధముగ చెప్పుచున్నాడు. "ఈ కన్యను తండ్రి గృ
నుండి విడిపించుచున్నాను. ఇక నీమె నిచ్చటనుండి విడిపి
ఈమె నిచ్చటనే బద్ధురాలనుగ చేసినాను. ఓ కామాభివ
వైన యింద్రుడా, ఈకన్య యేరీతిగా పుత్రులు గల
భాగ్యముగలదిగాను నుండునో యారీతిగా చూడుము." 
నున్నవా రీవిధముగ వధువుతో చెప్పుదురు. "ఓ వధూ,
భర్తృగృహమున నున్న సమస్తము వశముచేసికొనుము
నీపతి శరీరముతో నీశరీరము కూర్పుము...చిరకాలము
మీ రిరువురును మీ గృహమును పాలించుకొనుడు." 
హితవర్ణముకల కృత్యయను దేవత వివాహకాలములో
నాశ్రయించుకొని యుండును. వివాహము పూర్తియగు
కొంచెము పూర్వ మా దేవత పారద్రోలబడును.

అంత వధువు దీక్షావస్త్రములను విడచును. 
బ్రాహ్మణులకు దక్షిణ లొసగబడును. వివాహము చూ
వచ్చినవా రందరును వధూవరులయొద్ద సభచేసి కూ
దురు. అప్పుడు వరుడు వధువుయొక్క పాణిని గ్రహించ
నీక్రిందివిధముగా చెప్పును. పతినైన నాతోడ నీవు పొంద
వార్ధక్యముగలదాన వగుము. సౌభాగ్యముకొఱకు నీహస్త
మును నేను గ్రహించుచున్నాను. నేను గృహపతి నగు
పురంధి, పూష, భగుడు, అర్యముడు అను దేవతలు ని
నా కిచ్చిరి."

సభికు లీక్రిందివిధముగా నాశీర్వదింతురు. "పుట్టిన కన్యను సోముడు మొదట పొందెను. తర్వాత గంధర్వుడు పొందెను. అగ్ని మూడవపతి. మనుష్యుడు నాల్గవవాడు. ఓ వధూవరులారా, ఈలోకమం దుండుడు. వేరుకా కుండుడు. పూర్ణాయుస్సును పొందుడు. పుత్రపౌత్రులతో మీ గృహమందు క్రీడించుచుండుడు."

తుదకు వరుడు మఱల నీ క్రిందివిధముగా ననును. "ఓ వధూ ఎన్నడును కోపింపకుము. పతినగు నన్ను హింసింపకుము." వధూవరు లిరువురును కలసి యీక్రింది ప్రార్థనను చేయుదురు.

"సమస్తదేవతలును మాయిద్దరి హృదయములను దుఃఖరహితములైన వానినిగా చేసి లౌకిక వైదిక విషయములందు ప్రకాశింపచేయుదురు గాక! ఉదకములు గూడ నట్లే చేయునుగాక! వాయువు, బ్రహ్మ, సరస్వతియు మాబుద్ధులను పరస్పరానుకూలము లగునట్లు చేతురుగాక!"

ఈప్రార్థనతో వివాహము ముగియును.

తైత్తిరీయమంత్రప్రశ్నములో (1—3) సప్తపదిమంత్రములున్నది. ఇంకను విశేషములు కొన్ని యున్నవి. కాని పైన వర్ణింపబడిన విధానమే ముఖ్యమైనదిగ నున్నది.



# తృ తీ యా ధ్యా య ము



## స వ తు లు

పురుషు డనేక భార్యలను చేసికొనుట వేదకాల
నుండినట్లు స్పష్టముగ తెలియుచున్నది. ఈవిషయ
స్థలములలో కాన్పించుచుండుటచే నీ యాచార మాబ
తలచుగ నుండెడిదని గూడ చెప్పవచ్చును.

ఈ క్రిందిమంత్రములో గన్పట్టు నుపమానము
నింపవలసినది.

"సమ్మాస్మత పంత్యభి తస్సపత్నీరివ పర్శవః."

(ఋ. సం. 1-1

అర్థము:—సవతులు భర్తను పీడించునట్లు
పార్శ్వపుటెముకలు పీడించుచున్నవి.

సవతు లుండుట సామాన్యవిషయము కానిచో
కుపమానకోటిలో స్థానముండి యుండదు. కావున
భార్యకత్వ మానాడు తలచుగ నుండెడిదని చెప్ప
యున్నది.

ఈక్రింది ఋక్కుకూడ పై ఋక్కువలెనే య
యాచారమును సూచించును.

"జనీరివపతిరేకస్సమానోనిమామృజేపుర ఇంద్రస్సు

(ఋ. సం. 7-

అర్థము :—అనేక భార్యలు కలవాడు వా రందఱి యందును సమబుద్ధి గలిగియుండి తా నొక్కడే వా రందఱిని కనిపెట్టుచుండునట్లే ఇంద్రుడు శత్రుపురముల నన్నిటిని పరిశీలించుచుండును.

నవాబులు లెక్కలేనంతమంది స్త్రీలను వివాహమాడి వారి మొగమైనను చూడకుండినట్లు కాక వేదకాలములోని బహుభార్యకుడు భార్యల నందఱను గూడ సమముగా ప్రేమతో జూచుచు వారిని కనిపెట్టుచుండెడివాడని యిందువలన తెలియుచున్నది.

ఇద్దఱును ముగ్గురును మాత్రమేగాక యేబదిమంది వఱకును గూడ భార్యలు గలవా రాదినములలో నుండినట్లీక్రిందిఋక్కువలనఁ దెలియుచున్నది.

"అదాన్మేపౌరుకుత్స్యః పంచాశతంత్రసదస్యుర్వధూనాం"
"ఋ. సం. 8-19-36"

అర్థము :—పురుకుత్సకుమారుఁ డగు త్రసదస్యుఁడు నా కేబదిమందిభార్యల నిచ్చియున్నాఁడు.

సవతులు లేకుంటను స్త్రీలోకయదృష్టముగఁ దలఁచుచుండిరి. సవతులు లేకుండెడి జీవితమును స్త్రీ లెక్కుడుగఁ గాంక్షించుచుండిరి. భార్యల నందఱను సమదృష్టితోఁ జూడవలెనని భర్త యెంత యత్నించినను గూడ భర్తమనస్సును సవతులపైనుండి తమవైపునకుఁ ద్రిప్పుకొనుటకు స్త్రీలు చాల

యత్నించెడివారు. అందులకై యోషధులనుకూడ వా
కలదు. ఈవిషయమున నీక్రిందిబుక్కులు పరికింపదగి

"యాంఖనామ్యోషధిం వీరుధంబలవ
త్తమాం యయాసపత్నీం బాధతే యయాసం
పతిం" (ఋ. సం. 10-1

అర్థము:—కార్యసాధన మందు శక్తిగల యీ
రూపమైన యోషధిని నేను త్రవ్వుచున్నాను. ఈయో
చేత నీస్త్రీ తనసవతులను బాధించును. మఱియు భర్తయొ
యసాధారణప్రేమను బొందును.

"ఉత్తానపర్ణే సుభగే దేవజూతేసహస్వతీ। సపత్నీం
పరాధమపతిం మే కేవలం కురు." (ఋ.సం.10-1

అర్థము:—ఊర్ధ్వముఖపర్ణములు గలిగినట్టియు,
భాగ్యహేతు వైనట్టియు, దేవప్రేరితమైనట్టియు, నభిము
గ నున్నట్టియు నోలతా! నీవు నాసవతిని పారద్రోలు
భర్త నాకొక్కతెకే యుండునట్లు చేయుము.

సవతుల నణచివైచి పతిప్రేమను చూరగొనిన లో
స్త్రీ యిట్లు చెప్పుచున్నది.

ఉదసౌ సూర్యో అగాదుదయం మామకో భగః।
అహం తద్విద్వలాపతిమభ్య సాక్షి విషాసహిః॥

(10-15

అర్థము:—అదుగో సూర్యుడుదయించుచున్నా
నాయొక్క సౌభాగ్యముకూడ నుదయించినది. ఆ తేజస్సు

నేను తెలిసికొనినదానను. నేను సవతులను తిరస్కరించినదాన నై భర్తను స్వాధీనము చేసికొంటిని.

సవతుల నణచుటయే భర్తను స్వాధీనము చేసికొనుట. భర్తను స్వాధీనము చేసికొనుటయే సౌభాగ్యము. అట్టి సౌభాగ్యమునే స్త్రీ లెక్కుడుగ కాంక్షించుచుండిరి. దానిని పొందుటలోనే తమ చాకచక్యము నంతను గన్పఱచెడివారు పైన చెప్పబడిన స్త్రీ యింకను నీక్రిందివిధముగ చెప్పుచున్నది.

అహం కేతు రహం మూర్ధాహముగ్రా వివాచనీ।
మమేదనుక్రతుం పతిస్సేహా నాయా ఉపాచరేత్॥

(ఋ. సం. 10-159-2)

అర్థము :—నేను సర్వమును తెలిసినదానను. నేను ప్రధానురాలను. నేను మాట్లాడుదానను. భర్తను మాట్లాడించుదానను. సవతులను తిరస్కరించు నాబుద్ధి నుద్దేశించి భర్త వచ్చుగాక !

పురుషుఁ డనేకభార్యలను చేసికొనుట యిన్నిస్థలములలో గాన్పించుచున్నను స్త్రీ యనేకభర్తలను చేసికొనుట యొక్కస్థలమం దయినను గాన్పింపకుండుటను బట్టి యానాఁడాయాచారము లేదని చెప్పవలసియున్నది.

అంతియే కాదు. పురుషున కనేకభార్య లుండవచ్చుననియు, స్త్రీ కనేకభర్త లుండరా దనియు వేదములో స్పష్టముగ చెప్పఁబడియే యున్నది.

యదేకస్మిన్ యూపే ద్వేరశనే పరివ్యయతి తస్మా దేకో

ద్వేజాయేవిందతే యన్నైకాన్ రశనాం ద్వయో
యోః పరివ్యయతి తస్మాన్నైకాద్వౌపతీ విందతే॥
(యజుర్వేదసంహిత 6-6-

అర్థము :—(అధ్వర్యుఁడు) ఒక యూప స్తంభమ
రెండుత్రాళ్లు కట్టుచున్నాఁడు. అందువలన నొకపురుషుఁ
భార్యలనుకట్టుకొనును. ఒకత్రాటిని రెండు యూపస్తంభమ
కట్టఁడు. కావున నొకస్త్రీ యిద్దరుపురుషులను కట్టుకొనద

స్త్రీ కిద్దఱు భర్త లుండరని చెప్పుటతోబాటు పు
న కిద్దఱుభార్య లుందురని యిచట చెప్పఁబడినదే
యిద్దఱకు మించినభార్యలు పురుషున కుండరను నర్థ
లేదు. ఇద్దఱుకంటె నెక్కుడుమందిభార్యలు పురుషున
వచ్చునని స్థలాంతరమున స్పష్టముగఁ గాన్పించుచున్నది.

తస్మాదేకో బహ్వీ ర్జాయావిందతే॥ (తై. సం. 6-5-

అర్థము :—అందువలన నొకఁ డిద్దఱుకంటె నెక
భార్యలను చేసికొనును.

ఈవిషయము ఐతరేయబ్రాహ్మణములోగూడ
ముగ చెప్పబడియున్నది.

తస్మా దేకస్య బహ్వోజాయాభవంతి।
నైకస్యై బహవస్సహపతయః॥ (ఐ. బ్రా. 3-22)

అర్థము :—అందువలన నొకనికి బహుభార్య
రు. ఒకతెకు భర్తకుతోడు మఱొకభర్త యుండడు.

## చతుర్థాధ్యాయము.



### వితంతువులు.

వేదకాలములో వితంతు వివాహములుండెనా లేదా యనునదియే యీ యధ్యాయములోని ప్రధానవిషయమై యుండును. ప్రాసంగికముగ నానాటి వితంతువుల స్థితికూడ నచ్చట నచ్చట వర్ణింపబడును.

వితంతువులు వితంతువులుగనే నిలచియున్నట్టు తెలుపు మాటలు వేదములలో చాలగలవు. అంతియేకాదు వితంతువులు భర్తతోబాటు మరణించుటగాని పిల్లలను కనిపెట్టుకొని భర్తనే తలచుకొనుచు నుండుటగాని యాచరించెడివారని కూడ స్పష్టముగ నున్నది. బ్రతికియున్నను చచ్చిననుగూడ భర్తతోబాటే యుండుట పరమధర్మమనియు పిల్లలకొఱకై జీవించుచు పతిని మనస్సున ధ్యానించుకొనుచు నుండుటకూడ నింద్యము కాదనియు స్పష్టముగ తెలియుచున్నది. ఈ విషయము లన్నిటిని క్రమముగ చూతము.

అభ్రాతరోన యోషణోవ్యంతః పతిరిపోన జనయోదురేవాః । పాపాసంతో అనృతాఅసత్యా ఇదం పదమజనతా గభీరం॥ (ఋ. సం. 4-5-5)

అర్థము:—అన్నదమ్ములు లేని వితంతువు తండ్రి యింటికి పోయినట్లు యజ్ఞమార్గమును విడచి యమార్గమున

సంచరించువారు పతిద్వేషిణులైన స్త్రీలువలె దురాచా
గలవారై పాపాత్ములై మానసిక కాయికాసత్య
బల్కువారై లోతైన ప్రసిద్ధమగు నరకమును సృ
చున్నారు.

భర్త మరణించిన పిమ్మట పునర్వివాహము చేసి
వితంతువు పుట్టింటికి బోవుచున్నదనియే యిచ్చట
బడినది.

వితంతువు ఆకాలములో అలంకారములు ధ
బ్రహ్మచర్యము నవలంబించియే యుండిరని చెప్పుటకు
నాధారమున్నది.

"ఇమా నారీరవిధవాః సుపత్నీరాం జనేన సర్పి
విశంతు । అనశ్రవోనమీవాః సురత్నా ఆరోహం
యోయోనిమగ్రే" (ఋ. సం. 10-18

అర్థము:—విధవలు కానట్టియు మంచిభర్తలు
నట్టియు స్త్రీలు అంజన సాధనమైన ఘృతముతో నలం
బడినవారై కన్నీరుపెట్టనివారై మనస్సులోకూడ దుః
లేనివారై ధనముగలవారై ముందుగ నింటిని ప్రవేశిం
గాక.

ఈ ఋక్కువలన తేలునంశము లేమనగా (1)
లములో వితంతువులు కాటుకమున్నగువానిని ధరించేడి
కారు. (2) వితంతువుల స్థితి చాల దుర్భరముగ నుండే
అనగా బ్రహ్మచర్యమును నవలంబింప వలసినవారుగ న

అని చెప్పవలెను. అట్లు కానిచో సభర్తృకలైన స్త్రీలే కన్నీరు పెట్టనివారుగను దుఃఖము లేనివారుగను నిచట చెప్పబడి యుండరు. పునర్వివాహాధికార మున్నచో నట్టిదుఃఖమునకు హేతువు గాన్పింపదు. (3) ఆర్థికముగ గూడ వితంతువుల స్థితి శోచనీయముగ నుండి యుండవలెను. లేకున్నచో సుప త్న్నులే యిచట ధనముగలవారుగ చెప్పబడియుండరు.

వితంతువులకు పునర్వివాహాధికారమే యున్నచో నలంకారములను ధరింపరాదు మున్నగు నియమము లుండవలసిన పనిలేదు. ఇచట నట్టి నియమము గాన్పించుచున్నది. కావున నాదినములలో స్త్రీకి పునర్వివాహాధికారము లేదని చెప్పవలసియున్నది.

వితంతువులకు పునర్వివాహాధికారము లేని సంఘముల లోను, స్త్రీలకు యౌవనము వచ్చినపిమ్మట నెన్నడో వివాహముచేయు నాచారముగల సంఘములలోను గూడ రహస్య ప్రసవముల కవకాశమున్నది. ఈ క్రిందిఋక్కులో నట్టి రహస్యప్రసవవృత్తాంత మొక యుపమానముగ జెప్పబడినది.

"ఆరేమత్క_ర్త రహసూరివాగః" (ఋ. సం. 2–29–1)

అర్థము:—ఓవిశ్వేదేవతలారా! రహస్యముగ బిడ్డను కను స్త్రీ యాబిడ్డను దూరదేశమున పారవేయునట్లు మీరు నాపాపమును దూరముగ పారవేయుడు.

ఇందు చెప్పబడిన స్త్రీ అవివాహిత యగు కన్యయో వితంతువో స్పష్టముగ చెప్పలేము. కాని వితంతు వివాహ విషయమై చర్చించునపుడు ఈఋక్కును వదలకూడదు.

వేదకాలములోని వితంతువులను గుఱించి యా
చునపుడు ముఖ్యముగ రెండు ఋక్కులు మనస్సునకు
అవియేవన:—

(1) ఇయం నారీపతిలోకంవృణానానిపద్య ఉత త్వా
ప్రేతం। ధర్మం పురాణమనుపాప యన్తీ తస్యై
ద్రవిణంచేహ ధేహి॥

(2) ఉదీర్ష్వనార్యభిజీవలోకం గతాసుమేతముప శేషఏహి
. స్తగ్రాభస్య దిధిషో స్తవేదం పత్యుర్జనిత్వమభిసంబ

ఈ రెండు ఋక్కులునుగూడ కొంచెము
ముతో చాలస్థలములలో వేదవాఙ్మయమున గన్పట్టుచు
"ఇయంనారీ" యనునది అ. సం. 18–3–1 లోను తై
6–1 లోను "ఉదీర్ష్వనారి" అనునది ఋ. సం. 10–
గాను, అ. సం. 18–3–2 గాను తై. ఆ. 6–1 లోను గ
చుచున్నవి. ఇందలి యేస్థలములోని సాయణభా
చూచిననుగూడ వేదకాలములో వితంతు వివాహము
ట్లును వితంతువులు సహగమనము చేసెడివారనియు
పిల్లలను కనిపెట్టుకొని భర్తను దలచుకొనుచు న
మున నాతనితో కలిసికొనుటకు వేచియుండెడివారనియ
యగలదు. వితంతువివాహ విషయమును చర్చించునపు
త్రము లింతముఖ్యములుగావున నీ యన్ని స్థలములలోని
రణ్యభాష్యమును నీక్రిందవ్రాసి దాని తాత్పర్యము
నిచ్చుట యవసరముగ గాన్పించుచున్నది.

భర్త చచ్చిపడియుండగా వితంతు వాతనిశవమునొద్ద పడియుండగా ప్రక్కనున్నవా రీ మాటలను చెప్పుచున్నారు. ఈరెండు బుక్కులకునుగూడ నిదియే సందర్భము.

అథర్వవేదములోని భాష్యసంగ్రహము :—ఇయంపురోవర్తిసీ నారీస్త్రీ పుతిలోకం పత్యుర్లోకః పతిలోకః పత్యా అనుష్ఠితునాం యాగదానహోమాదీనాం ఫలభూతం స్వర్గాది స్థానమ్ తంపతిలోకం వృణానా సహధర్మచారిణీత్వేన సంభజమానాఏవం భూతాస్త్రీ హేమర్త్యమరణధర్మన్ మనుష్య ప్రేతమ్ ప్రకర్షేణగతమ్ అస్మాత్ భూలోకాత్ వినిర్గతంత్వా త్వాం ఉపనిపద్యతే సమీపేనితరాంగచ్ఛతి అను మరణార్థం ప్రాప్నోతీత్యర్థః కస్మాద్ధేతోరిత్యాహ పురాణమ్ పురాతనమ్ అనాదిశిష్టాచారసిద్ధమ్ స్మృతిపురాణాదిప్రసిద్ధంవాధర్మం సుకృతమ్ అనుపాలయన్తి ఆనుపూర్వ్యేణప్రదాయావిచ్ఛేదేన పరిపాలనమ్ అనుపాలనమ్ తత్ కుర్వతీ తస్త్యేతథావిథా మై అను మరణంకృతవత్యైస్త్రియై ఇహఅస్మిన్ భూలోకే జన్మాన్తరే లోకాన్తరేపి ప్రజామ్ ప్రజాయత ఇతిప్రజాతాం పుత్రపౌత్రాదిరూపాం ద్రవిణం ధనంచధేహి ప్రయచ్ఛ అను మరణప్రభావాజ్జన్మాన్తరేపి సఏవతస్యాః పతిర్భవతీత్యర్థః.

ఉపనిపద్యమానాసాయది ఇహలోకే పునర్జీవితుమిచ్ఛేత్ తదా ఉదీర్ష్వఇత్యనయా ద్వితీయయర్చా ప్రేతేనసహ సందిష్టాంతామ్ అభిమన్త్ర్య ఉత్థాపయేత్.

పైదాని యర్థము :—ఈస్త్రీ పతితోకూడ కర్మ

ఫలము ననుభవించుటకై యాతడేగిన లోకమునకే
గూడ నేగుటకు కోరుచున్నది. ఓ మృతుడా, ఈమె నీ
పడియున్నది. అనగా సహగమనము చేయుటకై
న్నది. సహగమనము చాల పురాతనధర్మము, నీతో
చున్న యీామెకు నిహలోకమునను పరలోకమునను జ
తరమునను గూడ సంతానమును ధనమును నిమ్ము.
మనప్రభావముచేత నాతడే యామెకు మఱల భర్తయగు
యర్థము. ఈవితంతువు సహగమనము చేయక జీవింపగోరు
నామెను "ఉదీర్ష్వనారి" అనుమంత్రమునుచెప్పి లేవదీయవ

తై. ఆ. లో "ఇయంనారీ" అను మంత్రముపైని
భాష్యసంగ్రహము :—

హేమర్త్య మనుష్యయానారీ మృతస్యతవభార్యా
పతిలోకం వృణానాకామయమానా ప్రేతం మృతం త్వాము
పద్యతే సమీపే నితరాం ప్రాప్నోతి కీదృశీపురాణం వి
నాదికాల ప్రవృత్తం కృత్స్నం స్త్రీధర్మమనుక్రమేణ
యస్తి పతివ్రతానాం స్త్రీణాం పత్యాసహైవవాసః పర
ధర్మః తస్యైధర్మపత్న్యైత్వమిహలోకే నివాసార్థ మను
దత్వా ప్రజాం పూర్వాం విద్యమానాం పుత్రాదికాం ద్ర
ధనంచధేహి సంపాదయ అనుజ్ఞాం దేహీత్యర్థః.

ఈ భాష్యమున కర్థము :—ఓ మృతినొందిన
ష్యుడా, నీభార్య నీవు పోవులోకమునకు పోగోరుచున్న
మృతుడవైన నీయొద్దకు చేరుచున్నది. ఈవిధముగా భర్త

డనే యుండుట యనునది పురాతనమైన ధర్మము. ఆధర్మ
మును పూర్తిగ నీవె పాలించుచున్నది. ఈ నీపత్ని యీలో
కమున నివసించుట కనుజ్ఞ నిచ్చి నీ కీమెవలన గలిగినసంతాన
మును నీయొక్క ధనమును నీమెయనుభవించుట కనుజ్ఞనిమ్ము.

ఇక "ఉదీర్ష్వనారి" అను దానిని తీసికొందము. ఋ
గ్వేద భాష్యములో సాయణాచార్యులు వ్రాసిన యర్థము :—

హేనారి, మృతస్యపత్ని, జీవలోకం జీవానాం పుత్ర
పౌత్రాదీనాం లోకం స్థానం గృహమభిలక్ష్య ఉదీర్ష్వఅస్మాత్
స్థానాత్ ఉత్తిష్ఠగతాసుం అపక్రాంత ప్రాణం ఏతంపతిం ఉప
శేషే తస్యసమీపేస్వపిషి, తస్మాత్ త్వంఏహి ఆగచ్ఛయ
స్మాత్ త్వం హస్తగ్రాభస్య పాణిగ్రాహంకుర్వతః దిధిషోఃగర్భ
స్యనిధాతుః తవ అస్యపత్యుః సంబంధాదాగతం ఇదంజనిత్వం
జాయాత్వం అభిలక్ష్యసంబభూథ సంభూతాఽసి అనుసరణ
నిశ్చయమకార్షీః తస్మాత్ ఆగచ్ఛ.

తాత్పర్యము :—ఓనారీ, నీపాణిగ్రహణముచేసి నీకు
గర్భము నిచ్చినట్టి నీభర్తతోడి భార్యాత్వము నుద్దేశించి నీవా
తని ననుసరించి పోగోరుచు నాతని శవముప్రక్కను పండు
కొనియున్నావు. అట్లు చేయవలదు. బ్రతికి బాగున్న నీపుత్ర
పౌత్రాదులున్న యింటికి రమ్ము.

తై.ఆ. లో నున్నపుడు దీనిపై భాష్యము:—హేనారి,
గతాసుం గతప్రాణం ఏతంపతిముపశేషేఉపేత్యశయనం
కరోషి ఉదీర్ష్వఅస్మాత్ పతిసమీపాత్ ఉత్తిష్ఠజీవలోకమభి

జీవంతం ప్రాణసమూహం అభిలక్ష్యఏహి ఆగచ్ఛత్వం:
గ్రాభస్యపాణిగ్రాహవతః దిధిషోః పునర్వివాహేచ్ఛో
ఏతజ్జనిత్వం జాయాత్వం అభిసంబభూవ ఆభిముఖ్యేన
క్నాప్నుహి.

తాత్పర్యము:—ఓనారీ! చనిపోయిన నీభర్తవా
పరుండియున్నావు, ఇచ్చటనుండి లెమ్ము బ్రతికియున్నయొ
కడకు రమ్ము, నీపాణిని గ్రహించి నిన్ను మరల వివాహపడి
చేసికొనగోరుచున్న పతితో నీభార్యాత్వమును పొందు
అనగా: చనిపోయిన నీభర్త ఉత్తరలోకములలో
మఱల వివాహము చేసికొనవలెనని కోరుచున్నాడు. చే
నీవు మరణించిన పిమ్మట నాతనికి భార్యవగుము. ఫల

ఈమంత్రమే యథర్వవేదములో వచ్చినపుడు
ణు లీక్రింది యర్థమును వ్రాసియున్నారు. ఇచ్చటి భా
లోని వ్యాకరణ విషయములను తీసివైచి వ్రాయబడు

భాష్యము:—హేనారి ధర్మపత్ని జీవలోకం జీ
ప్రాణధారిణాం లోకం అభిలక్ష్య ఉదీర్ష్వ ఉద్గచ్ఛ
శాశా దుద్గచ్ఛ ఉత్తిష్ఠ గతా అసవః ప్రాణాయ
సతథాక్తః తథావిధం ఏతంపతిం ఉపశేషే ఉపేత్య
శయనం కరోషి అయమర్థః పూర్వాం అదృష్ట
గమనం ఉక్తం ఇదానీం శాస్త్రావిరోధి దృష్ట
థేనతత ఉత్థానం ప్రతిపద్యతే జీవనావస్థాయామేవ
శాత్ సర్వం ఐహికం పుత్రాది లక్షణమ్ అభిప్రాప్తం
హేతో రాగచ్ఛేతి ప్రతిపాద్యతే హస్తగ్రాభః ప్రాణి

కర్తాణస్య దిధిషోః ధారయితుః తవపత్యుః ఇదం జనిత్వం అప
త్యాదిరూపేణ జన్మత్వమ్ అభిసంబభూథ అభి సంప్రాప్తాసి.

భాష్యమున కర్థము :—ఓ ధర్మపత్నీ, బ్రతికియున్న
వారిలోకము నుద్దేశించి రమ్ము. రమ్ము. అనగా, భర్త
యొద్దనుండి లేచిరమ్ము. పోయినప్రాణములుగల పతియొద్ద
పడియున్నావు. నీహస్తగ్రాహకుడును ధారకుడును నయిన
భర్తయొక్క సంతానరూపమైన జన్మను నీవు పొందితివి."

"ఇయంనారీ" యను దీనిపై ఋక్కు సహగమనమును
చేయునపుడు చెప్పబడును. అది కంటికగపడని పరలోకములోని
ఫలముకొఱకు. ఈఋక్కులో వితంతువు చావక భర్త యి
చ్చిన సంతానము ననుభవించుచుండవలసినదిగ కోరబడు
చున్నది. ఇది ఐహికఫలమేయయినను శాస్త్రరూపము
కాదు.

"ఉదీర్ష్వనారి" యను ఋక్కుగూడ సహగమనమునే
బోధించుచున్నదని చెప్పుటకు వీలున్నది. కాశీలో సుప్రసిద్ధ
విద్వాంసులుగ నుండిన రాజా రామశాస్త్రిగారీఋక్కుపైన
వ్రాసిన భాష్యమును బట్టి యిట్టి యర్థము చెప్పుటకుకూడ
వీలున్నదని తెలియుచున్నది. ఆభాష్య మిాక్రిందివిధముగ
నున్నది.

హేనారి, త్వమేతం గతప్రాణం దేహం పతిత్వేన
అభిమన్యమానాసతీ తత్సమీపే శేషే। ఉత్తిష్ఠనాయందేహ
స్తవపతిః, కింత్వేతదధిష్ఠాతా జీవః, అతస్సయత్ర వర్తతే తం

జీవలోకం మర్త్యలోకా దన్యమభిలక్ష్య గచ్ఛ, తత్రచ గత్వా
ఇహలోకే పాణిగృహీతవానపి పునరముష్మిన్నపిలోకే త్వా
మేవయో భార్యా మిచ్ఛతి తస్యదిధిషోః పత్యురేతదే
యాత్వం యదిదానీం త్వయివర్తతే తదేవ ప్రాప్నుహి.

తాత్పర్యము :—ఓ నారీ, జీవరహితమైన నీపతిదేహ
ము కడ పడియున్నావు. అటనుండి లెమ్ము. ఆ దేహము
భర్తకాదు. అందుండి పోయిన జీవమే నీభర్త. ఆజీవ మేలో
కమునకు బోయినదో ఆలోకమునకే నీవును బొమ్ము. అ
డిచ్చుటనే నిన్ను పాణిగ్రహణము చేసినాడు. అచట నీ
భార్యవుగా నుండవలయునని కోరును. ఈభార్యాత్వమునే నీ
మఱల నచట నాతనితో పొమ్ము.

కావున "ఇయం నారి" అనునట్టియు "ఉదీర్ష్వ" అ
నట్టియు రెండుబుక్కులవలనను గూడ వేదకాలములో విధ
తువు సహగమనము చేయుటయో పిల్లలను కనిపెట్టు
యుండుటయో జరిగెడిదని తెలియుచున్నది. కావున పిల్ల
లేని వితంతువు సంగతి యేమనుప్రశ్న బయలుదేరును. దీని
సమాధానముకూడ వేదములలో నున్నది. పిల్లలులేని విధ
తువునకు నియోగాధికార ముండెను. అనగా నామెమఱ
వలన పుత్రప్రాప్తిని పొందుటకు వీలుండెను. ఈవిషయములో
నీక్రిందిబుక్కు చూడదగును.

కోవాంశయుత్రావిధ వేవదేవరం మర్యన్న యోషా కృణు
తే సదస్థఆం॥

అర్థము :—విధవ శయనమందు మఱది కభిముఖియై యుండునట్లుగాను సామాన్యముగా స్త్రీ పురుషునకు అభిముఖియైనట్లుగాను యేయజమానుడు మీకు వేదికయం దభిముఖు డయినాడు?

దీనింబట్టి విధవ మఱదిని పొందుచుండెడిదని తెలియుచున్నది. నియోగమువిధానముచేతనే యట్లు చేయుచుండెడిదని స్పష్టముగ తెలియుచున్నది. పునర్వివాహవిధిచేత నెంతమాత్రమును కాదని చెప్పవలసియున్నది. ఏమన పునర్వివాహమే యగుచో కేవలము శయనము మాత్రమే యిందు గ్రహింపబడి యుండదు. భార్యకును భర్తకును ననేకవిధములగు సంబంధము లున్నవి. నియోగవిధానములో నున్న స్త్రీపురుషుల కన్ననో శయన విషయమున తప్ప, మఱేవిషయమునను సంబంధము లేదు. కావుననే శయనవిషయము చెప్పవలసినపుడు మంత్రకర్తకు నియోగవిధానము జ్ఞప్తికి వచ్చి 'విధవేవ దేవరం' అనుపమానమును వాడినాడు. అర్వాచీన ఆర్యవాఙ్మయములో కన్పట్టుచున్న నియోగవిధానములో గూడ మఱదియే నియోగమున కెక్కు డర్హుడని యున్నది. కావున నీఋక్కు ఆకాలములో నియోగవిధానముండెడిదను నంశమును తెలుపుచున్నదే కాని వితంతు పునర్వివాహముతో దీని కేమియు సంబంధము లేదని చెప్పవలసి యున్నది.

## పంచమాధ్యాయము



### దాంపత్యము

ఒకదేశముయొక్క రాజకీయ వ్యాపారములను నడపించు మహానాయకునకైనను ధనముచే రాబట్టదగిన సమస్త సౌకర్యముల ననుభవించు లక్ష్మీపుత్రునకైనను విజ్ఞానఖనియైన విద్వత్పుంగవునకైనను గూడ దాంపత్యజీవిత మవసరముగనే యున్నది. దేశములోని పలుకుబడియు, ధనమువలని సౌకర్యములును, విద్యవలని యానందమును గూడ వాని జీవితము నెంత సుఖవంతముగ చేసినను గూడ దాంపత్యజీవితము సుఖముగ నుండనిచో నాతడు దురదృష్టవంతు డనియే లోకు లందురు. ఇతరములగు నానందహేతుకములగు పదార్థము లున్న వానిజీవితసౌఖ్యమును నిర్ణయించుటలోనే దాంపత్య మింతప్రధాన మగుచో కుటుంబము దక్క యానంద హేతువు లేనివాని జీవితసౌఖ్యమును నిర్ణయించుటలో దాంపత్య జీవనముయొక్కస్థితి యెంతయవసరమో వేఱుగ చెప్ప నక్కరలేదు. బాహ్యప్రపంచముతో నంతో యింతో సంబంధముండితీరవలసిన పురుషుని జీవితములోని కష్టసుఖములకే దాంపత్య మింత ప్రధానహేతువగుచో గృహామే ముఖ్య స్థానముగాగల స్త్రీయొక్క జీవితములోని కష్టసుఖములను తెలిసికొనుటలో నామెదాంపత్యజీవితమును పరీక్షింపవలసిన

యావశ్యకత యింతయని వేఱుగ చెప్పవలెనా ? అంతియే కాదు. ఎన్నిసుగుణములు గలిగిన స్త్రీకయినను లేక పురుషున కయినను గూడ దాంపత్యవిషయిక మగు ప్రవర్తనలో లో టున్నచో నా స్త్రీనిగాని పురుషునిగాని సంఘము నిరసించి వైచును. కావున కష్ట సుఖములకే కాక మంచి చెడ్డలకు గూడ దాంపత్య జీవితమే యుత్కృష్ట మగు వరువుడురాయి. అందును స్త్రీవిషయమై యిది మిగుల సత్యముగనుండును. ఒక స్త్రీకి వర్తించినదే స్త్రీజాతికి కూడ వర్తించును. కావున వేద కాలపు స్త్రీలను గుఱించి విచారించునపుడు వారి దాంపత్య జీవితమును విచారించుటత్యవసర మగుచున్నది.

ఈదాంపత్యవిషయమైన ప్రశంస "దాంపత్యము" అను శీర్షికగల యీ ప్రకరణములో మాత్రమే కాక యించుమించుగ నన్ని ప్రకరణములలోను గూడ నంతోయింతో వచ్చి తీరవలసి యుండును. అట్టిచో నీప్రకరణమునకె యీ పేరేల పెట్టబడినదన : వేదకాలములోని దాంపత్యస్వరూపమిందు వర్ణింపబడును. వేదకాలములో "భార్యాభర్తలు పృథగ్వ్యక్తులుగ పరిగణింపబడిరా ? ఏకవ్యక్తిగ పరిగణింపబడుచుండిరా?" "దాంపత్యముచ్ఛేద్యమా ? కాదా?" "ఇరువురిలో నొకరికొకరు లోబడి యుండవలెనా ?" మున్నగు ప్రశ్న లిందు పరిష్కరింపబడును. ఈ ప్రశ్నలయొక్క సమాధానములే చాలవఱకు వేదకాలపుస్త్రీల పరిస్థితులను, స్థూలముగ తెలుపగలవు. కావున నీయధ్యాయము గతించిన యధ్యాయ

ములందును రాబోవు నధ్యాయములందును గన్పట్టు స్త్రీ పరిస్థితు లట్లుండుటకు గల హేతువులను సూక్ష్మముగ సూచించునని చెప్పవచ్చును.

భార్యాభర్త లిరువురును కలసి యొకే వ్యక్తియను నభిప్రాయము వేదకాలమునగూడ నుండెను. భార్య భర్తలో నర్థభాగమనియు భర్త భార్యలో నర్థభాగమనియు గూడ నాటియభిప్రాయము. ఈక్రిందిఋక్కును పరికింపదగును.

ఉతఘానేమో అస్తుతః పుమానితిబ్రువే పణిః।

సవై రదేయ ఇత్సమః. (ఋ. సం. 6—61—8)

అర్థము:—మఱియు (శశీయసిలో) నర్థభాగమగు నామెపతి గుణబాహుళ్యము గలవాడగుటచే నెంత స్తుతింపబడినను నింకను స్తుతింపబడనివాడే యని చెప్పుచున్నారు.

ఇచ్చట భర్త భార్యలో నర్థభాగమని యున్నది. పురుషుడు స్త్రీకి పాలకుడయినను గూడ నామెలో భాగముగ చెప్పబడియుండగా స్త్రీ భర్తలో భాగమని వేఱుగ చెప్పనే యక్కరలేదు. తైత్తిరీయబ్రాహ్మణములో నావిషయముగూడ స్పష్టముగ చెప్పబడియే యున్నది.

అథోఅర్థోవా ఏషఆత్మనః యత్పత్నీ.

(తై. బ్రా. 3—3—3—5)

అర్థము:—భార్య పురుషునిలో నర్థభాగము.

కాళిదాసు పార్వతీపరమేశ్వరులను వాగర్థములువలె కలసి యున్నవారలనుగ చెప్పియున్నాడు. ఋగ్వేదములో

నొకచోట దంపతులువలె అశ్వినీదేవతలు కలసియున్నవారుగ వర్ణింపబడినారు.

మేనేఇవతన్వాశుంభమానే దంపతీవ.

(ఋ. సం. 2–39–2)

అర్థము:—(అశ్వినీదేవతలు) స్త్రీలువలె శరీరముచే ప్రకాశించుచున్నవారుగను దంపతులువలె కలసియున్నవారుగను నున్నారు.

జాయాపతుల యీ కలయిక కేవల మిహలోకములోనే యుండునది కాదనియు మరణానంతరమునగూడ నుండుననియు వేదముల యభిప్రాయము. "వితంతువులు" అను ప్రకరణమున నీయంశము వివరింపబడి యున్నది. ఈయంశమును బలపఱచు మఱికొన్ని వేదవాక్యముల నిట పరికింతము.

యజ్ఞములో పత్ని యీక్రిందివిధముగ చెప్పుచున్నది.

ధాతుశ్చయో నాసుకృతస్యలోకే
స్యోనం మేసహాపత్యాకరోమి. (తై. బ్రా. 1–1–10–2)

అర్థము:—బ్రహ్మకు నివాసమైన పుణ్యలోకములో నేను పతితోగూడ సుఖమనుభవించెదను.

ఆమెయే మఱియు నీక్రింది విధముగ చెప్పుచున్నది.

సంపత్నీపత్యాహంసంగచ్ఛే. (తై. బ్రా. 1–1–10–2)

అర్థము:—నేను పత్నినై భర్తను కలసికొనెదను.

యజ్ఞముచేయుచున్న పతిపత్నుల నుద్దేశించి యధ్వర్యుడిట్లు చెప్పుచున్నాడు.

దివిజ్యోతి రజరమారభేతా.

అర్థము:—పతిపత్నులు ద్యులోకమందున్న జరా
హితమైన ఆదిత్యాత్మకమగు జ్యోతిని పొందుదురుగాక!

వేదకాలపు దాంపత్యము మరణానంతరమున కూడ
నిలచునదిగ చెప్పబడుటచే దాని యచ్ఛేద్యత తెలియుచు
న్నది. భార్యను భర్తగాని భర్తను భార్యగాని వదలుటకు
వీలు లేదనియే వేదముల యభిప్రాయము. భర్త మరణించి
నను గూడ మఱొకనిని వివాహ మాడరాదని తేలుచుండ
భర్త జీవించియుండగ మఱొకనిని వివాహ మాడరాదని
వేఱుగ చెప్పనక్కరలేదుగదా! దాంపత్య మచ్ఛేద్యమగుచో
పురుషుడుమాత్రము మఱొకస్త్రీని వివాహమాడుట యెట్లను
ప్రశ్న రావచ్చును. అందులకు సమాధాన మేమన: మఱొక
స్త్రీని వివాహమాడినను గూడ పురుషునకు ప్రథమభార్యతోడి
సంబంధముపోదు. భార్యకూడ ప్రథమభర్తతోడి సంబంధము
విచ్ఛిన్నము కాకుండ మఱొక భర్తను వివాహమాడరాదా
యనిన నట్లుకాదు. ఏమన: "నైకాద్వావతీ విందతే" "నైక
స్యై బహవస్సహపతయః" అను స్థలములలో స్త్రీ కిద్దరు
భర్తలుండరని స్పష్టముగ చెప్పబడినది.

కావుననే యాకాలములో భర్త యనువానికి ప్రధా
నముగ నుండవలసిన పుంస్త్వము లేకుండినను గూడ స్త్రీ
మఱొక పురుషుని వివాహము చేసికొనక యాతనినే భర్తగ
గలిగి యుండెడిది. అట్టిస్థితిలో నున్న భార్యయొకతె నీతిబద్ధ

మగు విధముచే పుత్రునిగని భర్త వంశమును నిలబెట్టవలసినదని తలచి యశ్వినీదేవతలను ప్రార్థించి వారివలన పుత్రుని బడసెనని ఋ. సం. 10–116–13 లో చెప్పబడియున్నది. భర్త బద్ధుడై స్వాతంత్ర్యమును కోల్పోయి భార్యను పొందలేకపోయినపు డాతనిభార్య యింద్రావరుణులను ప్రార్థించి పుత్రుని గనెనని ఋ. సం 4–42–8 లో చెప్పబడియున్నది. (ఈ రెండు ఋక్కులును గూడ స్త్రీలు—కర్మకాండ'' యను ప్రకరణమున వివరింపబడును.) భర్త యెంత గుణహీనుడయినను గూడ భార్య యాతని వదలగూడదనునదియే వేదకాలపు దాంపత్యనియమములలో ముఖ్యమగు నియమము. సుకన్య యను నామె భర్త వృద్ధుడై యుండుటచే అశ్వినీదేవతలామెను వివాహ మాడగోరి వచ్చినపు డామె యిట్లనెను.

నైవాహం జీవంతగ్ హాస్యామి యస్మైమాం పితాదాత్.

(శాశ్వశ. బ్రా. 5–1–5–6)

అర్థము :—నేను జీవించియుండగ నాభర్తను వీడను. ఏమన : నాతండ్రి నన్నాతని కిచ్చెను.

ఒక్కపర్యాయము వివాహము చేసికొనినవాని నిక వదలరాదనియే యానాటిసతుల యభిప్రాయము. సుకన్య 'నాతండ్రి నన్నెవరి కిచ్చినాడో యాతని నేను వీడ' ననుటలో నిదియే యర్థము. భర్తను వదలకుండుట కాతనికొకపర్యాయ మీయబడి యుండుటయే కారణము. ఈయబడుటతో

నాతనిసొత్తైనది. అట్లే కాకున్నచో దానమను పదము
కర్థమే యుండదు.

భార్య భర్తలోను భర్త భార్యలోను నర్థ భాగములని వే
ములలో గాన్పించుచున్నను గూడ భార్య భర్తకధీనమైయుం
వలయుననియే వేదమతము. వారిసంబంధము త్రెంచుటకు వీ
కాదను నభిప్రాయమును తెలుపుటకే వారొకరిలో మఱొక
భాగమని వేదములు చెప్పుచున్నవి కాని యిరువురకు
సమానాధికారము లున్నవనిగాని సమానకర్తవ్యములున్న
వనిగాని తెలుపుటకు కాదు. వివాహ మగుటతోడనే స్త్రీ
భర్తయొక్క సొత్తయినట్లే వేదముల యభిప్రాయము. సర్వ
విధములచేతను నామె కాతడే శాసకుడు. స్త్రీ యాతని యధీ
నమున నుండవలసినదే కాని స్వతంత్రముగ ప్రవర్తించుటకు
హక్కుగలది కాదు. పురుషుని యీ శాసకత్వమువలననే
యాతనికి "పతి" యను పేరు వచ్చినది. 'పతి' యనునది
'పా—రక్షణే' యను ధాతువునుండి నిష్పన్నమైనది. పాలిం
చువాడని దానియర్థము. ఈపాలనములో నధికారముమా
త్రమే కాక విధులుకూడ నిమిడియున్నవి. ఆతడేమి చే
నను నామె యనుభవింపవలసినదే. వేయేల ? ఆతని గృహము
లోని వస్తుచయమువలెనే, గోహిరణ్యాదులవలెనే యామెయు
నాతనియాస్తిలో చేరినదే యనుటకు గూడ గొన్ని యాధా
ములున్నవి. పురుషుడు ఋణగ్రస్తుడై యున్నపుడు ఋణదా
లాతని ధనమును స్వాధీనము చేసికొనుటయేకాక యాతని

భార్యపైకి కూడ వచ్చినట్లు (ఋ. సం. 60-34-4) చెప్పు చున్నది. (ఈఋక్కుయొక్క యర్థము ప్రథమాధ్యాయమున వివరింపబడినది.) భార్య భర్తయొక్క సొత్తని చెప్పుట కింకను నేమి కావలెను? స్త్రీకి ప్రత్యేక వ్యక్తిత్వము లేదనియు భర్త పైననే యామె స్థితి యాధారపడి యుండెననియు దీనిని బట్టి తెలియుచున్నది. అంతవఱకును బోనేల? వేదములో కొందఱు స్త్రీలకు గల నామములను పరికించినను నీసంగతి స్పష్టమగును. ఇంద్రుని భార్య 'ఇంద్రాణి'; ముద్గలుని భార్య ముద్గలాని; వరుణుని భార్య వరుణాని; అగ్నిభార్య అగ్నాయి. ఇట్లే భర్తల నామములనుండియే గ్రహింపబడిన నామములుగల స్త్రీలు వేదమున చాలమంది గలరు. ఒక పురుషునికి భార్యయై యుండుట తప్ప మఱొక హోదా స్త్రీకి లేదని యిందువలన తెలియుచున్నది.

అందువలననే తా నెవనికి భార్యయై యున్నదో యాతడు మరణించుటతోడనే తా నీలోకమున నిలుచుటకే స్త్రీ కర్హతలేకుండ బోవుచున్నది. సహగమన మేర్పడుట కిదియే హేతువు. పురుషుడు భార్యపట్ల ప్రేమ గన్పఱుపవలసినవాడే యైనను నామె ననుసరింపవలెనను నియమ మాతనికి లేదు. ఆమె మరణించుచో తా ననుగమనము చేయనక్కరలేదు.

స్త్రీకిని పురుషునకును నడుమ నింత గొప్పభేద ముండుటచే, వేదకాలములో స్త్రీకంటె పురుషు డధికుడుగ భావింపబడుచుండెననుటలో సందియింప నవసరము లేదు. పురుషుని

యాధిక్యమువలననే స్త్రీ యాతని సేవించి యానందింపచేయ
వలసియుండెను. భార్యాభర్తల నడుమ నుండు ననేక సంబంధ
ములలో నొకటగు స్వామిత్వభృత్యత్వసంబంధ మేర్పడుట
పురుషుని యీ యాధిక్యమే కారణము. వేదములో ననే
స్థలములలో భర్తను సేవించి యాతని యనుగ్రహమును
పాత్రలైన స్త్రీలు స్తుతింపబడియున్నారు.

జాయేవ పత్యావధి సేవమంహసే॥ (ఋ. సం. 9-82-4

అర్థము:—ఓ సోముడా! భార్య భర్తకు సుఖము
నిచ్చునట్లు నీవు యజ్ఞము చేయువానికి సుఖము నిచ్చు
చున్నావు.

అభిప్రవంత సమనేవ యోషాః।
కల్యాణ్యస్మయ మానాసో అగ్నిం ఘృతస్య ధారాసహ
(ఋ. సం. 4-58-8

అర్థము:—సమానమనస్కులును కల్యాణగుణముగల
వారును నవ్వుచుండువారును నగు స్త్రీలు ప్రేమచేత భర్తను
ముంచివేయునట్లు ఘృతధారలు అగ్నిని ముంచివేయుచున్నవి.

భర్తను ప్రేమచేత ముంచివేయుట కల్యాణగుణముల
గల స్త్రీలకు లక్షణమని యిచట చెప్పబడినది. కావుననే వేద
ములో మఱియొకచోట భర్తను ప్రేమచేత వశపఱచుకొను
స్త్రీ మిక్కిలి స్తుతింపబడినది.

అనవద్యాపతి జుష్టేవ నారీ॥ (ఋ. సం. 1-73-3

అర్థము :—దోషరహితయు పతిచేత సేవితయు నగు స్త్రీవలె నగ్ని యున్నాడు.

పతిచేత సేవింపబడు నారి దోషరహిత యన నేమన: నిరంతరము భర్తను భక్తితో గొలుచు నామెయందు భర్త ప్రీతుడై యామెయందు తాను గూడ గౌరవమును గన్పఱచును. ఆమెను సేవించును. ఈవిధముగ పతిచేత సేవింపబడిన యామెయే దోషరహిత యగును గాని తన గయ్యాళితనముచేత భర్తవలన సేవను పొందు నామెకు దోషరహిత యను బిరుదము రాదు. అగ్ని సమస్త పదార్థములలోను పవిత్రతమము గావున నట్టి పతివ్రత యిచట నగ్నితో పోల్పబడినది.

పైవిధముగ పతికి ప్రియురాలగుటయే స్త్రీయొక్క పరమధర్మము. ఆధర్మమును నెఱవేర్చుటవలన స్త్రీ యిహమున కీర్తిని పరమున సుఖమును పొందుటయే కాక యుభయవంశములవారికిని గూడ కీర్తిని తెచ్చున దగును. కావున నే యా కాలములో తండ్రులు తమ కుమార్తె భర్తకు ప్రియురాలు కావలెనని విశేషముగ కాంక్షించెడివారు.

యాంకామయేత దుహితరం ప్రయాస్యాదితి తాం నిష్ట్యాయాం దద్యాత్ ॥

(తై. బ్రా. 1–5–2–3)

అర్థము :—కుమార్తె భర్తకు ప్రియురాలు కావలెనని కోరు నాత డామెను స్వాతీనక్షత్రములో దానము చేయవలెను.

అట్లు దానముచేయుటచే నామె భర్తయందు మిక్కి
ననురక్తయై భర్తను వదలుట కిష్టములేని పతివ్రత యగు
ఆమె యాతని వదలి పుట్టింటికి రానే రాదు. ఈసంగతి యీ
క్రింది వాక్యములో నున్నది.

నైవతు పునరాగచ్ఛతి॥

(తై. బ్రా. 1-5-2-

తఱచుగ భర్త యిల్లు వదలి పుట్టింటికి వచ్చుచుండు
స్త్రీధర్మమునకు విరుద్ధమని వేదములలో చాలచోట్లు సూచి
బడినది. "వివాహమ" ను ప్రకరణములో వివరింపబడి
"ప్రేతో ముంచామి నాముతస్సు బద్ధాముపతస్కరం" అ
ఋక్కువలన గూడ నీయంశము తెలియుచున్నది. "ఇహై
స్తం మావియోష్టం" (ఇచ్చటనే యుండుడు. వియోగము
పొందకుడు.) అను వాక్యము దీనినే బోధించుచున్నది.

పతి కనుకూలముగ నుండి యాతని యనుగ్రహమున
పాత్రలగుట స్త్రీల ధర్మమని పైన నుడువబడినది. అంతియే
కాదు. పతిని ద్వేషించుట మహాపాపమని కూడ వేదములలో
స్పష్టముగ చెప్పబడియున్నది.

పతిరిపోనజన యోదు రేవాః।

పాపాసస్సన్తో అనృతా అసత్యా ఇదంపద మజనతాగభీరం

(ఋ. సం. 4-5-

అర్థము:—యజ్ఞమార్గమును విడచి యమార్గము
సంచరించువారు పతిద్వేషిణులైన స్త్రీలువలె దురాచారము

గలవారై పాపాత్ములై మానసిక కాయికాసత్యములను పల్కు-వారై లోతైన ప్రసిద్ధమగు నరకమును సృజించుచున్నారు.

పతిని ద్వేషించు స్త్రీలు పాపిష్ఠలనియు నరకమునకు బోదురనియు వేదముల యభిప్రాయమని యిందువలన తెలియుచున్నది.

పైన చెప్పబడిన యంశములను బట్టి వేదకాలములోని స్త్రీలు పురుషుల బానిసలని తలచుటకు వీలులేదు. పురుషుని సేవింపవలసిన విధిమాత్రమే యందు చెప్పబడినది. భార్య భర్తయొక్క సేవకురాలు మాత్రమే కాక స్నేహితురాలు కూడ నని మరువరాదు. అందువలన నామెకు భర్తతోడి సమానప్రతిపత్తి కూడ గలుగుచున్నది. నిరంతరము కలసియే యుండవలసిన యిరువురు వ్యక్తులనడుమ నింత విరుద్ధములుగ గాన్పించు రెండువిధములగు సంబంధము లుండుటలో నాశ్చర్యములేదు. భోజనము చేయునపుడు భార్య యుండవలెను. యజ్ఞము చేయునపుడు భార్య యుండవలెను. గృహకృత్యములను చక్కబెట్టుకొనుటలో భార్య యుండవలెను. ఇంకను ననేకస్థలములలో నుండవలెను. ఇన్నిటియందునుగూడ నామెకొక్కే హోదాయిచ్చుట సాగదు. తుదకు శత్రువులను జయించుటలోగూడ భార్యసహాయ మపేక్షింపబడు చుండెనుగదా! కావున నామె సేవకురాలు, స్నేహితురాలు, మంత్రియున్నగు ననేక హోదాలను స్వీకరింపవలసి యుండును. భార్యాభర్తలు పరస్పరము స్నేహముతో వర్తింపవలసిన వారని వేదము చెప్పుచున్నది. వరుడు వధువుతో నిట్లనును.

సఖాస ప్తపదాభవ సఖాయౌస ప్తపదాబభూవ సఖ్యంతే గమేయగ్ సఖ్యాత్తేమాయోషగ్ సఖ్యాన్మే మాయోష్ఠా స్సమయావసంకల్పావహై సంప్రియారోచిష్ణూ సుమన్య మానా విషమూర్జమభిసంవసానౌ సంనౌమనాగ్ సిసంవ్ర తాసముచిత్తాన్యాకరం॥ (తై. మం. ప్ర 1-3)

అర్థము:—ఏడడుగులువైచిన నీవు నాకు స్నేహితు రాలవగుము. ఏడడుగులువైచిన నీవును నేనును స్నేహితుల మగుచున్నాము. నేను నీస్నేహమును పొందుచున్నాను. నీ స్నేహమును వదలను. నీవు నా స్నేహమును వదలకుము. కలసియుండము. చేయదగిన విషయములను నిశ్చయించుకొం దము. అన్యోన్యము ప్రేమించుకొనువారమై యొకరివలన మఱొకరు ప్రకాశించువారమై మంచిమనస్సు గలవారమై అన్నమును బలమును పొందెదము. మన యిద్దఱి మనస్సు లును నొకటి యగునట్లు చేయుచున్నాను.

దంపతుల స్నేహమునకును లోకములోని యితరస్నే హములకును భేదమేమన; ఇతర స్నేహములు నశింప వచ్చును. కాని దంపతులస్నేహ మెన్నడును నశింపకూడదు. ఈ విషయము స్పష్టముగ పైమంత్రమువలన తెలియుచున్నది. స్నేహములేక ప్రేమ యున్నంతకాలమే దాంపత్య ముండవలె నను నియమముకాక దాంపత్య మున్నంతకాలమును గూడ స్నేహముండియే తీరవలెననునదియే వైదిక దాంపత్య రహ స్యము. దాంపత్యము శాశ్వతముగావున స్నేహముకూడ

శాశ్వతముగనే యుండవలయును. కావున స్నేహము వదలిన దంపతులు వేదమతమునకు విరుద్ధముగ ప్రవర్తించినవారే యగుచున్నారు.

భర్త భార్యపై నధికారము గలవాడేయైననుగూడ నాతడు తనయధికారమునుచూపి కాక స్నేహమునుచూపియే యామె ననుకూలగ చేసికొనెడివాఁడు. హృదయములో ప్రేమ లేకున్నవ్యక్తి కన్పఱచెడు వినయమువలన నధికారికి ఆనందము కలుగదుగదా! కావుననే వివాహములో వధూవరుల హృదయములు కలియుటకై ప్రార్థనలున్నవి

సంమాతరిశ్వాసం ధాతాసముదేష్ట్రీ దధాతనౌ॥

(ఋ. సం. 10—85—47)

అర్థము:—వాయువు, బ్రహ్మ, సరస్వతియు మాబుద్ధులు పరస్పరానుకూలము లగునట్లు చేయుచుగాక!

భర్తకు భార్యపైనుండు స్నేహభావ మెంతయెక్కుడుగ నుండెననగా: తానామెకు శాసకుడే యై యున్నను కూడ నామెకోపమునకు వెఱచి యీ విధముగ బ్రతిమాలుకొనుచున్నాడు.

అఘోరచక్షురపతిఘ్న్యేధి॥ (ఋ. సం. 10-85-44)

అర్థము:—ఓవధూ, నీవు భయంకరముగాని నేత్రములుగలదానవగుము. పతిని హింసించుదానవు కాకుము.

పై యంశము లన్నిటినిబట్టి చూడ భార్యాభర్తలకు గల సంబంధ మిదమిత్థమని చెప్పుటకు వీలులేదనికూడ తెలి

 

యుచున్నది. పురుషుని యాధిక్యము స్పష్టమే యైనను నా[illegible]
డామెకిచ్చిన స్థానమే చిత్రముగ నున్నది. పురుషుడు భార్య[illegible]
తనతో సమానురాలనుగ చూచుకొనుటయేకాక తన్నా[illegible]
కర్పించుకొనుటకూడ వేదములలో గన్పట్టుచున్నది. వరు[illegible]
వధువుతో చెప్పు నీక్రిందిమాటలు పరికింపదగును.

మూర్ధానం పత్యురారోహ॥ (తై. మం. ప్ర. 6-5)

అర్థము:—ఓవధూ, భర్తనగు నానెత్తి నెక్కుము.

వేదకాలములో భార్యాభర్తల కొకరిపట్ల నొకరి క[illegible]
డుచుండిన భావములే యీ యధ్యాయములో వివరింప[illegible]
నవి. దంపతులుకలసి చేయవలసిన యనేక కార్యములున్న[illegible]
అవన్నియు ముందు ప్రకరణములలో గన్పడుపబడును.



## షష్ఠాధ్యాయము.



### స్త్రీలు: గృహము.

వేదకాలములో గృహమే స్త్రీల కాలమునంతయు
హరించుచుండెడిదని స్పష్టముగ దెలియుచున్నది. వారికి గృహ
బాహ్యకర్మలలో ప్రవృత్తి చాలనరుదుగ నుండెడిది. పురుషు
వలె స్త్రీలు బయట సంచరించెడువారుకారు. కొందఱుస్త్రీ

యినను ఘోషాపద్ధతిని పూర్తిగ నవలంబించెడి వారని చెప్ప వచ్చును.

ఋష్టిః గుహాచరంతీమనుషోనయోషా. (ఋ.సం.1-167-3)

అర్థము:—మనుష్యస్త్రీ యంతఃపురములోవలెమెఱుపు అంతరిక్షములోనిగూఢముగ సంచరించుచున్నది.

స్త్రీల కంతఃపురవాస మానాడుండెడిదని దీనివలన తెలియుచున్నది. ఎట్టిస్త్రీల కంతఃపురవాసముండెనో చెప్ప లేము. సాయణాచార్యుల భాష్యముననుసరించి యిచ్చటి స్త్రీరాజమహిషి. కాని యిది మనము తప్పక గ్రహింపవలసిన యర్థముకాదు.

అంతఃపురవాస మందఱుస్త్రీలకు నుండినను లేకున్నను స్త్రీయొక్క వృత్తి ముఖ్యముగ గృహమునకు సంబంధించినదే యనువిషయము స్పష్టముగ ఋగ్వేదములో చెప్పబడినది. గృహముతప్ప మఱిదేనితోను స్త్రీకి సంబంధములేదనియు గృహమునందలి ప్రతి విషయముతోను నామెకు ప్రసక్తికలద నియు చెప్పుటకయియే ఋగ్వేదములో నొకచోట గృహమే భార్యయని చెప్పబడినది.

జాయేదస్తం (ఋ. సం. 3-53-4)

అర్థము:—గృహము భార్యయే.

స్త్రీ లేనిచోనిల్లు ఇల్లుకాదు. అను భావము ఋగ్వేద ములోను యజుర్వేదములోను స్మృతులలోను నితరార్యవా ఙ్మయములోను గూడ గాన్పించుచున్నది.

శ్లో॥ నగృహంగృహమిత్యాహుః గృహిణీ గృహముచ్యతే॥

అనుమనువాక్యమునకుపైన నుదాహరింపబడిన "జాయే దస్తం" అనునదియే యాధారము. ఇల్లనగా గోడలు, పెంకులు, ద్వారబంధములు కావు. భార్యయే యిల్లు. ఇట్లుచెప్పుటకంటెను గూడ ఋగ్వేద కాలమునాటి స్త్రీల వృత్తి పూర్తిగ గృహమునకు సంబంధించినదే యనియు బాహ్యకర్మలతో నామెకు నిమిత్తములేదనియు చెప్పుటకు మఱేమి కావలెను? "జాయేదస్తం" అనునది స్త్రీకి గృహముతోగల సంబంధమును తెలుపుచున్నదేగాని బయటివ్యాపారములతో నామెకు సంబంధములేదని యిందుమూలముగ తేలదని చెప్పుటకు వీలులేదు. ఏమన గృహ్యకర్మలన్నియు నామెపైననే పడియున్నపుడు బాహ్యకర్మలనుకూడ చేయుటకామెకు తీరికయు, శక్తియు నెటనుండివచ్చును? ఈవాదమునందఱును పూర్తిగ నంగీకరించినను నంగీకరింపకున్ననుగూడ నానాడు స్త్రీలకు గృహబాహ్యకర్మలతో ప్రసక్తియున్నను నది బహుస్వల్పముగ నుండవలెనని యందఱును నంగీకరింప వలసి వచ్చును.

స్త్రీలస్థానము గృహమేయని తెలుపు ఋగ్వేద మంత్రము లనేకము లున్నవి.

అపాఃసోమమస్తమింద్ర ప్రయాహి కల్యాణీర్జాయాసరణం గృహేతే॥ (ఋ. సం. 3-5-3-6)

అర్థము :—ఓ యింద్రుడా! సోమము త్రాగుము,

ఇంటికి వెళ్ళుము. నీయింటియందు మంగళకారిణియు సుంద రయు నగు భార్య యున్నది.

గృహ మాకర్షక పదార్థమగుటకు కారణము భార్య యచట నుండుటయే యని యిందువలన తెలియుచున్నది. గృహమునకును భార్యకును గల యవినాభావసంబంధము గూడ స్పష్టమగుచున్నది. 'జాయేదస్తం' అనుదాని యభిప్రాయ మిం దిమిషీయున్నది.

ఇంచుమించుగ స్త్రీ యొక్క కృత్యములన్నియు గృహ మునకు సంబంధించినపని తేలుచుండగా నిక నా కృత్యముల యొక్క వివరముల నరయుదము.

ఇంటిలో స్త్రీ గృహపత్నియై యున్నపుడే యామెకు బాధ్యత యెండు. ఇంటికాడుపడుచుగనుండినపుడుగాని, బాలి కగనుండినపుడు గాని యామెకు బాధ్యత లేదు. గృహయజ మానియొక్క కూతురు గోవులకు పాలుపితుకుట యను కృత్య మును నెఱవేర్చుచుండెనని చెప్పుటకు కొంతయాధారమున్నది. ఎట్లన: దుహితయనుపదము 'దుహీ' ధాతువునుండి వచ్చుచు న్నది. 'పితుకుట' యని దీనియర్థము. కావున దుహితయనగా పాలుపితుకునదియని తేలుచున్నది. ఈ గ్రంథముయొక్క ప్రథమాధ్యాయములో దుహితయనగా దూరమందు సం బంధముచేయదగినదను నర్థము తెలుపబడినది. ఆయర్థమును పాలుపితుక్నునది యనునర్థమునుగూడ నీశబ్దమునకు చెప్పుటకు వీలున్నది. ఇందులకు యాస్కాచార్యుడే ప్రమాణము.

దుహితృశబ్దమున కర్థము వ్రాయుచు నాతఁడు "దూరేహితా దోగ్ధర్వా" అని చెప్పియున్నాఁడు. దూరమున నుంచుటకు గాని పాలుపితుకుటకుఁగాని తగినదని దీనియర్థము.

గృహభార మంతయు వహించుటకు వచ్చిన యింటికోడలుయొక్క కృత్యములేవో యికచూతము. "జాయేద స్తం" అనుటం బట్టియే యామె బాధ్యతలస్వరూపము తెలియుచున్నది. ఐనను కొన్ని వివరములను చూతము.

భర్తపట్ల నామె వినయవిధేయలతో ప్రవర్తింపవలయు నను విషయము దాంపత్యమను ప్రకరణమువలననె దెలియ గలదు. గృహములో పత్ని కెంతయధికారమున్నతో యంత భాధ్యతయు నున్నది. గృహమే తానైనను భర్త్రాజ్ఞ నామె వెంటనే బాలించుచుండెను.

'పత్నీవపూర్వహూతింవావృధధ్య ఉషాసానక్తాపురుధాని దానే"
(ఋ. సం. 1–122–2)

అర్థము:—పత్ని వెంటనే భర్తయొక్క పిలుపును సఫలపరచునట్లు ఓ అహోరాత్రములారా! మీరు మా యాహ్వానమును స్వీకరింపుడు.

అంతేకాదు. ఆమె విసుగుకొనుచు రోజుకొనుచునుండక కలకలలాడుముఖము కలదై యెంతవిచారనిమగ్నుఁడై యున్నపుడైనను గూఁడ భర్త నానందతరంగముల నోలలాడించుచుండెను. భర్తయొద్దకు వెళ్ళునపుడా తని నానందింపజేయుటయే యామెకు ప్రధానము. రాత్రులందు భర్తృశయ్యను జేరునపుడు పరిశుభ్రమై చక్కనివస్త్రములను ధరించుచుండెను.

అయం యోనిశ్చకృమయం వయం తే।
జాయేవపత్య ఉశతీసువాసాః॥ (ఋ, సం. 4–3–2)

అర్థము :—ఓ అగ్నీ ! నీకు మేమే యుత్తరవేదిని జేసితిమో యది నీకుస్థానమగుగాక. ఎట్లనగా: భార్య చక్కని వస్త్రముల ధరించినదై భర్తకు స్థానమగుచున్నట్లు.

శయనసమయమున సర్వవిధములచేతను భర్తకానందకరముగనుండుట కామె యత్నించుచుండెను. చక్కని యాభరణములధరించి ప్రకాశించుచు నామెభర్తను జేరుచుండెను.

వ్యచస్వతీరుర్వియాశ్రియంతాం
పతిభ్యోనజనయశ్శుంభమానాః (ఋ. సం. 4–58–9)

అర్థము :—వ్యాపించియున్న యోదేవతలారా? మీరీస్థలము నాశ్రయించుకొని యుండుడు. ఎట్లనగా: భార్యలు భర్తలకొఱకై ప్రకాశించుచున్నవారై వారియొద్దకు జేరియుండునట్లు.

ఇక నామెగృహములో జరుగు కర్మలవిషయములో నెంతపాల్గొనుచుండెనో జూడవలసియున్నది. కాని యీవిషయము "స్త్రీలు,—కర్మకాండ" యను ప్రకరణమున జెప్పబడుటచే నిచటవదలబడినది.

పైన యుత్తమామలుగల గృహపత్నివారిపట్ల జరుపు కృత్యముల నించుక బరిశీలింతము. వివాహసమయమున వధువీక్రింది విధముగ నుపదేశింపబడుచున్నది.

"సమ్రాజ్ఞీశ్వశురేభవసమ్రాజ్ఞీశ్వశ్ర్వాంభవ।
ననాందరిసమ్రాజ్ఞీభవ సమ్రాజ్ఞీఅధి దేవృషు॥"

(ఋ. సం. 10–85–46)

అర్థము :—ఓ వధూ, నీవు మామగారికిని అత్తగా
కిని యాడపడుచునకును మరదలునకును, రాణివగుము.

రాణివగుటయనగా : అధికారము చలాయించునది
యగుటకాక సంరక్షకురాలగుటయే యని తెలిసికొనవ
యును. ఏలనగా : కోడలు మామగారికి మిక్కిలి వినయవిధే
యతలను గన్పఱుపవలెనని వేదవాఙ్మయములో ననేకస్థలము
లలో నున్నది.

"అన్యస్నుపాశ్వశురన్యప్రశిష్టం।
సపత్నీవాచంమనసా ఉపాసతాం॥

(తై. బ్రా. 2–4–6–62)

అర్థము :—ఈ యజమానియొక్క యాజ్ఞావాక్కును
శత్రువులు మనస్సుచేత నుపాసింతురుగాక. ఎట్లనగా : కోడలు
మామగారియాజ్ఞ గ్రహించునట్లు.

అంతియేకాదు. వృద్ధులకు గౌరవము నొసగుట సల్ల
క్షణముగ భావింపఁబడుచుండిన యాదినములలో యువకు
డగు గృహపతిభార్య యెల్లపుడును తన్నే కనిపెట్టుకొని యుం
డవలెనని కోరక తనభార్య తనకంటె తండ్రికే యెక్కుడుప
చారములను చేయుచుండవలెనని కోరుచుండెను. కావుననే
వేదములో కొన్నిచోట్ల కోడలు ముందుగ మామగారికి

శుశ్రూషసలిపి యాతని యాజ్ఞను బొందియే భర్తయొద్దకు వెళ్ళుచున్నట్లు దెలుపఁబడినది.

"తేసూర్యాత్పరిసర్పంతి స్నుషేవశ్వశురాదధి"
(అ. సం. 8–2–24)

అర్థము :—కోడలు మామగారి చేతనను జ్ఞాతురాలై భర్తయొద్దకు వెళ్లునట్లు వారు సూర్యునిచేత ననుజ్ఞాతులై భూలోకమునకు వెళ్లుచున్నారు.

ఊర్వశిమామగారికి భోజనము పెట్టినపిమ్మటనే భర్తృశయ్యకు వెళ్ళుచుండినట్లు జెప్పబడినది.

"సావసుదధతిశ్వశురాయవయ ఉషో యదివ ష్ట్యంతి గృహాత్ । అస్తంనన క్షే" (ఋ. సం. 10–95–4)

అర్థము:—ఆమె మామగారికి భోజనముపెట్టి పతికోరినపుడు భోజనగృహమును విడచి భోగగృహమున కేగును.

స్త్రీ కూతురుగ నున్నపుడెట్లుండెనో భార్యగనున్నపుడే కృత్యముల జేయుచుండెనో కోడలుగ నున్నపుడే కృత్యముల జేయుచుండెనో పైన జూచితిమి. ఇకనామె మాతగనున్నపుడే కృత్యముల జేయుచుండెనో సంగ్రహముగ జూతము.

వేదములో ననేకస్థలములలో బిడ్డలపై ప్రేమామృతమును జిలుకుటయే మాతయొక్క ప్రధానలక్షణముగ జెప్పబడినది.

ఉశతీరివమాతరః (తై. సం. 5–6–4)

అర్థము :—(ఉదకములు) తల్లులవలె ప్రేమకలవి.

ఆమె బిడ్డలపట్ల జేయుచుండిన పనులనన్నిటినినిటశ్లో
నులకు సాధ్యముగాదు. ఏమన: బిడ్డలు పెరుగుట బూర్తి
నామెవలనే యని చెప్పవచ్చును. తండ్రికంటెను గూడ బి
లకు తల్లియే గొప్పయాశ్రయము. ఒకానొకవయస్సువచ్చి
పిమ్మట వారామెను వదలి స్వతంత్రముగ నుండగలుగు
డిరి. కుమార్తెలయొక్క జీవితములో మాత్రమే కాక కుమా
రుల జీవితములో గూడ నామెను వదలియుండుటకు వీలుకా
కాలము కొంతయుండెడిది.

ఆపుత్రాసోనమాతరం భృత్రాః సానేదేవాసోవిబర్హిష
సదంతు (ఋ. సం. 7-44

అర్థము:—తల్లిచేత భరింపబడవలసిన కుమారు లే
ముగ నామె నాశ్రయించుకొని యుందురో యట్లే ఓదే
లారా! మీరీ బర్హిస్సుచే నిర్మింపబడిన స్థానము నధిష్ఠింపు

ఎట్లయినను కుమారుని సంరక్షణముకంటె కుమా
సంరక్షణము నేతల్లి యెక్కుడుగ మనస్సున నిడుకొనుచుండె
ఆమె శరీరమున కభ్యంగము కేశములకు సంస్కారము
చుగ చేయుచుండెడిది.

సుసంకాశా మాతృభృష్టేవయోషా వి స్తన్వన్ కృణు
ధృషేకం (ఋ. సం. 1-123-11

అర్థము:—ఓ యుషోదేవతా! తల్లులచేత పరిశుద్ధు
లుగ చేయబడిన స్త్రీవలె నీవు శరీరమును నందఱును జూ
టకై బ్రదర్శించుచున్నావు.

బిడ్డలను పెంచుకొనుటలోనె స్త్రీయొక్క కాలము హరింపబడును. అందువలన శరీరాయాసముగూడ గలుగును. కాని పుత్రానందముచే మైమఱచి యుండు తల్లికివి లెక్కకు వచ్చునా? గృహకృత్యములలో నిమగ్నమైయున్న స్త్రీని బిడ్డలు దరిచేరి యామెను కొట్టుచు నల్లరిచేయుచు నుండు దృశ్యము చూచుటకు మంత్రకర్తకు పరమానందముగలిగి యీక్రిందివిధముగ జెప్పుచున్నాడు.

సు తే అధ్వరే అధి వాచమక్రతా క్రీళయో న మాతరం తుదంతః (ఋ. సం. 10-94-14)

అర్థము:—కుమారులాడుకొనుచు తల్లినికొట్టుచు కేకలు వేయుచుండునట్లు యజ్ఞమందు గ్రావములు సోమమును గొట్టుచు శబ్దమును చేయుచున్నవి.

గృహపత్ని ఇంటిలోని యందఱకునుగూడ రక్షణను గలుగజేయవలెనని పైన చెప్పబడినది. ఇంతియేకాదు గృహమునాశ్రయించుకొనియున్న సేవకులకును పశువులకునుగూడ నామె సంరక్షకురాలే. వరుడు వధువుతో నీక్రిందివిధముగ జెప్పుచున్నాడు.

జీవసూర్దేవకామా స్యోనా శన్నో భవద్విపదే శం చతుష్పదే (తై. సం. ప్ర. 1-1)

అర్థము:—ఓవధూ! సంతానముగలదాన వగుము. దేవతలను బూజించుదానవగుము. శ్రేష్ఠురాలవగుము. మానుష్యులకును పశువులకును సుఖము కలుగ జేయుదాన వగుము.

ఇది యది యననేల! వధువగు సూర్యతో వరుడిట్లను చున్నాఁడు.

అస్మిన్గృహే గార్హ్యపత్యాయజాగృహి
(ఋ. సం. 10-85-27)

అర్థము:—ఓవధూ! ఈ గృహమందు గృహపతిత్వ ముకొఱకు మేల్కొనుము.

ఇట్లనుజ్ఞాతురాలై వధువు రాజ్ఞీపీఠము నధిష్ఠించును. చాకచక్యముతో గృహమును బాలించును. ఈపాలనము అధి కారప్రదర్శకము మాత్రమై పాలితుర నేడ్పించునదిగాదు. మఱియెట్టిదన! దీనివలన అంతకుముందున్న దుఃఖములునివా రితములగును. గృహము భూలోకస్వర్గమగును.

మా తేగృహేనిశిఘోష ఉత్థాదన్యత్రత్వ ద్రుదత్యస్సంవి శంతు । మాత్వంవికేశ్యుర ఆవధిష్ట జీవపత్నీ పతిలోకేవి రాజపశ్యంతీ ప్రజాగ్ సుమనస్యమానా.

(తై. మం. ప్ర. 1-4)

అర్థము:—ఓవధూ! నీగృహమందు రాత్రి ఆర్తనా దమువినబడకుండుగాక! ఏడ్చునట్టి స్త్రీలు నీయింటియందు గాక నీశత్రువుల యిండ్లయం దుండెదరుగాక. నీవెన్నడును జుట్టువిరియబోసికొని ఱొమ్ముగొట్టుకొనుదానవు కాకుము. ఐదవతనముగల దానవై భర్త యింటియందు సుఖముగా సంతానమును జూచుకొనుచు బ్రకాశింపుము.

ఈ విధముగా గృహమును స్వర్గముగా మార్చిన వేద కాలపుస్త్రీ నేమనివర్ణింపవలయునో దెలియకున్నది. ఒక ఋషి యీవిధముగ జెప్పినాడు.

జాయేవ యోనా వరంవిశ్వస్మై॥ (ఋ. సం. 1-66-3)

అర్థము:—గృహమునందు భార్య ఏవిధముగ నలంకారముగ నున్నదో యావిధముగనే యగ్నిహోత్రుఁడు సర్వకర్మలకు నలంకారమై యున్నాఁడు.

గృహములోని సమస్త సౌఖ్యములకును గారణమై యందలి శోభకు నిదానమై యొప్పుచుండిన వేదకాలపుస్త్రీ గృహమున కలంకారమని జెప్పుటలో నేమియు నతిశయోక్తి లేదు.



## సప్తమాధ్యాయము.



### స్త్రీలు—బాహ్యప్రపంచము.

వేదకాలపు స్త్రీలకు గృహమే ప్రధానస్థానమైనను బాహ్యప్రపంచముతో వారికి బొత్తుగ సంబంధము లేకుండ లేదు. అనేకములగు యజ్ఞయాగాదులు గృహమునకు బయట నేజరుగుచుండెడివి. మరియు స్త్రీలప్పుడప్పుడు సభలుగ గూడుటకూడ

నాకాలములో నుండెనని తెలియుచుండుటచే స్త్రీలకు
గృహములను వదలి స్వేచ్ఛగ నొక్కొక్కప్పుడు తోటివా
వారితో కలసి ముచ్చటించుకొనుట కర్తవ్యమైయుండెనని చె
వలసియున్నది. స్త్రీలు సభలుచేయుట యానాడుండెనని చె
టకీక్రింది వాక్యము ప్రమాణము.

సస్త్రీషగ్ సాదముపాసీదత్ (తై. సం. 2-5-1-

అర్థము:—ఆయింద్రుడు స్త్రీలసభను పొందెను.

ఇచ్చట స్త్రీషగ్ సాదమను పదమునకు సాయణా
లీవిధముగ భాష్యము వ్రాసియున్నారు.

"స్త్రియః సమ్యక్ సీదంతి విస్రంభేణ ఉపవిశంతి
స్యాంసభాయాం" "ఏసభయందు స్త్రీలు స్వేచ్ఛగనుండుట
చక్కగకూర్చుని యున్నారో యాసభకు సంసదమని పే
అని దీనియర్థము.

స్త్రీలు ప్రత్యేకము స్త్రీలుండు సభలోనేగాక పురు
లుండుసభలోగూడ నుండుటయు, నందు ప్రసంగించుటయ
గూడ నాదినములలో చాలయరుదుగ నుండెను. గార్గియ
బ్రహ్మవాదిని మహాపండితులసభలో వేదాంతగోష్ఠిలో పా
నెనని గార్గిబ్రాహ్మణము నందున్నది. బ్రహ్మవాదినుల
సామాన్య స్త్రీలకువలె పురుషులయొద్దకు బోరాదను నియ
ముండనవసరములేదు. కావుననే యామె పురుషులసభల
నిలబడి మాట్లాడెను. ఇట్టి బ్రహ్మవాదినులు వేదకాలము
బహు స్వల్పసంఖ్యాకలుగ నుండిరి. మన మెఱిగియున్న

వఱకు సుమారు పదిమంది మాత్రమే యుండిరి. కావుననే పురుషులతో బాటు సభలో పాల్గొను స్త్రీలు కొలదిమందిమాత్రమే యుండిరని పైన చెప్పబడినది.

సామాన్యముగ స్త్రీలు పురుషులుండు సభలకేగెడివారుకారను నంశము నీక్రింది వాక్యము మఱింత స్పష్టముగ స్థిరపఱచుచున్నది.

తస్మాత్ పుమాగ్ సః సభాగ్ యాంతినస్త్రియః

(మై. సం. 4-7-4)

అర్థము:—ఆహేతువుచేత పురుషులు సభలకేగుదురు. ఆసభలకు స్త్రీలేగరు.

ఇచట స్త్రీ లేగరని చెప్పినసభ పురుషులుండుసభయే ప్రత్యేకము స్త్రీలుండు సభకాదు. ఏమన అట్టి సభలు వేదకాలములో నుండినట్లు పైన ఋజువు చేయబడియున్నది. ప్రత్యేకము స్త్రీలుండు సభలకైనను స్త్రీలరుదుగ మాత్రమేవెళ్లెడివారు. ఏమన ! వారి ప్రథానస్థానము గృహామేయని "స్త్రీలు—గృహకృత్యములు" అను ప్రకరణమున స్పష్టపఱుపబడినది.

స్త్రీలు సభలలో పాల్గొను విషయము నిక విడచి బాహ్యప్రపంచములో వారింకను నేయే పనులను జేసెడివారో చూతము.

ఉదరపోషణము చేసికొనలేని కుటుంబములలోని స్త్రీలు కొందఱు పరగృహములలో సేవచేసికొని జీవించుటయే కాక రాజాస్థానములలో గూడ సేవ చేసికొనెడివారు.

ఉభే భద్రే జోషయేతే నమేనే. (ఋ. సం. 1-95-6)

అర్థము :— ఈద్యావాపృథివులు అగ్నిని సేవించు చున్నవి. ఎట్లనగా! మంగళప్రదలగు స్త్రీలు రాజున కిరు ప్రక్కలను నిలబడి యాతని సేవించునట్లు.

'రాజును' అను మాట మూలములో లేదు. సాయ ణులు దానిని పూరించిరి. అట్లు పూరింపకున్నను గూడ ప్రకృతవిషయ మీ ఋక్కువలన వ్యక్తమగుచునే యున్నది. కాని రాజును స్త్రీలు సేవించుచున్నారని సాయణులు వ్రాసి నది సమంజసముగనే యున్నదని అర్వాచీనభారతదేశచరిత్ర వలన తెలియుచున్నది. ఏమనగా చంద్రగుప్తమౌర్యుని స్త్రీ సేనకురాండ్రు పరివేష్టించి యుండినట్లు చరిత్ర చెప్పుచున్నది. శాకుంతలనాటకమున గూడ దుష్యంతమహారాజు యవనస్త్రీ పరివేష్టితుడై యున్నట్లు చెప్పబడినది.

దీనిం బట్టి కొందఱు స్త్రీ లుదరపోషణార్థమై యిల్లు కదలి యూడిగము చేసికొనెడువారని తెలియుచున్నది. కాని యది నిమ్నకులమునకు చెందినవారిలోని వాడుకయే. గౌరవ ప్రపత్తులు గల స్త్రీలకు సంబంధించినది గాదని మన మూహింప వచ్చును.

పైన చెప్పబడిన యుద్యోగములవంటివే గాక యించు మించుగ పురుషులు చేయు నన్నిపనులను గూడ ఋగ్వేద కాలమునాటి స్త్రీలు బహు స్వల్పసంఖ్యాకలు చేయుచుండెడు వారని చెప్పుట కాధారము లున్నవి. బహు స్వల్పసంఖ్యాక

లని వేల చెప్పవలసివచ్చినదనగా సామాన్యముగ స్త్రీయొక్క స్థానము గృహమే యనియు కొందఱు స్త్రీల కంతఃపురవాసము గూడ నుండెడిదనియు నింతకుపూర్వము నిరూపింపబడినది. మఱియు నట్టి యుద్యోగములలో నున్నవారు పురుషులనియే యించుమించుగ నన్నిస్థలములలోను చెప్పబడినది. ఇంచుమించుగ పురుషులు చేయు వృత్తుల నన్నిటిని గూడ కొలదిమంది స్త్రీలు చేయుచుండెడివారే యని చెప్పుట కాధార మేమనగ కొందఱు స్త్రీలు యుద్ధముచేసినట్లు ఋగ్వేదములో నున్నది. యుద్ధమే చేసినారని చెప్పబడియుండగా నితరములగు పురుషుల కుచితములగు పనులను చేసెడివారని వేఱుగ చెప్పవలయునా?

ఇక స్త్రీలు యుద్ధము చేయుటం గూర్చి కొంత విచారింతము.

యుద్ధము చేయువారు తఱచుగ పురుషులే యనునది జ్ఞప్తియం దుంచుకొనవలెను.

ఒక స్త్రీ యీ క్రిందివిధముగ చెప్పుచున్నది.

మమపుత్రాః శత్రుహణోఽథో మే దుహితా విరాట్॥

(ఋ. సం. 10–159–3)

అర్థము:—నాపుత్త్రులు శత్రువులను జంపువారగుదురుగాక! నా కుమార్తె ప్రకాశించునది యగుగాక!

దీనిం బట్టి శత్రుహననక్రియ పురుషులనుండి యపేక్షింపవలసినదే యని తెలియుచున్నది. ఐనను స్త్రీలు యుద్ధము చేయుట ఋగ్వేదకాలములో లేకపోలేదు. కొందరు స్త్రీలు

యుద్ధము చేసినట్లు వేదములో స్పష్టముగ జెప్పబడియున్నది. ఈక్రిందిఋక్కులో నట్టి ప్రశంస యొకటి గలదు.

చరిత్రం హి వేరి వాచ్ఛేది పర్ణమాజా ఖేలస్య పరితక్మా యాం

సద్యోజం ఘామాయసీం విశ్పలాయై ధనేహి తే సర్తవె ప్రత్యధత్తం॥ (ఋ. సం. 1–116–15)

అర్థము :—ఖేలుడను రాజుయొక్క భార్యయగు విశ్పల యొక్క పాదము పక్షిఱెక్కవలె యుద్ధములో ఛేదింప బడినది. ఓ అశ్వినీదేవతలారా మీరు రాత్రియందు వెంటనే యామె శత్రునిహితమగు ధనమును జయించుటకై వెళ్లుట కొరకు ఇనుముతో జేయబడిన పాదము నతికిరి.

కొందఱు స్త్రీలు యుద్ధములో సారథ్యమును గూడ వహించినట్లు కొన్ని ఋక్కులలో జెప్పబడియున్నది. అట్టి వారు కేవలము సారథ్యమును జేయుటయేగాక శత్రువులపై బాణవర్షమును గురిపించునంతటి యోధురాండ్రుగ కూడ నుండిరి.

పరివృక్తే వపతివిద్యమానట్ పీప్యానాకూచక్రేణేవసించన్॥ (ఋ. సం. 10–102–11)

అర్థము :—ఈ ముద్గలానిపతిచేత విడిచిపెట్టబడిన స్త్రీ వలె పతివియోగమును పొందెను. ఆమె సారథ్యముచేత వృద్ధి పొందెను. మేఘము భూమిని వర్షించునట్లు ఆమె శత్రువులపై బాణవర్షమును కురిపించుచున్నదై వృద్ధినొందెను.

ఏదోరీతిగ యుద్ధము చేయుటకే గాక కడు నైపుణ్యముతో శత్రువులను సంగరమున హింసించుటకు కూడ సమర్థలగు స్త్రీలా కాలములో నుండెడివారని గూడ నిందువలన తెలియుచున్నది.

పైన జెప్పబడిన ముద్గలాని తుదకు యుద్ధములో జయమును పొందిన ట్లీక్రిందిఋక్కులో జెప్పబడినది.

ఉత్స్మవాతో వహాతివాసో అస్యా అధిరథం యదజయత్సహస్రమ్। రథీర భూన్ముద్గలాని గవిష్ఠా భరె కృతం వ్యచే దింద్రసేనా॥ (ఋ. సం. 10–102–6)

అర్థము :—ముద్గలుని భార్య యగు ఇంద్రసేన రథమునకు సారథి. ఆమెయొక్కవస్త్రమును వాయు వెగురగొట్టుచున్నది. ఎప్పు డామె గొప్పదగు రథము నెక్కి సహస్రసంఖ్యాకములగు గోవులను జయించెనో యపుడామెయొక్క వస్త్ర మెగెరెను. హరింపబడిన గోవులను తీసికొని వెళ్ళుటయందామె సారథి యాయెను. ఆమె గోవులను శత్రువుల నుండి లాగుకొనెను.

నైపుణ్యముతో యుద్ధము జేసిన స్త్రీలు వేదములో నిద్దఱుముగ్గుఱకంటె కాన్పింపరు. స్త్రీలు యుద్ధము జేయుటకు అర్హులు కారనియే యానాటి సామాన్యాభిప్రాయము. ఆయభిప్రాయ మీ క్రిందిఋక్కులో స్పష్టమగుచున్నది.

అ(తేదు మేమంసనేసత్యము క్తం ద్విపాచ్ఛయ చ్ఛతుష్పాత్సంసృజాని। స్త్రీభిర్యో అత్ర వృషణం పృతన్యాద యుద్ధో అస్యవిభజాని వేదః॥ (ఋ. సం. 9–27–10)

అర్థము :—ఈ నాస్తోత్రమందు జెప్పబడినది సత్యమే యని తెలిసికొనుము. నేను మనుష్యులను జంతువులను సృజించితిని. కోరినదాని నెల్ల నిచ్చెడు నన్ను విడచి ఈజగత్తులో నెవడు స్త్రీలతో లేక స్త్రీతుల్యులతో యుద్ధము చేయుటకు ఇచ్ఛయించునో యట్టివాని సాధనమును నేను యుద్ధము చేయకుండగనే తీసికొని నన్ను పూజించువారి కిచ్చుచున్నాను.

స్త్రీలతో యుద్ధము చేయుట యిచట గర్హింపబడినది. వారి యబలాత్వమే యిందులకు కారణ మనుటస్పష్టము.

స్త్రీ లబలలను నభిప్రాయము వేదకాలములో గూడ వ్యాపించియుండెను. ఈ విషయమై యీ క్రిందిఋక్కు పరికింపదగును.

స్త్రియోహిదాస ఆయుధాని చక్రే కిం మాకరం నబలా అస్య సేనాః। అంత ర్హ్యఖ్యదుభే అస్యధేనే అధోప ప్రైద్యుధయేదస్యుమిదః॥ (ఋ. సం. 5—30—9)

అర్థము :—నముచియను దాసుడు స్త్రీలను యుద్ధసాధనములుగ జేసెను. (ఇంద్రునితో యుద్ధము చేయుటకు పంపెను.) అబలలైన స్త్రీసేనలు న న్నేమి చేయగల రని యింద్రుడు భావించెను. ఆతడు వారిలో సుందరులగు నిద్దరు స్త్రీలను తీసికొని తనయింట నుంచుకొనెను. అనంతర మాతడు నముచిపైకి యుద్ధమున కేగెను.

స్త్రీ లబలలని యిందు స్పష్టముగ నున్నది. స్త్రీ లబ

లలు కావుననే వారితోను వారితో తుల్యులగు వారితోను యుద్ధము చేయుట గర్హింపబడినది. సర్వధర్మకోవిదు డగు భీష్మపితామహుడు స్త్రీలతోను స్త్రీతుల్యులతోను స్త్రీపూర్వులతోను యుద్ధము చేయనని శపథము పూనుట కీవేదవాక్యమూలమని చెప్పనచ్చును.

నాడు స్త్రీ లరుదుగనే యుద్ధము చేయుచుండిరని చెప్పుట కిదికూడ నొక హేతువే యగుచున్నది. స్త్రీలతో యుద్ధము చేయరాదను నిషేధమే పైన నున్నది. స్త్రీలు యుద్ధములోనికి రాకూడదను నిషేధ మందిమిడియేయున్నది. కాని యన్ని నియమములకును నపవాదము లుండునట్లే దీనికి కూడ నపవాద మున్నది. లేకున్నచో నిందఱు స్త్రీలు యుద్ధము చేసినట్లు వేదములలో నుండియుండదు. స్త్రీలు యుద్ధము చేయుట మున్నగువిధములచే బాహ్యప్రపంచములో పురుషులతో సంబంధము పెట్టుకొనుట వారి నీతికి చాల భంగకరము కావచ్చుననునంశము పైన నీయబడినఋక్కులో నున్నది. యుద్ధము చేయుటకు వచ్చినస్త్రీల నింద్రుడు భోగమునకై హరించినాడు. బాహ్యప్రపంచముతో సంబంధము పెట్టుకొను స్త్రీలకు పాతివ్రత్యభంగము గలుగవచ్చు ననియు నట్టి ఘోరపాపము సంభవింపకుండవలెనన్న స్త్రీలు గృహమునందే యుండవలె ననియు పైఋక్కువలన తెలియుచున్నది. స్త్రీలు యుద్ధము చేయుట యరుదగుట కిదికూడ ప్రబలమగు హేతువే యని చెప్పవలెను.

అయితే భర్త నిస్సహాయుడై యుద్ధములో పరాజయము నొందుటగాని మృతుడగుట గాని సంభవింప నప్పుడు భార్య పాతివ్రత్యమును గన్పఱచుటకై యుద్ధరంగమున కురికి యాతనికి సహాయము చేయవలసి యున్నది. అట్టిచో ఆమె చేయు యుద్ధము పాతివ్రత్యమునకు భంజకరమగునేమో యని భయపడుటకంటె నది పాతివ్రత్యసూచక మని యానందించుటయే న్యాయము. కావుననే వేదములలో యుద్ధము చేసినట్లు చెప్పబడిన స్త్రీలు సాధారణముగ భర్తతో గూడియే యుద్ధము చేసినట్లు గన్పట్టుచున్నది.

ఈవిధముగ జూడ వేదకాలపుస్త్రీలు గృహమే ప్రధానస్థానముగ గలవారే యైనను వారికి బాహ్యప్రపంచముతో గొన్ని విషయములలో సంబంధ ముండె ననియు నన్నికర్మల కంటె నెక్కుడు పురుషోచిత మని చెప్పదగిన యుద్ధకర్మలో గూడ స్త్రీలు పాల్గొనుట యానాడు కొలదిగ నుండె నని తెలియుచుండుటచే నితరములగు బాహ్యప్రపంచమునకు సంబంధించిన కర్మలతో గూడ వారి కంతో యింతో సంబంధ ముండెడిదనియు తేలుచున్నది. ఇంతియేకాక "స్త్రీలు—విద్యలు, వృత్తులు" అను ప్రకరణమున చెప్పబడబోవు కొన్నివృత్తులుగూడ స్త్రీలకు బాహ్యప్రపంచముతోడి సంబంధమును తెలుపును.



# అష్టమాధ్యాయము

---

## స్త్రీలు—విద్యలు ; వృత్తులు.

వేదకాలములో పండితురాండ్రగు స్త్రీ లుండిరనుటలో నేమియు సందియములేదు. ఏమన: బృహదారణ్యకోపనిషత్తులో పండితురాలగు కుమార్తె కలుగవలె నని కోరు వారు చేయవలసిన విధియొకటి చెప్పబడినది.

అథయ ఇచ్ఛేద్దుహితామే పండితాజాయేత సర్వ మాయు రియాదితి తిలౌదనంపాచయిత్వాసర్పిష్మంత మశ్నీయా తా మీశ్వరౌ జనయితవై ॥

అర్థము :—ఆయుష్మతియు విదుషియు నగు కుమార్తెను కోరు దంపతులు నువ్వులయన్నమువండి నేతితో కలిపి తినవలెను.

పండితురాండ్రా కాలములో నుండిరని యీవిధముగ తెలియుచుండగ నిక స్త్రీ లేయేవిద్యలలో కృషి సల్పెడివారో చూతము.

నాటికిని నేటికిని గూడ హిందువుల యభిప్రాయములో విద్యలలో నెల్ల ప్రధానమైనది వేదమే. కావున నాటిస్త్రీలు వేదములవిషయమున నెట్టి కృషి చేసెడివారో ముందుగ చూతము.

వేదములోని కొన్నిమంత్రములకు స్త్రీలే ఋషులని

యనుక్రమణికలలో నున్నది. ఈ మంత్రములను నాస్త్రీ ఋషు లే వ్రాసినారని గొందఱు పండితులును నా మంత్రములయర్థ మును మాత్రమే యా స్త్రీలు కనుగొనిరని మఱికొందఱును చెప్పుచున్నారు. ఎట్లయిననుకూడ స్త్రీలకు వేదపఠనముండెనని యే తేలుచున్నది. ఎట్టి స్త్రీలకుండెనో యెంతవఱకుండెనో చెప్పుట కాధారములు గాన్పింపవు. ఋగ్వేదములోని యేయే సూక్తములకే యే స్త్రీలు ఋషులుగ నున్నారో యీ క్రింది పట్టిక తెల్పును.

| ఋషి.సంఖ్య | ఋషి.పేరు | మం—సూ |
|---|---|---|
| 1. | రోమశ (భర్తతో కలసి) | 1—126 |
| 2. | లోపాముద్ర (ఇంక కొందఱి పురుషులతో కూడ కలసి) | 1—180;191 |
| 3. | అతిది కొందఱు పురుషులతో కలసి) | 2—18 |
| 4. | విశ్వవార | 5—28 |
| 5. | స్వస్తి | 5—50 ; 51 |
| 6. | శశ్వతి (కొందఱుపురుషులతో కలసి) | 6—1 |
| 7. | అపాల | 8—91 |
| 8. | శిఖండిని | 9—104 |
| 9. | కశ్యపపుత్రికలు | 9—104 |
| 10. | శిఖండిని—అప్సరసలు | 9—105 |

| | | |
|---|---|---|
| 11. | యమి | 10–10 |
| 12. | ఘోష | 10–39; 40 |
| 13. | సూర్య | 10–85 |
| 14. | ఇంద్రాణి (కొందఱు పురుషులతోకలసి) | 10–86; 145 |
| 15. | ఊర్వశి | 10–95 |
| 16. | దక్షిణ | 10–107 |
| 17. | దేవశుని | 10–108 |
| 18. | జుహు | 10–109 |
| 19. | గోధ | 10–134 |
| 20. | ఇంద్రమాతలు | 10–153 |
| 21. | యమి (సోముడుకూడ) | 10–154 |
| 22. | శచి | 10–159 |
| 23. | సార్పరాజ్ఞి | 10–189 |

ఆయాసూక్తములకు స్త్రీ ఋషులు కర్తలను నంశము అనుక్రమణికలనుబట్టి మాత్రమేకాక యాయాసూక్తములను బట్టికూడ చాలభాగము తెలియగలదు. ఎట్లన: స్త్రీ కర్తృక మైన సూక్తములలో స్త్రీలు మాత్రమే చెప్పవలసిన మాటలు గాన్పించును. ఒకయుదాహరణమును దీసికొందము.

ఉతాహమస్మిసంజయాపత్యౌమే శ్లోకఉత్తమః॥

(ఋ. సం. 10–159–3)

అర్థము :—నేను సవతులను జయించు దాననగు న్నాను. కావున భర్తయందు నాయశస్సు, ఉత్తమమైనది.

ఈ విధముగ చెప్పుచున్న ఋషి స్త్రీ యని స్పష్టము తెలియగలదు. ఋగ్వేదములోనున్న 1028 సూక్తములలో 23 సూక్తములు మాత్రమే స్త్రీలు ఋషులుగ గలవను విష యము ముఖ్యమైనది. అంతియేకాదు. యజుర్వేదములోను అధర్వవేదములోను బ్రాహ్మణములలోను గన్పట్టు మాటలను మనము పరిశీలింతుమేని యవి యించుమించుగ నన్నియు పురుషుడు పఠించునపుడు సార్థములగునే కాని స్త్రీ పఠించునప్పు డు సార్థకములుగావు. స్త్రీ పఠించుటకు వీలగునవి కొలదిగనే యున్నవి. అవి యెట్లుండుననః!

ఇంద్రాణీవా విధవాభూయాసం ।

అర్థము :—నేను ఇంద్రాణివలె నెల్లపుడును సుమంగ ళినై యుందును గాక!

సంపత్నీపత్యాహంగచ్ఛే ॥

నేను పత్నినై భర్తతో కలసికొందును.

ఇట్టిమంత్రములనే పత్ని యజ్ఞములో పఠించును.

కొన్నిసూక్తములకు స్త్రీలు ఋషులుగ నుండుటం బట్టియు స్త్రీలు పఠించుటకు వీలగు మంత్రములు కొన్ని యితరస్థలములలో నుండుటనుబట్టియు వేదము స్త్రీలందఱికిని నన్నిసమయములందును నిషిద్ధమని చెప్పుటకు వీలుకాదని తేలుచున్నది.

వేదాంతబోధకములగు నుపనిషత్తులు వేదములలో నంతర్భాగములే యైనను స్త్రీలకును వేదాంతవిద్యకును నుండిన సంబంధమును వేఱుగ పరిశీలించు టవసరమగుచున్నది. ఏమన: ఇతరవేదభాగములలోని విషయమునకును నుపనిషత్తులలోని విషయమునకును విశేషమగు భేదమున్నది. అంతియేకాదు: అవి బోధించువిషయమును వదలి యనంతరపు విషయమునే యుపనిషత్తులు చెప్పుచున్నవి.

వేదాంతగోష్ఠిలో దిగిన బ్రహ్మవాదినులిద్దరేగాన్పించు చున్నారు. వారెవరన: గార్గియు మైత్రేయియు. ముందు గార్గిని తీసికొందము.

ఒకనా డామెకును యాజ్ఞవల్క్యునకును తత్త్వవిద్యకు సంబంధించిన యీ క్రింది సంభాషణము జరిగినది. ఈ క్రింది విషయము శతపథబ్రాహ్మణములోని గార్గి బ్రాహ్మణములో నున్నది.

గార్గి:—ఓ యాజ్ఞ వల్క్యా, సమస్తమును నుదకము లయందు మిశ్రితమైనదిగదా! యా యుదకము లెందు ప్రోత ములయ్యెను?

యాజ్ఞవల్క్యుడు:—ఓ గార్గి, వాయువునందు.

గార్గి:—వాయువెందున్నది?

యాజ్ఞవల్క్యుడు:—అంతరిక్షమందు.

గార్గి:—అంతరిక్షమెందో తత్ప్రోతమై యున్నది?

యాజ్ఞవల్క్యుడు:—ఓ గార్గి, గంధర్వలోక మందున్నది.

గార్గి :—గంధర్వలోకమో ?

యాజ్ఞవల్క్యుడు :—ఆదిత్యలోకమునందు.

గార్గి :—అది యెందో తత్ప్రోతమై యున్నది ?

యాజ్ఞవల్క్యుడు :—చంద్రలోకము నందు.

గార్గి :—ఆ చంద్రలోకమో ?

యాజ్ఞ :—అది నక్షత్రలోకమునం దున్నది.

గార్గి :—ఆ నక్షత్రలోకములో ?

యాజ్ఞ :—దేవలోకమునందు.

గార్గి :—ఆ దేవలోకమో ?

యాజ్ఞ —ఇంద్రలోకములలో.

గార్గి :—అవి ఎందు ?

యాజ్ఞ :—ఓ గార్గి, అవి ప్రజాప్రతిలోకములందున్నవి

గార్గి :—అవియో ?

యాజ్ఞ ! అవి బ్రహ్మలోకములం దున్నవి.

గార్గి !—ఆ బ్రహ్మలోకము లెందు ప్రోతములై నవి.

యాజ్ఞ :—ఓ గార్గి, హద్దుమీఱి యడుగవలదు. అ డుగుదు వేని నీ తలపగులును.

అంత గార్గినోరెత్త కూరకుండెను.

ఇక మైత్రేయినిగుఱించి బృహదారణ్యకోపనిషత్తులో (4—5) నున్న విషయమును సంగ్రహముగ చూతము. యిాక్రిందివిధముగ నున్నది :—

యాజ్ఞవల్క్యునకు మైత్రేయి యనియు కాత్యా

యనియనియు నిద్దరుభార్య లుండిరి. వారిలో మైత్రేయి బ్రహ్మవాదని. కాత్యాయని స్త్రీల కుచితమగు (అనగా : గృహమునకు సంబంధించిన) కృత్యములయందే ప్రజ్ఞకలది. యాజ్ఞవల్క్యుడు గృహస్థాశ్రమమును వీడి బోనున్న సమయమున మైత్రేయితో నిట్లనెను :—

“ఓమైత్రేయీ, నే నిపుడు గృహస్థాశ్రమమును వీడి పోవుచున్నాను. నీకు కాత్యాయనితోబాటు నాధనములో భాగ మిచ్చెదను.”

అందులకు మైత్రేయి యిట్లనెను :—

“అది యిది యననేల ? సమస్తపృథివిని నా కిచ్చినను నా కమృతత్వము గలుగునా ?”

యాజ్ఞ:—కలుగదు. ధనమువలన నందఱకును గలుగు నానందమే నీకును గలుగును.

మైత్రేయి:—అట్టిధనము నాకువలదు. నాకు దానితో నేమి ప్రయోజనము ? తా మెఱిగిన బ్రహ్మవిద్యను నాకు దెల్పుడు.

యాజ్ఞవల్క్యుడు :—ఓ మైత్రేయీ, నీవు నా కెప్పుడును ప్రియురాలుగనే యున్నావు. రమ్ము. నీవడిగిన బ్రహ్మవిద్యను చెప్పుచున్నాను. శ్రద్ధగ వినుము. పతికొఱకు పతి ప్రియుడుగ నుండుటలేదు. ఆత్మకొఱకే పతిప్రియుడు ధనముకొఱకు ధనము ప్రియముకాదు. ఆత్మకొఱకే ధనము ప్రియము. ఇట్లే యన్నియును నాత్మకొఱకే ప్రియము లగు

చున్నవి. కావున ఆత్మయే చూడదగినది. వినదగినది. మన
నము చేయదగినది. ధ్యానింపవలసినది. ఆత్మ తెలియబడ్డ
సమస్తమును తెలియబడినదే యగుచున్నది. అద్వితీయుడగు
నాత్మయే యంతకును కారణము.

మైత్రేయి :—ఈ కన్పట్టు కార్యసమూహ మంతయు
నశించునపుడు అంతయు బ్రహ్మ మెట్లగును ?

యాజ్ఞ :—ఓ మైత్రేయీ, ఈ యాత్మము భూత
ములనుండి జన్మించి మఱల వాని ననుసరించియే మరణించు
చున్నది. జ్ఞానము గలుగకపూర్వము విశేషజ్ఞానము గలి
మరణమునకు బిమ్మట భేదసూచనలేక బ్రహ్మమైనది.

మైత్రేయి :—మీరు చెప్పినమాటలు నాకు పరస్పర
విరుద్ధములుగ గన్పట్టుచున్నవి.

యాజ్ఞ :—అట్లేమియు కాదు. అజ్ఞానముచేత ఆత్మకు
జీవభావము కలిగినది. ఆత్మ యాకారము లేనిదగుటచే
గ్రహించుటకు వీలులేనిది. నశింపనిది. ఆత్మయే యాత్మను
దెలిసికొనును. ఇదియే యమృతత్వము.

ఇట్లు చెప్పి యాజ్ఞవల్క్యుడు ప్రవ్రజితుడాయెను.

బృహదారణ్యకోపనిషత్తులో నున్నది సంగ్రహముగ
పైన చెప్పబడినది.

మైత్రేయి బ్రహ్మవాదిని యని యిందు చెప్పబడినది.
బ్రహ్మవిద్య సాధారణముగా స్త్రీలకు సంబంధించిన విద్య
కాదని చెప్పు పదముకూడ నీసందర్భములో వాడబడినది.

అది యేదన: 'స్త్రీప్రజ్ఞా' యనుపదమే. మైత్రేయి బ్రహ్మ వాదినియనియు కాత్యాయిని స్త్రీప్రజ్ఞ యనియు అనగా స్త్రీల కుచితమగు ప్రజ్ఞకలది యనియు చెప్పబడినది. స్త్రీల కుచితమగు ప్రజ్ఞ బ్రహ్మవిద్యకంటె భిన్నమని యిందువలన స్పష్టముగ తెలియుచున్నది.

బ్రహ్మవిద్య స్త్రీల కుచితముగానిచో మైత్రేయి యె ట్లావిద్యను పొందెనను ప్రశ్న రావచ్చును. ఏవో కొన్ని ప్రత్యేకయోగ్యతలు గల స్త్రీలకుమాత్రమే బ్రహ్మవిద్య యుచితమని యిందువలన తెలియుచున్నది. ఈసంగతి 'స్త్రీ ప్రజ్ఞా' యనుపదమువలన మాత్రమే కాక తత్త్వవిచారము చేయు స్త్రీ లిద్దఱుముగ్గుఱుమాత్రమే యుండుటనుబట్టికూడ తెలియుచున్నది.

వేదసామాన్యమువలెనే వేదములో తత్త్వబోధ మగు నుపనిషత్తుకూడ స్త్రీలకు సర్వకాలసర్వావస్థలయందును నిషిద్ధముగాదనియు నీవిద్యలు వారిలో పురుషులలో నున్నంత వాడుకలో లేకుండుటమాత్రము తథ్యమనియు నీవిధముగ తెలియుచున్నది.

స్త్రీలకు పురుషులకంటె చిన్నవయస్సుననే వివాహ మగుటచేతను, విద్యయనునది వివాహమునకు పూర్వము సాధింపవలసినదే కాని వివాహానంతరము సాధించుట వీలుకాని దగుటచేతను వివాహము సాధారణముగ ప్రతివ్యక్తికిని నవ

సరమగుటచేతను స్త్రీకి విద్యాభ్యాసమునకు కాలము చాలక
పోవుటచేతను నొకవేళ వివాహమునకు పూర్వము స్వల్పముగ
విద్యనభ్యసించినను గృహకృత్యముల ప్రాబల్యమున స్త్రీ యా
విద్యను మఱచిపోవుట జరుగుచుండుట చేతను మఱియు వేద
ములో పురుషునకు వర్తించునట్టియు నుపయోగించునట్టియు
భాగములకంటె స్త్రీకి సంబంధించినవి చాలతక్కువగ నుండు
టచేతను, పాతివ్రత్యధర్మప్రాబల్యమున స్త్రీలకు విద్యయనవస
రమను నభిప్రాయము ప్రబలుటచేతను వేదకాలములో స్త్రీ
విద్య తక్కువగనుండెనని చెప్పవచ్చును. మఱియు యజ్ఞయా
గాదులలో స్త్రీ పురుషునితో బాటు పాల్గొనుట యవసరము
గావునను నట్టి సమయమున నామె మంత్రములను పఠింపవలసి
యుండుటచేతను వేదపఠనము కొలదిగ నానాడుండి తీరవలసి
యుండెననియు గూడ చెప్పవచ్చును. ఇక బ్రహ్మజ్ఞానము స్త్రీ
లకు సాధారణముగ నుచితముగాదని తెలియుచున్నను మైత్రే
యిమున్నగు కొలదిమంది బ్రహ్మవాదిను లెల్లెరను ప్రశ్న
రాగా: యాజ్ఞవల్క్యునివంటి బ్రహ్మజ్ఞాననిష్ఠుల కరుణాకటా
క్షవీక్షణములకు పాత్రయగు నామెకట్టి జ్ఞానము దానంత
నదియే కలుగునని చెప్పవలెను.

ఇక నితరవిద్యలలో స్త్రీలకెట్టి ప్రవేశముండెడిదో
చూతము.

ఇతరవిద్యలను రెండువిధములుగ విభజింతము: 1. కళ
లు 2. శిల్పములు.

1 వేదకాలపు స్త్రీలభ్యసించుచుండిన కళలలో గానము నృత్యము, చిత్రలేఖనము మున్నగునవి యుండెను.

ఋగ్వేదసంహిత 1–19–4 లో 'నృతూః' అను పదము వాడబడినది. దీనికి నాట్యముచేయు స్త్రీ యని యర్థము. నృత్యమునకు సోదరియనదగు కళగానము. కావున వేదకాలపు స్త్రీలు గానముకూడ నభ్యసించుచుండెడివారని చెప్పవచ్చును. గానము స్త్రీలకు చాలప్రీతిదాయకమని చెప్పబడియున్నది.

గాయంతగ్ స్త్రియః కామయంతే॥ (తై. సం. 6–1–6–6)

అర్థము:—పాటగానిని స్త్రీలు కోరుదురు.

శతపథబ్రాహ్మణములో కూడ నీ యంశము చెప్పబడినది. అచ్చట నృత్యముకూడ స్త్రీలకు ప్రీతిదాయకమని యున్నది.

యోనృత్యతియోగాయతి తస్మైవయోషా నిమిశ్లతమా।

(కాణ్వశ. బ్రా. 4–2–4–4)

అర్థము:—నృత్యము గానము చేయువానిని స్త్రీ ప్రేమించును.

స్త్రీలు నృత్యము చేయుటయు గానముచేయుటయు నాకాలములో సాధారణముగ నుండలేదనియు నరుదుగ మాత్రమే యుండెననియు చెప్పవలెను. ఏమన: వీనిప్రసక్తి తఱచుగ గాన్పింపదు.

చిత్తలేఖనమును స్త్రీలు కొలదిగనైనను నభ్యసించుచుండిరి.

 

యాప్రలిఖతేత స్త్యైఖలతిరవమారీ॥ (తై. సం. 2–5–1–7)

అర్థము :—ఎవతె యేకవస్త్రయై యుండి చిత్రలేఖనము చేయునో యామెకు బట్టతలగలవాడును దుర్మరణశీలుడును జన్మింతురు.

'ప్రలిఖతి' యనుదానికి భాష్యము వ్రాయుచు సాయణాచార్యులు "భిత్త్యౌచిత్రాదికంకరోతి" యనగా "గోడమీద బొమ్మలు మున్నగువానిని వేయునో" యని చెప్పియున్నారు.

వేదకాలపు స్త్రీలనేకశిల్పముల నభ్యసించుచుండిరి. అందు కొన్నిటివలన వారికి నాదాయముకూడ వచ్చుచుండెను.

వస్త్రములకు రంగులువేయు స్త్రీలు కొందఱుండిరి.

తైత్తిరీయ బ్రాహ్మణములో నిట్లున్నది.

ప్రకామాయరజయింత్రీం॥ (తై. బ్రా. 3–4–7)

అర్థము :—కామాభిమానిదేవత కొఱకు వస్త్రములకు రంగువేయు స్త్రీని నాలభింపవలెను. మఱియు, నీ సందర్భమువనే బట్టలను శుభ్రపఱచు స్త్రీకి 'వాసఃపల్పూలీ' యను మాట వాడబడినది.

తోళ్ళు మున్నగువానితో కత్తివరలను చేయుటకూడ స్త్రీలు చేయువృత్తులలో నొకటిగ నుండెను.

నిర్‌ఋత్యైకోశకారీం॥ (తై. బ్రా. 3–4–10)

అర్థము :—పాపదేవతకు కత్తివరలు చేయుదానిని బలియీయవలెను.

ఇదే సందర్భములో 'పేశస్కారీం' (3–4–9) అను

మాటకూడ వాడబడినది. 'పేశస్కారి' యనగా బంగారము మున్నగు లోహముల పనిచేయు స్త్రీ కావున నానాడు స్త్రీలు లోహపుపనులు చేయుటకూడ నుండెనని తెలియుచున్నది.

స్త్రీలు మందులు మాకులు వాడుటకూడ నా కాలములో నుండెను.

సంజ్ఞానాయస్మరకారీం॥ (తై. బ్రా. 3-4-6)

అర్థము :—బోధాభిమాని దేవతకొఱకు మందుమాకులచేత భర్తకు గామము గల్గించుస్త్రీని బలియీయవలెను.

చాపలల్లుటయను శిల్పముకూడ కొందఱు స్త్రీలభ్య సించుచుండినట్లు తెలియుచున్నది.

యథానడంస్త్రీయోభిన్దన్త్యశ్మనా॥ (అ. సం. 6-138-5)

అర్థము :—స్త్రీలు చాపలల్లునపుడెట్లు నడమను పేరుగల తృణమును బ్రద్దలు కొట్టుదురో.

అని యొక యుపమానము వాడబడినది.

స్త్రీలు ఉన్నెతో పనులు చేయుటకూడ నుండెను.

తద్వ్యాపతత్ స్త్రీణాం కర్మయదూర్ణసూత్రమ్।
(కా. శ. ప. 14-4-2-8)

అర్థము :—ఊలుపని స్త్రీలు చేయదగినది.

ఈ పైయంశముల నన్నిటినిబట్టి చూడ వేదకాలపు స్త్రీల బుద్ధులును చాకచక్యమును ననేకవిధములుగ ప్రవహించినట్లు తెలియగలదు. ఈ విద్యలకు తోడుగ వారనుదినమును నా చరణములో పెట్టుచుండిన గృహనిర్వహణవిద్య యొకటను నంశము మఱువదగినది కాదు.



# న వ మా ధ్యా య ము

## స్త్రీలు – క ర్మ కాం డ.

స్త్రీలకు పారలౌకికములగు కర్మలతో నెంతవఱకు సంబంధముండెడిదను విషయము నీ యధ్యాయమున విచారింతము. ఈ కర్మలను నాలుగువిధములుగ భాగింపవచ్చును. 1. యజ్ఞయాగాదులు. ఇవి స్వర్గఫలము నపేక్షించి చేయబడు కర్మలు, ఐహికసౌఖ్యముకూడ వీనివలన గలుగవచ్చును. 2. పితృకర్మలు, 3 శత్రువులను చంపుట, రోగములను పోగొట్టుట, సంతానము బడయుటమున్నగు భౌతిక లాభములను పొందుటకై దేవతలనారాధించుట 4 ఇతరకర్మలు.

ఇందొక్కొక్క విషయమునే తీసికొందము.

1. యజ్ఞయాగాదులు భర్తా భర్తలిరువురును కలసి చేయవలసినవే కాని ప్రత్యేకము పురుషుడుకాని ప్రత్యేకము స్త్రీగాని చేయునవికావు. ఎచ్చటనైననుగూడ దంపతులు యజ్ఞము చేసినట్లే గాన్పించుచున్నది.

విత్వాతత్రేమిథునాః॥ (ఋ. సం. 1–131–3)

అర్థము :—ఓ యింద్రుడా, నిన్నుద్దేశించి దంపతులు యజ్ఞము చేయుచున్నారు.

పత్నియజ్ఞములో పాల్గొనుచున్నట్లే క్రిందిమాటలు కూడ చెప్పుచున్నవి.

యత్రనార్యపచ్యవముపచ్యవంచ శిక్షతే॥

(ఋ. సం. 1–28–3)

అర్థము :—ఏ యజ్ఞకర్మయందుపత్ని శాలనుండి బయటకు వచ్చుటను శాలలోనికి వెళ్ళుటను నభ్యసించుచున్నదో.

బృహద్వయోబృహ తే తుభ్యమగ్నే ధియాజురోమిథునాస స్సచంత ॥ (ఋ. సం. 4–43–15)

అర్థము :—కర్మరతులగు దంపతులు చాలయన్నమును గొప్పవాడవగు నీ కొఱకిచ్చుచున్నారు.

అని యిగ్నినుద్దేశించిచెప్పబడినది.

స్త్రీకి భర్తతోబాటు కర్మచేయుటకే కాక కర్మఫలము ననుభవించుటకు కూడ నర్హతయున్నదని యీ క్రింది వాక్యములవలన తెలియుచున్నది.

యాదంపతీసమనసాసునుత ఆచధావతః।

దేవాసోనిత్యయాశిరా ॥

ప్రతిప్రాశవ్యాఇతస్సమ్యఞ్చబర్హిరాశతే।

నతావాజేషువాయతః॥ (ఋ. సం. 8–31–5 ; 6)

అర్థము :—ఓ దేవతలారా, సమానమైన మనస్సులు గల యే దంపతులు సోమాభిషము చేయుచున్నారో, యేదంపతులా సోమమును శోధించుచున్నారో, యే దంపతులు నిత్య సంబంధముగల గోక్షీరముతో గూడిన సోమము నిచ్చుచున్నారో యా దంపతులు భక్షణయోగ్యములైన యన్నాదులను దేవతలకిచ్చుచున్నారు.

కలవారై యజ్ఞసంబంధమైన ఫలమును పొందుచున్నారు. యాగముచేయుచున్న యా దంపతులెల్లపుడు నన్నముగలవారగుటచే దేవతలచే నీయబడిన యన్నముకొఱకు వెళ్లుటలేదు.

ఇంకను ననేకములగు స్థలములలో నిట్టియభిప్రాయములను దెలుపువాక్యములు గలవు.

ధాతుశ్చయోనౌ సుకృతస్యలోకే స్యోనంమేసహాపత్యాకరోమి॥

మున్నగు వాక్యములలో (దీనియర్థము దాంపత్యమను ప్రకరణమున నీయబడినది) పత్ని యజ్ఞకర్మఫలమును భర్తతోపాటు పరలోకములో ననుభవించుటను గోరుచున్నది.

దంపతులిరువురును యజ్ఞభారమును వహింపవలసినదని స్పష్టముగ నీ క్రిందిమంత్రములో నున్నది. మఱియు వారిరువును కలసియే యజ్ఞఫలము ననుభవింతురని కూడ నిందున్నది.

యజ్ఞస్యయుక్తౌధార్యావభూతాం।
సంజానానౌవిజహతామరాతీః।
దివిజ్యోతిర జరమారభేతా॥

అర్థము :—పతిపత్నులు పరస్పరసంబంధముగలవారై యజ్ఞభారమును వహించువారగుదురుగాక! వారైకమత్యముగలవారై శత్రువులను నశింపచేతురుగాక! ద్యులోకమందున్న జరారహితమైన యాదిత్యాత్మకమగు జ్యోతినిపొందుదురుగాక!

పత్నియజ్ఞములో నుండుటయే కాదు. ఆమె యచట కొన్నిమంత్రములను పఠింపవలసియున్నది.

ఉభౌయాజ్యాగ్ సవీర్యత్వాయ। (తై. బ్రా. 1–6–36)

అర్థము :—పతిపత్నులిరువురును యాజ్యలను చెప్పవలెను. అందువలన యజమానుడు సవీర్యుడగును.

యజ్ఞఫలమును పతిపత్నులుకలసి యనుభవించుటయే కాక కొన్ని ప్రత్యేకఫలములను పతియు కొన్నిప్రత్యేకఫలములను పత్నియు ననుభవించుచుండుట కూడకలదు. ఇట్లు పత్నియొక్క వ్యభిచారదోషము పోవుటకొక కల్పమున్నది.

పత్నీంవాచయతి। మేధ్యామేవైనాం కరోతి। అథోతపఏవైనా ముపనయతి। యజ్జారగ్ సన్తం నప్రబ్రూయాత్। ప్రియంజ్ఞాతిగ్ రున్ధ్యాత్। అసౌమేజార ఇతినిర్దిశేత్॥

(తై. బ్రా. 1–6–30)

అర్థము :—ప్రతిప్రస్థాతపత్నిని నీజారుడెవడని ప్రశ్నించును. అందులకు సమాధానము రాబట్టును. వాడు నాజారుడని యామెను నిర్దేశించి చెప్పును. ఈవిధముగ పత్ని తనతప్పు నంగీకరించుటవలన వచ్చు పరాభవమును పొందును. అది యొక గొప్పతపస్సు, (ఆతపస్సువలన దోషముపోవునని యర్థము)

పత్నికి యజ్ఞముతో విశేషసంబంధమున్న దని యీ విధముగ తేలుచుండగ పతిపత్నులలో నెవరు యజ్ఞమునకు ప్రధానకర్తలను విషయమును విచారింతము. పతికి 'యజమానః' అనియు నామెకు పత్నియనియు పేళ్ళుండుటనుబట్టి యీ సంగతి తెలియగలదు. యజమానుడనగా యజ్ఞముచేయువా

డని యర్థము. కావున ప్రధానకర్త యాతడే యని చెప్పవలెను. పత్నికట్టి యర్థమిచ్చు పేరులేదు. పత్నియనగా భర్త చేయు యజ్ఞఫలము ననుభవించు నామె యని యర్థము. 'పత్యుర్నో యజ్ఞసంయోగే' యను పాణిని సూత్రమును బట్టియు లింగాభట్టీయములో నీ పదమున కీయబడిన యర్థమును బట్టియు గూడ నీసంగతి తెలియుచున్నది. అంతియేకాదు. పత్నికి ముఖ్యకర్తృత్వము లేదనియు పతిననుసరించియే యామెకు కర్తృత్వమనియు వేదములోనే యితరములగు కొన్ని యాధారములను బట్టి కూడ తెలియుచున్నది.

ముందుగ యజమానుడు యజ్ఞమునందు దీక్షితుడగును. ఆతని ననుసరించియే పత్ని వ్రతమును స్వీకరించును.

అథోపత్నియా ఏవైషయజ్ఞస్యాన్వారభూనవఛిత్త్యై ॥

(తై. బ్రా. 3-3-4)

అర్థము:—పిమ్మట పత్ని ఆజ్యమునుచూచి యజ్ఞమును పతి ననుసరించి ప్రారంభించును. ఆజ్యావేక్షణమువలన యజ్ఞమునకవిచ్ఛిత్తికలుగును.

ఇంతియేకాదు. పురుషుడే ప్రధానకర్తయనుట కింకను ననేకప్రమాణములను చూపవచ్చును.

ఆత్మానమేవసోమగ్రహైస్స్పృణోతి ।
జాయాగ్ సురాగ్రహైః ॥ (తై. బ్రా. 1-3-3-4)

అర్థము:—వాజపేయయాగము చేయువాడు తన్ను సోమగ్రహములచే తృప్తిని పొందింపవలెను. భార్యను సురాగ్రహములచేత తృప్తిని పొందింపవలెను.

ప్రధానకర్తృత్వము పురుషునిది కావుననే యాతడిట్లు చేయవలెననియు భార్యచే నిట్లు చేయింపవలెననియు నున్నది.

(2) ఇక పితృకర్మకును స్త్రీకినిగల సంబంధమునుగూర్చి విచారింతము. సాధారణముగ పితృకర్మచేయువాడు కుమారుడేయని "స్త్రీలు—ధనము" అను ప్రకరణమున వ్రాయబడిన 'నజామయే' యను బుక్కులోని "అన్యఃకర్తా" అను మాటల వలననే తెలియుచున్నది. కుమారుడు లేనిచో నెవరు చేయవలెననగా: దౌహిత్రుడున్నచో నాతడు చేయవలెను. ఎట్లనగా.

అభ్రాతృకయగు కన్యకు వివాహముచేయు నపుడు తండ్రివరునితో నొకనియమము చేసికొనెడువాడు. నీ వలన నా కుమార్తెయందు జన్మించినవాడు (అనగా ప్రథమపుత్రుడు) నాకు స్వధను (పితృకార్యమును) చేయువాడు కావలెననియే యీ నియమము. వరుడు దీనికి సమ్మతించి వివాహముచేసికొనును. ఈ విషయమీ క్రింది బుక్కులో కలదు.

శాసద్వహ్నిర్దుహితుర్నప్త్యంగా ద్విద్వాన్ బుతస్యదీధితిమ్ సపర్యన్ పితాయత్రదుహితుస్సేక మృంజన్త్సంశగ్మ్యేనమన సాదధన్వే ॥ (3–31–1)

తాత్పర్యము :—పుత్త్రులు లేకుండి కుమార్తె నత్తింటికిపంపు తండ్రికి వహ్నియనిపేరు. ఆ తండ్రి యీ నాకుమార్తెయందు కలిగిన పుత్త్రుడు నాకు స్వధను (పితృకర్మను) చేయునని తెలిసికొనుచున్నవాడై పుత్త్రోత్పాదనసమర్థమగు రేతస్సుగల జామాతను పూజించుచున్నవాడై తనకుమార్తెకు పాల

కుడును, రేతస్సేకముచేయువాడును, సుఖనిమిత్తమైన మనస్సు చేత నామెయందు తనశరీరమును కలుపుచున్నవాడును నగు నల్లుని గుఱించి తనకుమార్తె కాతనివలన జన్మించువాడు తనకు స్వధనుచేయు వాడగునని యనుశాసనము చేయుచున్నాడు.

దీనిం బట్టి యపుత్రకునకు దౌహిత్రుడే కర్మచేయుట వేదకాలములో నాచారమని తెలియుచున్నది.

పైన చెప్పబడిన విధముగ నియమము చేసికొనిన యా తడు దౌహిత్రుడు కలుగకుండగనే మరణించుచో నాతనికెవరు కర్మచేయవలెననగా నాకుమార్తెయే చేయవలయునని ఋగ్వే దములో నొకచోట చెప్పబడియున్నది. అది యీ క్రింది ఋక్కు.

అభ్రాతేవపుంస ఏతిప్రతీచీగర్తారుగి వసనయేధనానాం।
జాయేవపత్య ఉశతీసువాసాఉషాహస్రేవనిరిణీతే అప్సః।
(1—124—7)

అర్థము :—అన్నదమ్ములు లేనిస్త్రీ తనగృహామునుండి తండ్రిమున్నగు వారినుద్దేశించి వెళ్లునట్లు ఉషోదేవత పశ్చిమ దిక్కును గుఱించి వెళ్లుచున్నది. వితంతువు తనధనమును పొందుటకు న్యాయస్థానమునకు వెళ్ళునట్లు ఉషోదేవత ఆకాశ ముపైకి వెళ్లుచున్నది.

దీనికి భాష్యమును వ్రాయుచు సాయణాచార్యులు తండ్రి చనిపోయినపుడు కర్మచేయుటకు గాని వస్త్రాలంకారా దులను తెచ్చికొనుటకుగాని అభ్రాతృస్త్రీ పుట్టింటికి వెళ్లుచు

స్నదని వ్రాయుచున్నారు. వేదములో గొన్ని యితరస్థలము లలో నీ యభిప్రాయము గన్పట్టుచున్నది గావుననే సాయణు లిచట పితృకర్మచేయుటకై యీమె వెళ్ళుచున్నదను నూహాను చేసినారు. ఈ యూహను బలపఱచు నొక మంత్రమును "స్త్రీలు—ధనము" అను ప్రకరణమున చూడవచ్చును.

(అ. సం. 5–4–17–1).

(౩) ఇక స్త్రీలు దేవతల నారాధించి వరములను బడయుట యను సంశమునకు వ త్తము. ఇది యజ్ఞముకాదు. కావున నిట్టిదానిని స్త్రీస్వతంత్రముగనే చేయవచ్చును. భర్త ననుసరించి యుండనక్కరలేదు. కొందఱు స్త్రీలు సవతులనణచుటకై ప్రార్థనలు సలిపిన ట్లిదివఱలో చూచితిమి. దేవతలను బ్రార్థించి సంతానమును బొందిన యిద్దఱు స్త్రీలవృత్తాంతము క్రింద నీయబడినది.

అజోహవీన్నా సత్యాకరావాం మహేయామన్ పురుభుజా పురంధిః। శృతం తచ్ఛాసురివవధ్రిమత్యాహిరణ్యహ స్త మశ్వినావద త్తం. (ఋ. సం. 1–116–13)

అర్థము:—వధ్రిమతియను నామెయొక్క భర్త నపుంసకుడు. ఆమె పుత్రప్రాప్తికై యశ్వినీదేవతలను పిలచెను. వారు వచ్చి హిరణ్యహస్తుడను కుమారు నామె కిచ్చిరి.

అస్మాకమత్రపితర స్త ఆసన్ స ప్తవర్ష యో దౌర్గహే బధ్యమానే। త ఆయజంతత్రసదస్యుమస్యా ఇంద్రనవృతతురమర్ధదేవం॥

పురుకుత్సానీఃవామదాశర్ధ వ్యైభిరింద్రా వరుణానమూభిః।
అథారాజానంత్ర సదస్యుమస్యావృత్రహణం దదధురర్ధ దేవం
(ఋ. సం. 4–42–8, 9)

అర్ధము:—పురుకుత్సుడను రాజొకడుండెను. అతడు పాశములచేత బద్ధుడాయెను. అతనికి కొమరులు లేరు. కావున దేశమరాజకమాయెను. అంత నాతని భార్య తనకొకపుత్త్రుని ప్రసాదింపవలెనని సప్తఋషులను యాచించెను. వారామెను ఇంద్రావరుణులను ప్రార్థింపవలసినదని చెప్పిరి. అంత నామె హవిస్సులచేతను, స్తుతులచేతను, ఇంద్రావరుణులను సంతోషపెట్టెను. అందువలన నామెకు ఇంద్రతుల్యుడగు త్రసదస్యుడను కుమారుడు గలిగెను. కావున నాతనికి సప్తఋషులు తండ్రులైరి.

ఇచట భర్త పాశబద్ధుడైనపుడు భార్య దేవతల నారాధించి యిష్టమును సిద్ధింపజేసికొనెనని చెప్పబడినది. ఇది ఋత్విక్కులులేని యొకయజ్ఞము వల్లనే జరిగియుండును. అనగా నది యొకవిధమగు తపస్సు. అట్టివానిని గూడ స్త్రీలు ఋగ్వేదకాలములో నాచరించెడివారని యిందువలన తెలియుచున్నది.

(4) స్త్రీలకు దానప్రతిగ్రహణాధికారము లుండెనని తెలియుచున్నది.

తరంతునిభార్య శ్యావాశ్వ్యడను వానికి గోవులనశ్వములు మున్నగువానిని దానముచేసినట్లు వింటిమి.

ప్రతిగ్రహణాధికారమే యే సమయములలో నుండెను

స్పష్టముగ చెప్పలేము. కాని యజ్ఞసమయమున స్త్రీకి నాభర ణములను దక్షిణగ నిచ్చుటమంచిదని తైత్తిరీయబ్రాహ్మణ ములో నున్నది.

ప్రియై చాభరగ్ సమృద్ధ్యై ॥ (తై. బ్రా. 3-12-3-9)

అర్థము:—స్త్రీ కొరకీయబడిన యాభరణము సమృ ద్ధికొఱకగుచున్నది.

మొత్తముపైన స్త్రీకి పురుషునికంత విస్తారముగ కర్మ తో ప్రసక్తిలేదని మాత్రము తెలియుచున్నది.



# దశమాధ్యాయము



## స్త్రీలు – ధనము

కొంత ధనముపై నొకరికి స్వత్వము కలుగవలెనన్న నది మూడుమార్గములచేత జరుగవచ్చును. (1) పిత్ర్యముగు గాని యితరమగుగాని యాస్తిగాని యందలి యొకభాగము కాని సంక్రమించుటవలన (2) ఉద్యోగము మున్నగువానిచేత ధనమునార్జించుటవలన (3) బంధుమిత్రాదులు ప్రేమచేతను సాంఘికమర్యాదల ననుసరించియు నొసగు కట్నములు, కాను కలు మొదలగువాని వలన.

(1) ఇందు మొదటిమార్గముచేత ఋగ్వేదకాలము నాటి స్త్రీలకు ధనమేమైనను లభించుచుండెనా? యనువిషయ మును విచారింతము.

కుమారులతోబాటు కుమార్తెలకు నాస్తి సంక్రమించు నాచారము వేదకాలములో లేదు. అనగా స్త్రీలకు దాయ భాగములేదు. ఈ విషయము తై. సం. లో స్పష్టముగ జెప్ప బడినది. అది యీ క్రింది విధముగ నున్నది.

ససోమోనాతిష్ఠత స్త్రీభ్యోగృహ్యమాణ స్తంఘృతం వజ్రం కృత్వాఘ్నంతం నిరింద్రియం భూతమగృహ్ణాం తస్మాత్ స్త్రియో నిరింద్రియా అదాయాదీః॥

(తై. సం. 6, 5, 8, 2)

అర్థము:—దేవపత్నులు సోముని పట్టుకొని యొక పాత్రయందుంచిరి కాని స్త్రీలచే పట్టుకొనబడుటను సహింపలేని వాడై యాతడందులో ప్రవేశించియు కూడ స్వప్రకాశమును కనపరుపలేదు. అంత నాస్త్రీలు ఆ పాత్రలోనున్న ఘృతమును వజ్రముగాజేసి సోమునికొట్టిరి. అందువలన నాతడింద్రియరహి తుడాయెను. నాడాస్త్రీ లింద్రియరహితుడైన సోముని గ్రహిం చినారు కావుననే లోకములోని స్త్రీ లింద్రియరహితలైనారు. వారికి దాయభాగము లేకుండుటకు కూడ నదియే కారణము.

స్త్రీలింద్రియరహితలగుటవలన వారికి దాయభాగము లేదని చెప్పుటలో గొంతకారణ ముండవచ్చును. ఏమన ధన ముకలవారు దానిని రక్షించుకొనుటకు తగినశక్తి కలవారుగ

నుండవలెను. మరియు నింద్రియరహితలకు స్థిరచిత్తతయు నా లోచనశక్తియు తక్కువగనుండును. అందుచేత వారికి ధనమును రక్షించుటకే కాక వ్యయపరచుటకు కూడ తగిన సామర్థ్యముండదు.

స్త్రీలకు దాయభాగము లేకుండుటకు మరియొక కారణముకూడ వేదములలో చెప్పబడియున్నది. అది పితరులకిచ్చు పిండదానమునకు సంబంధించినది. అపరకర్మలుజేసి యనంతరము పిండదానమును జేయువారి కీయాస్తి సంక్రమింపవలెనని వేదముయొక్క యభిప్రాయము. ఇహలోకమున తమకు సేవజేయువారి కంటె మరణానంతరమున నీళ్ళను వదలువారే యెక్కుడు సన్నిహితులును నాప్తులును నని మనప్రాచీనుల యభిప్రాయము. కావుననే సమస్తసౌఖ్యములను గలుగజేయు దాసదాసీవర్గంబెంతయున్నను వారు పుత్త్రులకై పరితపించుచుండిరి. కుమార్తెకు పితృకర్మచేయు నధికారములేదనియు పుత్త్రులును పౌత్రులును లేనప్పుడామె కట్టి యధికారముండి యుండవచ్చుననియు ముందు స్పష్టపఱుపబడును. కావుననే కుమార్తెకంటె కుమారుడే ఆప్తుడును సన్నిహితుడును నుపకారియు యగుచున్నాడు. వానికే తండ్రి కృతజ్ఞతను చూపవలసియున్నాడు. ఆ కృతజ్ఞత దాయభాగము నిచ్చుటయను రూపమున చూపబడినది. ఈ విషయమై యీ క్రిందిఋక్కు చూడదగును.

నజామయే తన్వోరిక్థమరైక్చకార। గర్భంసనితుర్ నిధా

నం యదిమాతరోజనయంతవహ్ని మన్యఃకర్తాసకృతోరన్య
ఋంధన్॥ (ఋ. సం. 3-31-2)

అర్థము :—ఔరసపుత్రుడు సోదరికి పిత్ర్యమగుధనము
నీయడు. ఆతడామెను భర్తయొక్క రేతస్సును ధరించుదానిని
గా జేసినాడు. తల్లిదండ్రులు స్త్రీపురుషరూపమగు సంతతిని
కనుచున్నారు. ఐనను ఈ రెండుసంతతులలోను పురుషుడు పిం
డదానాదికములకు కర్తయగుచున్నాడు. స్త్రీ సంతతి వస్త్రా
లంకారాదులచే పూజింపబడునదై యగుచున్నది.

స్త్రీ సంతతి పితృకర్మజేయుట కనర్హము కావునను
నామె బాధ్యతను వహించుటకు భర్తయను వాడొకడేర్పఱుప
బడి యున్నాడు కావునను నామెకు దాయభాగమీయ నవ
సరములేదని పైవాక్యములవలన తెలియుచున్నది.

దీనినుండి సహజముగ నొకప్రశ్న బయలువెడలును.
'ఋగ్వేదకాలమున వివాహము లేకుండగనే కొందరు స్త్రీలు
నిలచియుండిరిగదా వారి బాధ్యతను వహించుటకు భర్తలేదు
కదా. కావున వారికి దాయభాగము నీయవలసిన విధి తండ్రి
కిలేదా' యనునదియే యీ ప్రశ్న. ఈ ప్రశ్నకు సమాధా
నము ఋగ్వేదములో చెప్పబడియే యున్నది. పెండ్లికాని
స్త్రీలకు తండ్రియాస్తిలో నుండి కొంతభాగము నిచ్చుట యా
నాడాచారముగ నుండెను. కుమారులతో సమానమగు భాగ
మునే యట్టికుమార్తెలకు తండ్రి యిచ్చెడివాడో లేక తనయి
చ్ఛను పుత్రులయొక్క యిచ్ఛనుబట్టి యంతో కొంతయిచ్చెడి

వాడో చెప్పలేము. గాని యింతభాగమామె కిచ్చి తీరవలె నను నియమము మాత్రములేదు. ఎంతయిచ్చినను గూడ దయాధర్మ భిక్షముగనే యిచ్చెడివాడని తెలియుచున్నది. ఏమనగా అవివాహితయగు కుమార్తె తండ్రినుండి భాగమును యాచించుచున్నదని ఋగ్వేదములో నున్నది. పై విషయము లన్నియు ఈ క్రింది మంత్రమువలన తెలియుచున్నవి.

"అమాజూరివపిత్రో॒ స్సచా సతో॒ సమానా దాసదసస్త్వామి యేభగం." (ఋ. సం. 2–17–7)

అర్థము :—ఓ యింద్రుడా యావజ్జీవము గృహమందే జీర్ణించుచు తల్లిదండ్రులతో నుండి భర్తను పొందలేని కుమారిత తనకును తండ్రికిని సామాన్యమైన గృహమునందే యుండి యాతనిధనములో భాగము నెట్లు యాచించుచున్నదో యట్లే పొందదగిన ధనముకొరకు నిన్ను నేను యాచించుచున్నాను.

అన్నదమ్ములులేని స్త్రీకి తండ్రియాస్తిలోని భాగము వచ్చెడిదని చెప్పుటకు వీలున్నది. అథర్వసంహితలో నిట్లు చెప్పబడియున్నది.

అమూర్యాయా న్తి యోషితో హిరాలోహితవాససః ।
అభ్రాతరఇవజామయ స్తిష్ఠన్తుహతవర్చసః ॥

(అ. సం. 5–4–17–1)

అర్థము :—ఈ స్త్రీయొక్క యెఱ్ఱని రజోవాహక నాడులు నిర్వీర్యములై కదలక నిలచియుండుగాక ! ఎట్లన: అన్నదమ్ములులేని స్త్రీ పుట్టింటనిలచి పోవునట్లు.

సాయణాచార్యులు అన్నదమ్ములులేని స్త్రీ పుట్టింటనేల నిలువవలెనను ప్రశ్న వేసికొని సంతానము కనుటకును పిండ దానాదికముకొఱకును నని చెప్పుచున్నారు. పిండదానాదులు చేయువానికే యాస్తి సంక్రమింపవలెనని పైన చెప్పబడినది గదా! కావున నభ్రాతృస్త్రీకి తండ్రియాస్తివచ్చెడిదని తేలు చున్నది.

కుమార్తెకు తండ్రియాస్తిలోని భాగము వచ్చుటవిష యమైన చర్చను చాలించి వితంతువుకు భర్తయాస్తిలోని భాగ మువచ్చెడి దాయను నంశమును చూతము.

జాయేవపత్య ఉశతీసువాసా ఉషాహ్రసేవ నిరిణీతేలప్సు॥

(ఋ. సం. 1–124–7)

అర్థము:—వితంతువు తన ధనమును పొందుటకు న్యాయస్థానమునకు వెళ్లునట్లు ఉషోదేవత ఆకాశముపైకి వెళ్లుచున్నది.

దీనింబట్టి వితంతువుకు భర్త యాస్తిలోని భాగము వచ్చుట యానాడుండెననియు తెలియుచున్నది. తన ధనమును పొందుటకు వితంతువు న్యాయస్థానమున కేగుచున్నదని యిచ్చుట చెప్పబడుటచేత భర్త యాస్తిలో నెంతభాగ మీామెకు రావలయునో యను యంశము తరచుగ వివాదా స్పదముగ నుండెననియు, పరిస్థితుల నన్నిటిని నాలోచించి యెప్పటి కప్పుడే యీవిషయము నిర్ణయింపబడుచుండెననియు ననగా పోయిన భర్తకు సోదరు లెంద రుండిరో భార్య లెంద

యుండెగో మున్నగు నంశముల నన్నిటిని నాలోచించి యీ వితంతువున కెంత యాస్తి రావలెనో యను నంశమును న్యాయస్థానమున పరిష్కరింపబడుచుండెనని యిందువలన తెలియుచున్నది. అనగా నేడు పుత్రులు లేక సమిష్టికుటుంబములో నుండగనే భర్త మరణించిన వితంతువుకు యింత భాగము రావలెనను నియమము లేక తరచుగా పెద్దమనుష్యులో న్యాయస్థానమువారో పరిస్థితుల నన్నిటిని నాలోచించి యెట్లు మనువృత్తిని నిర్ణయించుచున్నారో యించుమించుగ నట్లే యానాడును నుండెనని మన మూహింపవలసి యున్నది.

ఇక స్త్రీలు కష్టపడి ధనము సంపాదించుట ఋగ్వేద కాలములో నుండెనా యను నంశమునకు వత్తము. గత ప్రకరణములలోనే యిది పరిష్కరింపబడినది. ఎట్లన:

రాజున కిరుప్రక్కలను స్త్రీలు భటులుగ నిలబడుట (ఋగ్వే 1–95–6) కూడ వేదకాలములో నుండెనని "స్త్రీలు బాహ్యప్రపంచము" అను ప్రకరణమున స్పష్టపరుపబడినది. అదికాక చర్మపుపనులు, లోహపుపనులు, చాపలు నేయుట మున్నగునవి స్త్రీలు చేయుచుండిరని చెప్పబడినది. ఈవిధముగ సేవజేసి ధనము సంపాదించు స్త్రీలు స్వల్పసంఖ్యాక లగుట మాత్రమేకాక నిమ్నకులములకు చెందినవారై యుండెడి వారని కూడ చెప్పవలసియున్నది. ఏమన నీ పేర్కొనబడిన వృత్తు లట్టివే.

బంధుమిత్రాదు లొసగు నలంకారములు కట్నములు కానుకలు మున్నగు ధనమే వేదకాలమునాటి స్త్రీలయొక్క యాస్తిలో ప్రధానమైనది. ఎచ్చట చూచినను స్త్రీలు స్వర్ణాభరణములచే భూషితలైనట్లు కాన్పించుచున్నది. ఈయాభరణములు తరచుగా పుట్టింటివారు పెట్టుచుండెడివే. కుమార్తె తండ్రి యాస్తిలోని భాగము నాశించెడిది కాదనియు వస్త్రాలంకారాదులనే తండ్రినుండి కోరుచుండెడిదనియు చెప్పుటకు చాల యాధారము లున్నవి. పైన నుటంకింపబడిన "నజామయే" యిత్యాది ఋక్కువలన యీసంగతి తెలియుచున్నది. మరియు వివాహమునకు పూర్వమందును, వివాహసమయమందును వధువు అలంకారములచే భూషితురా లగుచుండినట్లు 'వివాహ' మను ప్రకరణమున స్పష్టపరుపబడినది. అంతియే కాక సాధారణముగ స్త్రీ లాభరణములను ధరించు విషయముగూడ వేదములలో గలదు.

యథాహవై యోషా సువర్ణగ్ హిరణ్యం పేశలంబిభ్రతీ

(తై. బ్రా. 3-34-5)

అర్థము:—స్త్రీ సువర్ణముచే చేయబడిన ప్రకాశించుచున్న నగలను ధరించునట్లు అను నొక యుపమానము వాడబడినది.

ఆడపడుచు నప్పుడప్పుడు పుట్టింటికి తీసికొనివచ్చి వస్తురూపముగను వస్త్రరూపముగను మరియు నితరవిధముగను నేదో యామెకు ముట్టచెప్పుచుండుట వేదకాలములో కూడ

నుండెను. తండ్రి జీవించియుండగ మాత్రమే కాక యాతని యనంతరము కూడ నామె పుట్టింటినుండి యీ లాభమును పొందుచుండెడిది. తండ్రి లేనిచో సోదరుడే యామె నీవిధముగ గౌరవించెడివాడు. భార్యయొక్క సోదరునివలన నిట్టి లాభ ముండెడిది కనుకనే స్యాలుడు అనగా బావమరది గొప్ప దాత యని ఋగ్వేదములోను యజుర్వేదములోను చెప్పబడినది.

అశ్రవగ్ హి భూరిదావత్తరా వాం విజామాతురుత వాఘా స్యాలాత్ ॥ (తై. సం. 1–1–14–1)

అర్థము:—ఓ యింద్రాగ్నులారా! మీరు చాల దాతలని నేను వినియున్నాను. అల్లునికంటెను బావమరది (భార్యయొక్క సోదరుడు) కంటెను కూడ నెక్కుడు దాతలు.

పుట్టింటివారు ధనికులైనకొలదియు స్త్రీ కెక్కుడు సొమ్ము వారినుండి ముట్టుచుండెను. కావుననే పురుషునకు అత్తవారు ధనికులగుట యొక గొప్ప యదృష్టముగా భావింపబడుచుండెను. యజుర్వేదములో శుక్రాగ్రయణాగ్రముల యొక్క వివాహ మొకచోట వర్ణింపబడినది. ఆపిమ్మట ఎవ్వడీ వృత్తాంతమును పూర్తిగా తెలిసికొనుచున్నాడో వాడు.

"పవశ్యసో వివాహ మాప్నోతి." (తై.సం.7–2–8–7) అనగా "ధనికుల కులమునుండి వివాహమును పొందుచున్నాడు" అని చెప్పబడియున్నది.

పైన చెప్పిన విషయ మంతయు స్త్రీకి స్వంతమగు ధన

మునకు సంబంధించినది. స్త్రీధనము విషయమై విచారించు నపుడు మరియొక విషయము కూడ చెప్పవలసియున్నది. అది యేదన: భర్తకు స్వంతమగు నాస్తిలో స్త్రీ కేమాత్ర మధికార ముండెడిదను విషయము. భర్తసొమ్మును భార్య యనుభవించుటలోను దానముచేసికొనుటలోను కుటుంబనిమిత్తమై వ్యయపరచుటలోను నేమైన స్వాతంత్ర్యమును కలిగియుండెనా లేదా యను విషయము ముఖ్యమైనది. యేమన భర్తసొమ్ము అని చెప్పబడు దానిలో చాలభాగము భార్యచేతులలోనే యుండెను. క్రియలో నామెయే దానికి స్వామిని. ఈ స్వామిత్వమామెకు కలుగుట సహజమే. ఎట్లన గృహమును గృహములోని పదార్థములును యథార్థముచేత భర్తవేయైనను భార్య వానిని తనవిగా భావింపనిచో నొక్క నిమిషమైనను సంసారము సుఖముగ నడువనేరదు. ప్రతియడుగునకును దాన వ్యయానుభవాదుల విషయమై భర్తయొక్క యనుమతిని భార్య తీసికొనుచుండుట సాగదు. కావున భార్యయే గృహములోని సమస్తపదార్థముల పైనను స్వామిత్వము వహింప వలసిన యావశ్యకత యేర్పడెను. కావున గృహములోని సమస్తమునకును, భార్యయే యజమానురాలను అభిప్రాయమేర్పడెను. యజుర్వేదములో నొకచోట గృహములోని సమస్త పదార్థములకును భార్యయే స్వామిని యని స్పష్టముగ జెప్ప బడినది. ఆసందర్భమేమన:—

యజ్ఞముకొరకై యజమాని గృహమునుండి యజ్ఞశాల

యొద్దకు శకటముపై ఘృతపాత్రాది ద్రవ్యసమూహమును తీసి కొని వెళ్ళుదురు. ఆ పదార్థములను బండినుండి క్రిందకు దింపుటకు పూర్వము యజమానపత్ని యాశకటమును స్పృశింపవలెను. అట్లు స్పృశించుటలో అర్థమేమనగా: యజమాన పత్ని ఆ ద్రవ్యమును యజ్ఞమునకై వినియోగించుట కనుమతి యిచ్చినదని. ఆమె యనుమతి యెందులకనగా ఆమె దానికధి కారిణిగదా!

"పత్నీహిపారీణహ్యస్యేశే। (తై. సం. 6–2–1–1)

అర్థము:—పత్నియే గృహమునకు సంబంధించిన ద్రవ్యమున కంతకును ప్రభ్వి.

భార్యకు గృహములోని ద్రవ్యమునకు స్వామినీత్వము కేవలము నామమాత్రముచే నంగీకృతము కాదని చెప్పుటకు కొన్ని యాధారములున్నవి. కొన్నిచోట్ల స్త్రీలు గొప్పగొప్ప దానములు చేసినవారుగ చెప్పబడినారు.

"సనత్సాశ్వ్యం పశుముతగవ్యంశతావయం శ్యావాశ్వస్తుతాయయాదోర్వీరాయోప బర్బృహత్ ॥
(ఋ. సం. 5–61–5)

అర్థము:—శ్యావాశ్వునిచే స్తుతింపబడినట్టియు వీరుడైనట్టియు భర్తయొక్క ఆ లింగనమునకై తన బాహువుల నిచ్చిన తరంతుని భార్య గోసమూహమును, అశ్వసమూహమును, గొర్రెలను శ్యావాశ్వునికొరకు (శ్యావాశ్వుడను పేరుకలవానికొరకు) ఇచ్చెను. దీనింబట్టి స్త్రీ తన భర్తయొక్క

ధనమును దానముచేసికొనుటకు గూడ నధికారము కలిగియుం డెనని తెలియుచున్నది. అనగా భర్తయొక్క సొత్తును తన సొత్తువలెనే చూచుకొనుట కామె కధికారము కలదు. కావు ననే నాటిస్త్రీలకు స్వంతముగ ధనము తక్కువయే యైనను గూడ సౌఖ్యమునకును తగుమాత్రము స్వాతంత్ర్యమునకును లోటు లేకుండెను.

మొత్తము పైన స్త్రీకి ధనము భర్తను బట్టియే యుండెడిది. ఆతడు నిర్ధనుడైనచో నామెయు నిర్ధనురాలే. పిత్ర్యమగు నాస్తివచ్చుట ఉద్యోగముచేసి ధనము సంపాదించుట అనునవి చాలనరుదుగ నుండిన విషయములే. ధనవిషయము లో భర్తతో బాటు మునుగుటయు తేలుటయు ననునదియే సామాన్యవిషయము.



# ఏకాదశాధ్యాయము



## స్త్రీలప్రకృతి; స్త్రీలస్థానము.

వేదకాలములో మాటలోగాని చేతలోగాని స్త్రీ పురుషులకు సమానప్రతిపత్తి యుండలేదు. సంఘములో పురుషుడు ప్రధానుడుగను స్త్రీ యాతని ననుసరించి యుండవలసినదిగను పురుషుడు నేతగను స్త్రీ నీతగను, పురుషు

డధికారిగను స్త్రీయా యధికారము నైచ్ఛికముగనో బలవంత ముగనో భరించునదిగను నుండెను. స్త్రీపురుషప్రకృతుల విషయమై యా నాటి ప్రజలకు గల యభిప్రాయములను బట్టియే యిట్టి సంఘస్థితి యేర్పడినది.

సృష్టిలో పురుషుడే ప్రధానుడును ప్రథముడునుననియు నాతని యానందమునకై స్త్రీ సృష్టింపబడినదనియు నందుచే నామెకు సృష్టిలో పురుషుని యంతముఖ్యత్వము లేదనియు వేదమువలన తెలియుచున్నది.

బృహదారణ్యకోపనిషత్తులో నీ క్రిందివిధముగ నున్నది.
సవైనైవరేమే తస్మాదేకాకీనరమతె సద్వితీయమైచ్ఛత్ ।
సహైతావానాసయథా స్త్రీపుమాగ్ సౌ సంపరిష్వక్తౌస
ఇమమేవాత్మానం ద్వేధాపాతయత్తతః పతిశ్చపత్నీచాభ
వతాం తస్మాదిదమర్ధబృగలమివస్వఇతిహ ॥ (బృ. ఉ. 1-4)

అర్థము :—(ముందుగా ప్రజాపతియొక్కడే యుండుటచే) ఆతనికి సంతోషము లేకపోయెను. ఏకాకిగ నుండువానికి నానందముండదు. కావున నాతఁడు రెండవవ్యక్తిని కోరెను. ఆతఁడు స్త్రీచేత ఆలింగింపఁబడుటను కోరి యామెను సృష్టించుటకై తననే రెండుముక్కలుగా పడగొట్టుకొనెను. ఆ పడిన రెండవముక్కయే స్త్రీ. ఇట్లు వారిరువురును పతనముచే నేర్పడినారు గావున వారికి పతియనియు పత్నియనియు పేర్లు వచ్చినవి. పత్నిచేత ఆలింగింపఁబడినవాఁడగుచుండగా ప్రజాపతికి నాత్మభావము కలిగెను.

బృహదారణ్యకోపనిషత్తులోని యీ పై వాక్యముల వలన రెండంశములు తేలుచున్నవి: 1 సృష్ట్యాదిలో పురుషుని తృప్తికొఱకై స్త్రీ సృజింపఁబడినది. కావున సృష్టిలో పురుషునకు ప్రాధాన్యమును స్త్రీకప్రాధాన్యమును తేలుచున్నవి. 2 'పత్ల్' ధాతువునుండి పతి పత్నీశబ్దములు వచ్చినవి. ఇందలి మొదటియంశము విషయమై మనము బృహదారణ్యకోపనిషత్తును నమ్మకుండుటకు కారణము కాన్పింపదు కాని రెండవ యంశము విషయమై కొంతసందేహమున కవకాశమున్నది. ఏమన: వేదములలో ననేకస్థలములలో వాడఁబడిన 'పతి' 'పత్నీ' శబ్దములు 'పా' రక్షణేయను ధాతువునుండి వచ్చినట్లు కాన్పించుచున్నవి. లేకున్నచో 'గృహపతి' 'గృహపత్ని' 'ప్రజాపతి' మున్నగుస్థలములలోని పతిపత్నీ శబ్దములకు సరియగు నర్థముండకపోవును. ఇచ్చట రక్షకుఁడు, రక్షకురాలు యను నర్థములే చెప్పవలెనుగాని పడఁగొట్టినవాఁడు పడగొట్టబడినది అను నర్థములు చెప్పుటకు వీలులేదు. ఈ విధముగ చూడ నీ శబ్దములు 'పా'రక్షణే యనుధాతువునుండే వచ్చినవని చెప్పుటకు నాధారములు కన్పించుచున్నవి. శబ్దములు మాత్రము రెండుధాతువుల నుండియుగూడ నిష్పన్నములగుటకు వీలున్నది. కావున పత్ల్ ధాతువునుండి వచ్చినవి అని చెప్పుటను సమర్థించునంశములు వేదవాఙ్మయములో గాని ఇతరస్థలములలోగాని యేమైన నుండుచో వానిని మనము తీసికొనవచ్చును. కైస్త్రవమత గ్రంథములో నట్టియంశమొకటి గాన్పించుచు

న్నది. సృష్టిలోని యాది పురుషునకు సమస్తసౌకర్యములను భగవంతుఁడు కల్పించెననియు నైనను నాపురుషునకు తృప్తి లేకుండెననియు నంత భగవంతుఁడాతని యెడమప్రక్క యెముకనుతీసి దానిని స్త్రీగా చేసెననియు నామెనుచూచిన తోడనే యా పురుషున కానందము కలిగెననియు నున్నది. బైబిలులోని యీ కథ బృహదారణ్యకోపనిషత్తులోని కథతో తులదూగుచున్నది. ఇందుకూడ స్త్రీ పురుషుని యానందమునకై యుద్దేశింపఁబడిన వ్యక్తియని స్పష్టపరుపఁబడినది. పురుషుఁడు పడగొట్టఁబడుటచే నీస్త్రీ యేర్పరుపబడినదని బైబుల్ లోనికథవలన గూడ దెలియుచున్నది. కావున పతిపత్నీశబ్దములు 'పత్ల్' ధాతువునుండి వచ్చినవని చెప్పుట కాధారము గన్పట్టుచున్నది.

దీనిపై నొక ప్రశ్న రావచ్చును. ఈ గ్రంథములోనే రెండుస్థలములలో భార్యభర్తచే రక్షింపబడునదని చెప్పుటకు 'పతి' శబ్దమే సాక్ష్యమని చెప్పబడినది. పతిశబ్దము 'పత్ల్' ధాతువునుండియే వచ్చియున్నచో నీ సాక్ష్యము సరియైనది కాకపోవును గదాయనియే యీ ప్రశ్న ఇందుకు సమాధానమేమన: వేదకాలములోనే 'పతి' శబ్దము 'పా' ధాతువునుండి వచ్చినదను భావముండెనని 'ప్రజాపతి' 'గృహపతి' మున్నగుస్థలములలోని పతిశబ్దమును బట్టియే తెలియుచున్నది. కావున వ్యుత్పత్త్యర్థమెట్లున్నను వేదకాలములో పతిశబ్దమునకు పాలకుడని యర్థమేర్పడెననియు కావున దానికి 'పా' రక్షణే

యను ధాతువుతో సంబంధము నాడే కల్పింపబడెననియు తెలి యుచున్నది. వేదకాలమునాటి భావములతోనే మన కెక్కు డవసరముగాని పదముయొక్క యాది యర్థముతో గాదు.

స్త్రీ పురుషుని తృప్తికై యుద్దేశింపబడినది కావుననే యామెకు పాతివ్రత్యము విహితమైనది.

స్త్రీలు శారీరకముగ పురుషులకంటె తక్కువవారని యీ క్రింది ఋగ్వేదవాక్యములో నున్నది.

నబలాఅస్యసేనాః। అంతర్వ్యాఖ్యత్ ॥

దీనివివరణము "స్త్రీలు--బాహ్యప్రపంచము" అను ప్రక రణమున చూడదగును.

సాధారణముగ స్త్రీలు పురుషులకంటె తక్కువవారే యని యీ క్రిందిఋక్కువలన తెలియుచున్నది.

ఉతత్వాశసీయసీపుంసో భవతివస్యతీ।
అదేవత్రా దరాధసః॥ (ఋ. సం. 5-61-6)

అర్థము:—మఱియు స్త్రీలలో నొక శసీయసియే దేవ తల నారాధింపనట్టియు, లుబ్ధుడైనట్టియు పురుషునికంటె శ్రేష్ఠురాలు.

నీచుడగు పురుషునికంటెను గూడ స్త్రీ తక్కువదేయ నియు గాని యొక్క శసీయసి మాత్రము నీచుడగు పురుషుని కంటె నధికురాలనియు నిందువలన తెలియుచున్నది. శసీయసి వలన దానమును పొందినవాడామె నీ పైవిధముగ స్తుతించి నాడు. కావున నిందుకొంత యతిశయోక్తి యుండవచ్చును.

ఈ యతిశయోక్తి యెందున్నదన : ఎంతనీచుడైన పురుషుని కంటెనుగూడ నధికురాలగుటకు స్త్రీ కెన్నడును వీలులేదు. అట్టిస్థితిలో శసీయసిమాత్రమిూ సూత్రమునకు అపవాదకారిణి యని చెప్పుటలోనే యీ యతిశయోక్తియున్నది. ఎంతనీచుడైన పురుషునికంటెను గూడ స్త్రీ తక్కువదేయని చెప్పుట కాధారమేమన :

స్త్రియో నిరిన్ద్రియా అదాయాదీరపి పాపాత్పుగ్సగ్ ఉప స్తితరం వదన్తి॥ (తై. సం. 6-5-8-2).

అర్థము :—స్త్రీలు నిరిన్ద్రియలు దాయభాగములేని వారు. వారు పాపియగు పురుషునికంటెను తక్కువవారని చెప్పుదురు.

ఈదౌర్బల్యము వలననే వారికి పురుషులకున్న యనేకాధికారములు లేకుండ పోయినవి. మఱియు పతియను రక్షకుడొక డవసరమాయెను.

స్త్రీలు తక్కువవారను భావమింకను ననేకవిషయములలో గాన్పించుచున్నది. ఇంద్రుడు, వరుణుడు, అగ్ని మున్నగు పురుష దేవతల కొక్కొకరి కనేక సూక్తములు వినియోగింపబడియుండ స్త్రీ దేవతలలో నొక్క యుషోదేవతకు మాత్రము ఋగ్వేదములో నొక సూక్తము వినియోగింపబడినది. ఆమెకు గూడ యజ్ఞములో హవిర్భాగములేదు. మఱియు నింద్రాది పురుషదేవతలకు లోకాధిపత్య మారోపింపబడినది. కాని యొక్క స్త్రీ దేవతకును నట్టి యాధిపత్య మారోపింపబడ

లేదు. స్త్రీల న్యూనతను దెల్పుటకిఁయన్నియునుగూడ సాక్ష్యములే.

స్త్రీ లెవ్వరిని గూడ హింసింపని స్వభావము గలవారుగ భావింపబడుచుండిరి. శతపథబ్రాహ్మణములో నిట్లున్నది.

నవై యోషాకంచ నహినస్తి. (శ. బ్రా. 8–1–3)

అర్థము:—స్త్రీ యెవ్వరిని హింసింపదు.

ఇట్లు హింసారహితమైన జీవనము చేయువారుగావుననే వారిని హింసించుట కూడదని ప్రత్యేకముగ చెప్పబడినది.

నవై స్త్రియం ఘ్నన్తి. (శ. బ్రా. 13–4–3)

అర్థము:—స్త్రీ నెవ్వరును చంపరుగదా.

సాధారణముగ స్త్రీలు పురుషులయొద్ద వినమ్రతను కన్పఱచెడివారు.

ఏవేద్యూనే యువతయో నమన్త. (10–30–6)

అర్థము:—యువతులు యువకునకు వినమ్రలై యున్నట్లు ఉదకములు సోమునకు వినమ్రములై యున్నవి.

పైన చెప్పబడిన వినమ్రతతోబాటు లజ్జకూడ స్త్రీల ప్రధానగుణములలో నొకటిగ నుండెను. లజ్జయే స్త్రీల కలంకారము. ఇది స్వతస్సిద్ధముగ స్త్రీలకు భగవంతునిచే ప్రసాదింపబడినది. అణకువ, భిడియము, లజ్జ యనునవి లేని స్త్రీ కెన్ని సుగుణములున్నను ప్రకాశింపవు. పురుషుని హృదయమును చూరగొనుటకు గూడ లజ్జ యొక గొప్ప సాధనము.

కన్నెత్తి పైకి చూచుటయు వచ్చుచు పోవుచున్నవారిపై దృష్టిని నిగుడ్చుటయు స్త్రీకి కూడని యలవాట్లని యానాటి నుండియు ప్రజలు తలచుచుండిరి.

ఋగ్వేదములోని యీక్రింది యంశము చూడదగును. ప్లాయోగి యనువాడు స్త్రీరూపమును పొందెను. ఆతనితో నింద్రు డిట్లు చెప్పుచున్నాడు.

అథఃపశ్యస్వమోా పరిసంతరాం పాదకౌహర॥ (8—33—19)

అర్థము :—క్రిందకు చూచుచుండుము. పైకి చూడకుము. పాదములను దగ్గఱగా వేయుచుండుము.

లజ్జతో నుండుటయు, నెమ్మదిగ నడచుటయు ఉత్తమ స్త్రీలకు లక్షణమని యిందువలన తెలియుచున్నది. స్త్రీలకు విహితములగు గృహకృత్యములకు లజ్జ తోడగుటచేతనే వారికి బాహ్యప్రపంచముతో సంబంధము లేకపోయెను.

లజ్జను పురస్కరించుకొనియే బయలుదేరిన మఱొక గుణము హృదయగాంభీర్యము హృదయములోగల భావముల నామె సులువుగ పైకి తేలదు. పురుషుడు స్త్రీని కామించినపు డామె వెంటబడి యనేక విధముల తన హృదయాందోళనమును గన్పఱచుకొనును. (ఋ. సం. 4—32—16; 4—20—5; 3—52—3; 1—15—2;) ఒకవేళ స్త్రీయే పురుషుని కామించినను గూడ నామె తన చాతుర్యముతో నాతనినే తనవైపునకు లాగికొనును. కాని బేలయై యాతనివెంట బడదు. (ఋ. సం. 4—3—2) స్త్రీ స్వతస్సిద్ధముగ పురుషునికంటె

నన్నివిధముల బలహీనయే యైనను నాతని కొంతవఱకు లొంగ తీసికొనుట కామె కీ గుణమొక సాధనమయ్యెను.

అలంకారముల పైనను సొగసులపైనను స్త్రీల కెక్కు డుప్రీతి. జీవయాత్రలోని ప్రధానాంశములపైకి వారి యభి రుచులుపోవు. ఒకకార్యమును దీక్షతో సాగించుట, ఒకప్ర యోజనమును నెఱవేర్చుట యనునవి స్త్రీల హృదయముల నా కర్షింపవు. కావుననే స్త్రీలు బాహ్యవస్తువులను చూచి యానందించుటకును పురుషుల హృదయముల నానందింపచే యుటకును నుద్దేశింపబడియున్నారను భావము లాదినుండియు ప్రబలియున్నవి. ఒకస్త్రీ తనపుత్రులు శత్రువులను జయించువా రుగను తనకుమార్తెలు ప్రకాశించువారుగను నుండవలెనని ఋగ్వేదములో కోరుకొనుచున్నది. స్త్రీలు—బాహ్యప్రపం చము అను ప్రకరణమును చూడదగును. అలంకరింపబడిన స్త్రీ లుపమానముగ చాలచోట్ల చెప్పబడియున్నారు. అశ్వినీ దేవతలు స్త్రీలువలె ప్రకాశించుచున్న వారుగ నొకచోట చెప్ప బడినారు. ( II-39-2) స్త్రీ వస్త్రాలంకారములను తెచ్చికొనుటకు పుట్టింటికి పోవుచున్నట్లు చాలచోట్ల చెప్పబడియున్నది. సోమ ములు అలంకరింపబడిన స్త్రీలతో పోల్పబడినవి. వేయేల? పురుషులకు బలశౌర్యములెట్టివో స్త్రీలకు సౌందర్యాలంకార ములట్టివి.

వేదములలో నున్న కొన్ని యితిహాసములను బట్టి స్త్రీలు పరోపకారబుద్ధిగలవారని తెలియగలదు.

ఒకసారి దేవేంద్రునకు వారుపకారముచేసి యుండిరి. అదియెట్లన: ఇంద్రుడు వృత్రాసురుని చంపుటచే నాతనికి బ్రహ్మహత్యాపాపము వచ్చెను. ఆతడా పాపములో మూడవ వంతును భూమికిని మఱొక మూడవవంతును వృక్షములకును పంచియిచ్చి మిగిలిన మూడవభాగమును గ్రహింపవలెనని స్త్రీలనుకోరెను. వారందుల కంగీకరించిరిగాని యొకవరము నీయ వలసినదని యింద్రునికోరిరి. ఇంద్రుడావరమును వారికిచ్చి మూడవవంతు పాపమును వారికి వదలెను. ఈ వరముయొక్క వివరములును నీకథకు సంబంధించిన యితరవిషయములును ముందు చెప్పబడును.

మఱొకపర్యాయము స్త్రీలు బ్రహ్మదేవున కుపకారము చేసియుండిరి.

దేవావై త్వష్టారమజిఘాగ్ సంసపత్నీః ప్రాపద్యతతన్నప్రతిప్రాయచ్ఛం తస్మాదపివధ్యంప్రపన్నం నప్రతిప్రాయచ్ఛంతి తస్మాత్పాత్నీవతే త్వష్ట్రేపిగృహ్యాతే॥

అర్థము—దేవతలు త్వష్టను హింసించిరి. ఆతడు దేవపత్నులను శరణుజొచ్చెను. కావున దేవతలాతనికి హావిర్భాగము నీయరు. ఆతనికి పాత్నీవతగ్రహామందు మాత్రమే హావిర్భాగము దొఱకుచున్నది.

స్త్రీల హృదయము చాలక్రూరమైనదని ఋగ్వేదములో చెప్పబడియున్నమాట వాస్తవమే. కాని పైనచెప్పబడిన స్త్రీల పరోపకారబుద్ధికిని దీనికిని సమన్వయము చేయుటకు

ఋగ్వేదములోనే వీలుగాన్పించుచున్నది. ఎట్లన: స్త్రీలకు నాలోచన శక్తితక్కువయని సూచించుమాటలు కొన్నియు న్నవి. వారికి చెప్పినను తెలియదని యీ క్రిందివాక్యములో నున్నది.

స్త్రీణామశాస్యంమనః॥ (ఋ. సం. 4-33-17)

అర్థము:—స్త్రీల మనస్సును శాసించుటకు వీలులేదు.

దీనింబట్టి వారికే బుద్ధిగల్గిన నదేయనియు మంచిచెడ్డ లాలోచించుట వారికి చేతకాదనియు తేలును. అహేతుకముగ నే వారికొక బుద్ధిపుట్టుచుండును. మఱల నాబుద్ధి మారుచుం డును. అనగా స్థిరచిత్తతయనునది వారికి లేదు. ఒకదినమున స్నేహమును గన్పఱచి మఱొకదినమున ద్వేషమును గన్పఱ తురు. కావున వారితో స్నేహమనునది యుండదు.

నవైస్త్రైణాని సఖ్యానిసన్తి॥ (ఋ. సం. 10-95-15)

అర్థము:—స్త్రీలతో స్నేహమనునది యుండదు.

అనగా స్నేహము స్థిరముగా నుండదని యర్థము. ఈ యస్థిరచిత్తతవలననే వారావేశప్రధానహృదయలు, ఈ యా వేశగుణమువలననే దయయు జాలియు గలుగుటయు పరోప కారము చేయుటయు సంభవించుచుండును. మనస్సు కుద రకున్నచో వారిని త్రిప్పుట చాలకష్టము. అప్పుడు వారిహృ దయములు చాలకఠినములుగ నుండును. ఈ హృదయకర్కశ త్వమువలననే వారొక్కొక్కప్పుడు తోడేళ్లవంటివారని యని పించును.

సాలావృకాణాం హృదయాన్యేతా॥ (ఋ. సం. 10-95-15)

అర్థము :—స్త్రీలహృదయములు తోడేళ్ల హృదయములే.

స్త్రీలయం దిట్టి చంచలస్వభావముండుట చేతను వారి మనస్సశాస్యమగుటచేతను వారిని చిన్నతనమునుండియు లొంగతీయవలసిన యావశ్యకతనాటి ప్రజలకు కన్పట్టి యుండవచ్చును. ఆర్థికముగను నితరవిధములు గను వారిని పురుషాధీనలనుగ చేసియుండుట కిది కొంతహేతువు గావచ్చును. మరియు యౌవనవతియగు పఱకును తండ్రియధీనమునను పిమ్మట భర్త్రధీనమునను నుండుటచే వారికి స్వతస్సిద్ధమగు నీ దుర్గణముల ప్రభావము తగ్గునని నాటిప్రజలు భావించి యుండవచ్చును. లేకున్నచో స్త్రీ భర్త నతిక్రమింపరాదను శాసనమంతతీవ్రముగ నాడుండవలసిన పనిలేదు. ఇక పురుషుని విషయమన్ననో యాతడు భార్యకు లొంగుబాటులో నుండవలెనను శాసనములేకున్నను నాతడట్లే యుండెను. స్త్రీకే యీ విధమగుస్వేచ్ఛ నిచ్చినచో నామె పురుషునిపట్ల నంతప్రేమతో వర్తింపదని వారు భావించియుండిరి. ఏమన : వేదవాఙ్మయములో నెచ్చటచూచినను గూడ పురుషుడు భార్య నతిప్రేమతో చూచుచుండినట్లు గాన్పించును. పురుషునివలెనే స్త్రీని గూడ స్వేచ్ఛగ వదలినచో నామె పురుషునిపట్ల ప్రేమతోను ననుబంధముతోను నుండదని చెప్పుటకు ఋగ్వేదదశమ మండలములోని పదియవసూక్తములోని ఊర్వశీపురూరవుల

చర్యమే సాక్ష్యము. ఆమె యితరుల యదుపాజ్ఞలలో గాక కేవలము స్త్రీ ప్రకృతిమీాద బ్రతికిన దేయగుటచే భర్తను వదలి పెట్టిపోవుచు "స్త్రీలతో సఖ్యముండ"దని చెప్పినది. ఈ ప్రకృతిని వీరైనంతవఱకు మార్చుటకే స్త్రీలను క్రమశిక్షణవలనను నిర్బంధమువలనను పురుషులకధీను రాండ్రనుగ చేసినారు.

వేదకాలములో గార్గి, మైత్రేయి మున్నగు కొలదిమంది యే విదుషీమణులుండుటకు గారణము "స్త్రీణామశాస్యం మనః" అను నమ్మకమే యైయుండవలెను. విద్యయనగా శిక్షణయే. మనస్సు శిక్షణకు లోబడనిచో విద్యయబ్బదు. చెప్పినసంగతులను గ్రహించు శక్తికూడ స్త్రీలకు తక్కువ యని యీా క్రిందివాక్యమువలన కూడ తెలియగలదు.

అతో అహాక్రతుంరఘుం॥ (ఋ. సం. 8-33-17)

అర్థము:—అందువలన (అనగా వారిమనస్సశాస్యమగుటవలన) స్త్రీలకు ప్రజ్ఞ తక్కువయని చెప్పుదురు.

స్త్రీలబలహీనత యన్నివిషయములలోను స్పష్టముగ నంగీకరింపబడియున్నను గూడ వేదకాలపు పురుషులు స్త్రీల పట్ల తగుగౌరవమును చూపెడివారు. స్త్రీలేనిచో పురుషుని జీవితము దుఃఖభాజనమగుటయే యిందులకు మూలహేతువు మఱియు 'వివాహ'మను ప్రకరణమున స్పష్టపఱపబడిన భార్యయొక్క యావశ్యకత యానాడు బాగుగ గుర్తింపబడెను. రాబోవుసంతానము యొక్క శారీరకమానసిక స్థితులు చాలవఱకు తలిదండ్రులపై నాధారపడియుండున వగుటచే సమస్తవిధము

లచేతను గూడ భావిమాతలు సమర్థులుగ చేయబడవలసియుం డిరి. తల్లినిబట్టి కుమారునిస్థితి చాలవఱకు నేర్పడునని యానాడు ప్రజలు బాగుగనెఱిగియుండిరి. ఇంద్రుడు తనబలమును తల్లిదండ్రులయొద్దనుండి పొందెనని యీక్రిందిమంత్రములోనున్నది.

కియత్స్విదింద్రో అధ్యేతిమాతుః కియత్పితుర్జని తుర్యోజజాన॥

(ఋ. సం. 4-17-12)

అర్థము :—ఇంద్రుడు తనను కనిన తల్లినుండి కొంత బలమును తండ్రినుండి కొంతబలమును పొందెను.

మఱియు మంచితల్లియు మంచితండ్రియు మంచిగురువు గలవాడే విద్వాంసుడగునని యీ క్రింది యుపనిషద్వాక్యములో చెప్పబడుటకు గూడ నిదియే కారణము.

మాతృవాన్పితృవానాచార్య వాన్పురుషోవేద.

ఈవిధముగ తల్లియొక్క ప్రాధాన్యము ప్రకృతిసిద్ధమే యగుచున్నది. ఈవిషయమును సమర్థించు మఱొక యంశమునుగూడ నిచట చెప్పవచ్చును. తండ్రిమాత్రమే కాక తల్లికూడ పుత్రుని రూపముగ పుట్టుచున్నదని వేదములలో నున్నది.

ప్రజాయస్వ ప్రజయాపుత్రకామే॥ (తై. మం. పు. 1–11)

అర్థము :—ఓ పుత్రులను గోరుదానా, నీవు సంతానరూపమున జన్మింపుము.

సంతానములో తల్లి తత్త్వమును తండ్రి తత్త్వమును గూడ సమముగానే యుండును.

ఇక తలిదండ్రులలో నెవరు ప్రధానులను ప్రశ్న యుద యించును. కొన్ని యంశములనుబట్టి చూడ నిద్దఱును సమానులే యని తేలును. పైన వివరింపబడిన యంశము లట్టివే. తలిదండ్రు లిద్దఱికిని నొకే పే రుండుటనుబట్టి కూడ నిట్లు చెప్పుటకు వీలగుచున్నది.

'పితరా' యనునదియు 'మాతరా' యనునదియు గూడ 'తలిదండ్రు' లను నర్థమున వాడబడి యున్నది.

మాతరావివిశుస్సప్తవాణీః పరిక్షితాపితరా॥

(ఋ. సం. 3–7–1)

మఱియు వేదములలో గన్పట్టు కొందఱి నామములు తండ్రులను బట్టియు కొందఱి నామములు తల్లులను బట్టియు వచ్చి యున్నవి. అత్రిమహాముని కుమారుడు ఆత్రేయుడు. మమతయను నామె కుమారుడు మామతేయుడు. బృహదారణ్యకోపనిషత్తులోని యారవ యధ్యాయమున నైదవబ్రాహ్మణములో కొందఱు ఋషులు తల్లుల నామములవలన తెలియబడుచున్నారు.

పౌతిమాషీపుత్రః కాత్యాయినీపుత్రః గౌతమీపుత్రః॥

ఇచ్చట భాష్యములో శంకరాచార్యులు. తల్లియే తండ్రికంటెను నెక్కుడు ముఖ్యురాలను నభిప్రాయమును వెలిబుచ్చి యున్నారు.

తల్లిదండ్రులు పుత్రునికి జన్మనుమాత్రమే కాక ప్రకృతిని కూడ నిచ్చువారు గావుననే వారు మిక్కిలి పూజ్యులుగ

పరిగణింప బడుచుండిరి. ఈపూజ్యత్వ మెంతవఱకు వెళ్లిన దనగా: వారే దైవములుగ భావింపబడుచుండిరి. తైత్తిరీయోపనిషత్తులో గురుకులమును వీడుచున్న బ్రహ్మచారి యిట్లుపదేశింప బడుచున్నాడు.

మాతృదేవోభవ పితృదేవోభవ ఆచార్యదేవోభవ॥

(తై. ఉ. శీక్షావల్లి చరమానువాకము)

అర్థము:—తల్లి దైవముగ గలవాడ వగుము. తండ్రి దైవముగ గలవాడ వగుము. గురువు దైవముగ గలవాడవగుము.

ఇందలి క్రమమును బట్టి చూడగా తల్లియే తండ్రికంటెను నెక్కుడు దైవమని తేలుచున్నది. కాని క్రమమునుబట్టి చూడ వేదములలో మఱికొన్ని స్థలములలో తండ్రియే ప్రధానుడుగ గాన్పించును.

మానోవధీః పితరంమోతమాతరం॥

(తై. సం. 4-4-10-2)

అర్థము:—ఓ రుద్రుడా, మాతండ్రిని హింసింపకుము. మాతల్లిని హింసింపకుము.

అయినను మనుస్మృతి, గౌతమధర్మసూత్రములు మున్నగు స్మృతులలో తల్లియే ప్రధానురాలుగ చెప్పబడి యుండుటచే 'మాతృదేవోభవ, పితృదేవోభవ' యనుచోట క్రమము పాటింపబడినదనియే ప్రాచీనులు భావించినట్లు తెలియుచున్నది.

వేదకాలములో స్త్రీ ప్రకృతిపట్ల ప్రజలకుగల యభిప్రాయములు నాటి స్త్రీల స్థానమున కెల్లు కారణములైనవో యను నంశముపైన వివరింపబడిన సంగతులనుబట్టి తెలియగలదు.



## ద్వాదశాధ్యాయము



### వివిధవిషయములు

### వ్యభిచారము

వేదములలో వ్యభిచారము చాల గర్హింపబడినది. అది యొక మహాపాపకార్యముగ భావింపబడుచుండెను. ఈపాపమునకై ప్రాయశ్చిత్తమొకటి "స్త్రీలు—కర్మకాండ" యను ప్రకరణమున చూపబడినది. ఈక్రింది మంత్రమును బట్టి కూడ వ్యభిచారము మహాపాపమని తెలియగలదు.

యత్కుమారీమంద్రయతే యద్యోషిద్యత్పతివ్రతా।
అరిష్టం యత్కించక్రియతే అగ్నిస్తదనువేధతి॥

(తై. ఆ. 1–27)

భాష్యము:—కుమారీ వివాహరహితా స్త్రీ యత్పాపంపురుషసంభోగ రూపముద్దిశ్యమన్ద్రియదే హర్షంకరోతి, యోషిద్యువతిశ్చయత్పాపం పరపురుషసంభోగరూపముద్దిశ్య

మస్ధ్రియతే హ్యాప్టాభవతి, పతివ్రతాపిస్వభర్తృసంయోగాభా
వేన క్లిష్టాసతీయత్పాపం దేహత్యాగపాపముద్దిశ్యమన్ధ్రియ
తేయచ్చాన్యదపికించి దరిష్టం దానాదినారెష్టం వినాశయితు
మశక్యం మహాత్పాపమస్యాయజమానస్యయేన కేనాపిక్రియతే
తత్సర్వమియమారుణకేతుకోఽగ్నిరసువేధతి, అనుక్రమేణవినా
శయతి.

తాత్పర్యము :—పెండ్లికాని స్త్రీ పురుషసంయోగరూ
పమగు నేపాపమును చేయునో, పెండ్లియైన స్త్రీ పరపురుష
సంగమరూపమగు నేపాపముచేయునో, పతివ్రతయైన స్త్రీ
భర్త దూరదేశముననున్న కాలమున నింద్రియనిగ్రహము
చేసికొనలేక యాత్మహత్యను చేసికొనుట యను నేపాపమును
చేయునో, మఱియు నింకను దానాదులచే నశింపచేయుటకు
వీలుగాని యేపాపములున్నవో యాపాపముల నన్నిటిని నగ్ని
నశింపచేయును.

భర్తకంటె నితరుడగు పురుషునితో సంచరించుట
మహాపాప మనియు నవివాహిత యగు స్త్రీకి పురుషసంయో
గము నిషిద్ధమనియు పై వాక్యములవలన తెలియుచున్నది.
పాతివ్రత్యమును కాపాడుకొనుట కాత్మహత్య యొక్కొక్క
పుడు సాధనమనికూడ నిందువలన తెలియుచున్నది. అట్లైన
నావిధముగ నాత్మహత్య చేసికొనిన స్త్రీకి పాపము వచ్చునని
యిట నేల చెప్పబడినదనగా : ఇంద్రియనిగ్రహము లేకుండు
టయే యిచటి పాపహేతువుగాని యాత్మహత్య మాత్రము

పాపహేతువుగాదని చెప్పవలసియున్నది. ఇంద్రియనిగ్రహము లేక పశువాంఛకులోనైన స్త్రీకంటె నింద్రియనిగ్రహము లేనవు డాత్మహత్య గావించిన స్త్రీ చాల మేలని పైవాక్యము లనుబట్టి తేలుచునే యున్నది.

ఋగ్వేదములోను నితర వేదములలోను గూడ 'జార' శబ్దము 'మిండ' డను నర్థమున వాడబడినది. 'జార' శబ్దము 'జౄష్వయోహానౌ' అను ధాతువునుండి వచ్చుచున్నది. ఈ ధాతువునకు 'చెఱచుట' యర్థ మగుటచే జారు డనగా చెఱచువా డని యర్థము. దీనింబట్టి వ్యభిచారముచేసిన స్త్రీ చెడిపోయినదిగ భావింపవలసియున్నది. వ్యుత్పత్త్యర్థ మే యన్ని చోట్లను నిలచియుండునా యను ప్రశ్న రావచ్చును. అందులకు సమాధాన మేమన: అతిప్రాచీనతమమగు వేదములోని పదముల యర్థములను నిర్ణయించునపుడు మాత్రము వ్యుత్పత్తిని చూడవలసియుండును. ఏమన: కాలము గడచినకొలదియు శబ్దములు వ్యుత్పత్త్యర్థమునుండి తొలగవచ్చునుగాని ముందుగ కొంతకాలము వ్యుత్పత్త్యర్థములోనే వాడబడును గదా!

వ్యభిచారముచేసిన స్త్రీపురుషులు పాపులుగ భావింపబడుటయే కాక వ్యభిచారమువలన కలిగిన సంతానముకూడ నతిపాపిష్ఠముగ భావింపబడుచుండెను.

అవిజ్ఞాతేన గర్భేణ బ్రహ్మహా॥

(తై. సం. 6-5-10-౩)

అర్థము :—భర్తకు తెలియకుండ భార్యచేత చేసికొనబడిన గర్భమువలన జన్మించినవాడు వేదబాహ్యుడగుచున్నాడు.

వ్యభిచారమింతగ గర్హ్యముగను నందువలన జన్మించినవాడు గూడ నికృష్టుడుగను భావింపబడుచుండుటచేతనే వేదకాలములో కొందఱు వ్యభిచారిణులు బిడ్డలను పారవైచుచుండెడివారు. ఈ యంశమును దెల్పు వాక్య మొకటి 'వితంతువులు' అను ప్రకరణమున నీయబడినది.

వ్యభిచారమును వృత్తిగ పెట్టుకొనినవారు గూడ నాకాలములో నుండినట్లు తైత్తిరీయబ్రాహ్మణములోని యీ క్రింది వాక్యమువలన తెలియుచున్నది.

కామాయపుగ్ శ్చలూం॥ (3-4-1-1)

అర్థము :—కామదేవునికొఱకు వేశ్యను చంపవలెను.

అవివాహిత యగు స్త్రీ పురుషసంయోగమువలన పాపమును పొందునని పైన ఋజువు చేయబడియుండుటచే దానింబట్టి వేశ్యావృత్తి కూడ పాపావహమని తేలుచునేయున్నది. వేశ్య మిక్కిలి దుఃఖభాజన మని కూడ స్పష్టముగ చెప్పబడియున్నది.

పుగ్ శ్చల్యాంవై దేవాశ్శుచంన్యదధుః॥

(తై. బ్రా. 3-8-4-2)

అర్థము :—వ్యభిచారిణియందు దేవతలు దుఃఖము నుంచినారు.

ఈయన్ని యంశములను జూడ వ్యభిచార మిహాపర సుఖముల కాటంకకరమని వేదముల యభిప్రాయ మని తెలియుచున్నది.

మి థు న క ర్మ

పదిమంది పిల్లలు గలిగిన పిమ్మట భార్యాభర్తలు సంగమము మానుకొనవలెనని యీక్రింది వాక్యముచే సూచింపబడుచున్నది.

దశాస్యాం పుత్రానా ధేహి పతి మేకాదశంకృధి॥
(ఋ. సం. 10–85–45)

అర్థము:—ఓ యింద్రుడా, ఈమెయందు పదిమంది పిల్లలను కలిగింపుము. భర్తను పదునొకొండవవానినిగ చేయుము.

ఇచట 'దశ' యనునది యనియతాధికసంఖ్యను దెల్పునది కాక సరిగ పది యను నర్థమునే తెల్పును. ఏమన: పతిని పదునొకొండవవానిగ చేయుమని ముందు గాన్పించుచున్నది. పదిమందిపిల్లలు గల్గిన పిమ్మట భర్త పదునొకొండవ బిడ్డ యగును గాన నామె భర్తతో సంగమింపరాదని తేలుచున్నది.

అమావాస్యనాడును పూర్ణమాసినాడును సంభోగము కూడదనియు నాదినములలో స్త్రీని పొందినవాడు నిరిన్ద్రియుడగుననియు క్షయవ్యాధిని కూడ పొందవచ్చుననియు నీక్రింది మంత్రమువలన తెలియుచున్నది.

నామావాస్యాయాంచ పౌర్ణమాస్యాంచ స్త్రియముపే యాద్యదుపేయా న్నిరిన్ద్రియః స్యాత్సోమస్య వై రాజ్ఞోఽర్ధ మాసస్యరాత్రయః పత్నయ ఆసన్తాసామమావాస్యాంచ పౌర్ణ మాసీంచనోపైత్ తే ఏనమిభి సమనహ్యేతాంతం యక్ష్మ ఆర్ఛత్॥ (తై. సం. 2–5–6–4)

అర్థము :—అమావాస్యా పౌర్ణమాసిలలో స్త్రీని పొందకూడదు. పొందినవాడు నిరిన్ద్రియు డగును. సోమునకు శుక్లపక్ష కృష్ణపక్షరాత్రులు భార్యలుగ నుండెడివి. ఆత డమావాస్యా పౌర్ణమాసిలను పత్నులను పొందెడివాడుకాడు. వా రొకప్పు డాతనిని బలాత్కారముగ పట్టుకొనిరి. అంత నాతనికి క్షయవ్యాధి వచ్చెను.

రజస్వలయైయున్న స్త్రీతో సంగమింపరాదని యీ ప్రకరణములోనే స్పష్టపఱుపబడినది.

కొన్ని యజ్ఞదీక్షలలో నున్నపుడు కూడ మిథునకర్మ నిషిద్ధము.

నాగ్నించిత్వారామాముపేయాత్॥ (తై.సం. 1–6–8–3)

ఎవడు ప్రాథమికాగ్నిచయనము చేయుచున్నాడో యీ తడు భార్యను పొందగూడదు.

యజ్ఞములో వైకల్యము గల్గినచో తత్పరిహారమునకై దేవతలు పాటించు నియమములో నీక్రిందివి గలవు.

నానృతం వదేన్నమాగ్ సమశ్నీయాన్నస్త్రియ ముపే యాత్॥ (తై. సం. 2–5–5–6)

అర్థము:—అబద్ధ మాడరాదు. మాంసము తినరాదు. స్త్రీని పొందరాదు.

అనేకమంది భార్యలు గలవాడు వారందరిని సమముగ పొందుచుండవలసినదే కాని కొందఱి నుపేక్షించుట పాపావహమని వేదములోని యొక కథవలన తెలియుచున్నది. ఆ కథలోని ప్రకృతోపయుక్తమగు భాగ మిట్లున్నది.

ప్రజాపతే స్త్రయస్త్రింశద్దుహితర ఆసఁ తాః సోమాయ రాజ్ఞే దదాత్ తాసాగ్ం రోహిణీ ముపైత్ తా ఈర్ష్యన్తీః పునరగచ్ఛన్ తా అన్వైత్ తాః పునరయాచత తా అస్మైన పునరదాత్ సో బ్రవీదృతమమీష్వ యథా సమావచ్ఛ ఉపైష్యామ్యథ తే పునర్దాస్యామీతి సఋతమామీత్ తా అస్మై పునరదదాత్ తాసాగ్ం రోహిణీ మేవోపైత్తం యక్ష్మఆర్ఛద్రాజానం॥ (తై. సం. 2–3–5–1,2)

అర్థము:—ప్రజాపతికి ముప్పదిముగ్గురు కుమార్తెలుండిరి. ఆతడు వారిని సోమున కిచ్చెను. సోముడు ముప్పదిముగ్గురు భార్యలలో నొక్క రోహిణిని మాత్రమే పొందుచుండెను. మిగిలినవా రీర్ష్యను చెంది తండ్రిదగ్గఱకు పోయిరి. సోముడు వారిని వెంబడించి వారిని పంపుమని ప్రజాపతిని కోరెను. ప్రజాపతి పంపనివాడై యందఱను సమముగ చూతునని శపథము చేయుమని సోమునికోరెను. సోముడట్లుశపథముచేసెను. ప్రజాపతి వారి నాతని కిచ్చెను. చంద్రుడు మఱల యథా ప్రకారముగ రోహిణిని మాత్రమే పొందెను. అందుచే నాతనికి క్షయరోగము పట్టుకొనెను.

ఈకథను బట్టి యనేక భార్యలుగలవాడు కొందఱు భార్యల నుపేక్షించుట పాపావహమని స్పష్టముగ తెలియు చుండుటచే నొకే భార్యకలవా డామెతో సకాలమున సంగ మింపకుండుట పాపావహమను సంగతి దీనింబట్టి తేలు చున్నది.

గుహ్యాంగమందు రోమము లంకురింపని స్త్రీ భార్య యైనను కూడ నామెతో సంభోగము సలుపరాదను విషయము ఋగ్వేదములోని (ఋ. సం. 1–126–6,7 అను) రెండు ఋక్కులను బట్టి తెలియుచున్నది. పరిశిష్టములో 'వివాహ వయస్సు' అను శీర్షికక్రింద నీఋక్కుల యర్థము వ్రాయ బడును.

వావివరుసలు

మేనమామకూతును మేనత్తకూతును వివాహమాడుట యాకాలములో నున్నట్లు ఋగ్వేదఖిలసంహితలోని యీ క్రింది మాటలవలన తెలియుచున్నది.

ఆయాహీంద్ర పథిభిరీడి తేభిర్యజ్ఞ మిమంనో భాగధేయం జుషస్వ। తృప్తాంజహుర్మాతులస్యేవ యోషాభాగస్తే పైతృష్వ సేయీవపామివ॥

అర్థము:—ఓ యింద్రుడా, కొనియాడబడిన మార్గ ములచేత నీవురమ్ము. ఈ యజ్ఞసంబంధమైన భాగమును సేవింపుము. ఋత్విక్కులు తృప్తికరమైన వపనునీ కిచ్చు

చున్నారు. అవప యెట్లున్నదనగా : మేనమామకూతురు వలెను మేనత్తకూతురువలెను తృప్తికరముగానున్నది.

ఖిలసంహిత యర్వాచీనమని యందరు నంగీకరించిన విషయమే కావున నిది వేదకాలపు టాచారమునే తెలుపు చున్నదో లేక ఖిలసంహిత రచింపబడినినాటి యాచారమునే తెలుపుచున్నదో స్పష్టముగ చెప్పలేము.

సోదరిని వివాహమాడుట పరమనిషిద్ధమని ఋగ్వేద ములో నున్నది.

అఘాతాగచ్ఛ నుత్తరాయుగాని । యత్రజామయః కృణుతంనజామి । (ఋ. సం. 10-10-10)

అర్థము :—స్త్రీలు సోదరునిదక్క మఱొకని వివాహ మాడుచో కొంతకాలము బ్రతుకుదురు. (సోదరుని వివాహ మాడువారు మృత్యువాతఁ బడుదురు)

ఇంతమాత్రముచేత వేదకాలములో నివియే వావి వరుసలకు సంబంధించిన నియమములనియు నితర నియమ ములు లేవనియు భావింపరాదు. మిగిలిన నియమములుగల వేదభాగము లిపుడు మనకు లభ్యములు గాకుండి యుండ వచ్చును. లేదా ప్రసక్తిరామింజేసి యవి వదలబడియుండ వచ్చును.

వంధ్య

సంతానమును కనుటకే భార్య ముఖ్యముగ నుద్దేశింప బడినదని 'జాయ' యను పదమువలన తెలియుచున్నదని

యిదివఱలో (వివాహమను ప్రకరణములో) చూచియుంటిమి. భార్యకుగల 'జనిః' అను మఱొక పేరుకూడ నీయంశమునే బోధించును. జనయత్యపత్యమితిజనిః అనగా పిల్లలను కను చున్నది కావున నీమెకు జని యనిపేరు. స్త్రీసంతతికంటె పురుష సంతతి యెక్కుడు వాంఛనీయమే యైనను గొడ్రాలి కంటె స్త్రీసంతతినికనిన స్త్రీయే యెక్కుడు గౌరవార్హ యని యానాటియభిప్రాయము. ఏ సంతతిని కననిస్త్రీకి 'అసూః' అని పేరు. అట్టి స్త్రీకి యముడేగతి యను నర్థము వచ్చు నట్లు తైత్తిరీయబ్రాహ్మణములో నిట్లు చెప్పబడియున్నది.

యమాయాసూం॥ (3-4-10)

అర్థము:—గొడ్రాలిని యమునికొఱకు చంపవలెను.

ప్రజాయస్వ ప్రజాయాపుత్రికామే॥ (తై.మం. ప్ర. 1-11)

అర్థము:—పుత్రులను గోరుచున్న ఓ వధూ, నీవు సంతానరూపముగ జన్మింపుము.

అనుచోట స్త్రీ తానే సంతానరూపముగ పుట్టుచున్న దని చెప్పబడినది గావున సంతానము లేని స్త్రీ మరణించుచో నదే మరణించుటగాని ప్రజారూపమున నిచట నుండుట యనునది లేదు. కావుననే యట్టి స్త్రీకి యముడే గతి యను భావ మేర్పడినది.

గర్భిణి

స్త్రీలకు ప్రసవకాలము గొప్ప గండ మని వేద కాలమునగూడ భావింపబడుచుండెను. ఇతర వేదములలో

కంటె నథర్వవేదములో గర్భిణులకు సంబంధించిన మంత్రము లెక్కువగ నున్నవి. తల్లియు పిల్లయు గూడ ప్రసవసమయ మును సుఖముగ నతిక్రమింపవలెనని వేయిదేవతలకు మ్రొక్కుచుండిరి.

వషట్ తే పూషన్నస్మి న్సూతావర్యమాహోతా కృణో
తు వేధాః । సిస్రతాం నార్యృత ప్రజాతావిపర్వాణి
జిహతాంసూతవాఉ॥ (అ. సం. 1-2-11-1)

అర్థము:—ఓ. పూషా, ఈ ప్రసవసమయమందు అర్యముడును వేధయు, హోతలై నీకు వషట్కారముచే హావిస్సు నిచ్చెదరుగాక ! అందువలన నీగర్భిణి తిన్ననైన ప్రసవముగలదై తేరుకొనునుగాక! సుఖప్రసవము కలుగకుండ నాటంకములను గల్గించు సంధిబంధములు విడిపోయి సుఖ ప్రసవము కలుగుగాక !

ఇట్టి ప్రార్థన లథర్వవేదములో వందలకొలదిగనున్నవి.

సుఖప్రసవమునకై కేవలము దేవతలను ప్రార్థించుట యేకాక శస్త్రచికిత్సను కూడ నాదినములలో చేయుచుండిరి.

వి తేభినద్మిమేహనం వియోనిం విగవీని కే । విమాతరం
చపుత్రంచ జరాయుణావజరాయుపద్యతా॥
(అ. సం. 1-2-11-5)

అర్థము:—ఓగర్భిణి, నీమూత్రద్వారమును, యోనిని నిర్గమనప్రతిబంధకములగు ప్రక్క నుండు నాడులను ఛేదించు చున్నాను. ఎందుకనగా: అందువలన తల్లినుండి పుత్రుని

విడదీసినవాడనగుదును. మావినుండి కుమారుని విడదీసిన వాడనగుదును. అనంతరము మావిక్రిందపడిపోవును.

ఇట్టి మంత్రము లథర్వవేదమున నెన్నియేని కలవు.

పిశాచములు గర్భిణులకు గల్గించు బాధ లనేకములు వర్ణింపబడినవి. వాని నుండి గర్భిణులను కాపాడుటకు చాల మంత్రము లుద్దేశింపబడినవి.

గర్భాన్ ఖాద న్తి కేశవాస్తానితో నాశయామి॥

(అ. సం. 8-3-23)

అర్థము—గర్భములను తినునట్టి పిశాచముల నీగర్భిణి యొద్దనుండి పోగొట్టుచున్నాను.

గర్భిణియొక్క రంగునుగూర్చి తైత్తిరీయబ్రాహ్మణము లో నీక్రిందివిధముగ నున్నది.

ప్రజాపతి రకామయతప్రజాయేయేతి ।
సతపోతప్యత ।సో న్తర్వావభవత్ ।
నహరితశ్శ్యావోభవత్ ।
తస్మాత్స్త్రీ న్తర్వత్నీ । హరిణీసతీశ్యావాభవతి॥

(తై. బ్రా. 2-3-8-3)

అర్థము :—ప్రజాపతి ప్రజలను సృష్టింపగోరెను. అందులకై తపస్సు చేసెను. గర్భము ధరించెను. నీలశ్వేత మిశ్రవర్ణుడాయెను. అందుచే లోకములో గర్భిణి యట్టి వర్ణము గలదిగ నున్నది.

## ర జ స్వ ల

స్త్రీలు బహిష్ఠలగుటకు మూలహేతు వేదియో, రజస్వ్రలకాలమున వారనుసరింపవలసిన నియమము లేవియో మొన్నగు నంశములు తైత్తిరీయసంహితలో స్పష్టముగ చెప్ప బడి యున్నవి.

విశ్వరూపోవై త్వాష్ట్రః పురోహితో దేవానామాసీత్స్వ స్రీయోసురాణాం తస్యత్రీణిశీర్షాణ్యాసన్ త్సోమపానగ్ సురా పానమన్నాదనగ్ సప్రత్యక్షం దేవేభ్యోభాగమవదత్పరోక్షమ సురేభ్యస్సర్వస్మైవై ప్రత్యక్షం భాగంవదన్తి యస్మాఏవపరో క్షం వదన్తి తస్యభాగఉదిత స్తస్మాదింద్రోబిభే దీదీదృఙ్వైరా ష్ట్రం విపర్యావర్తయతీతి తస్యవజ్రమాదాయశీర్షాణ్యాచ్ఛినద్య త్సోమపానమాసీత్సకపింజలో భవద్యత్సురాపానగ్ సకలవి ఙ్కోయదన్నాదనగ్ సతిత్తిరి స్తస్యాం జలినా బ్రహ్మహత్యా ముపాగృహ్ణాత్తాగ్ సంవత్సరమబిభ స్తం భూతాన్యభ్యక్రోశన్ బ్రహ్మహన్నితి సపృథివీముపాసీదదస్యై బ్రహ్మహత్యాయై తృతీయం ప్రతిగృహాణేతిసాబ్రవీద్వరం వృణైఖాతాత్పరాభ విష్యన్తీమన్యే తతోమాపరా భూవమితి పురా తేసంవత్సరా దపిరోహాదిత్యబ్రవీ త్తస్మాత్పురా సంవత్సరాత్పృథివ్యైఖాతమ పిరోహతి వారేవృతగ్గ్ హ్యస్యైతృతీయం బ్రహ్మహత్యాయై ప్రత్యగృహ్ణా త్తత్స్వకృతమిరిణమ భవ త్తస్మాదాహితాగ్నిశ్శ్ర ద్ధాదేవః స్వకృతఇరిణేనావస్యేద్బ్రహ్మహత్యాయై ఏషవర్ణ స్పవనస్పతీనుపాసీదదస్యైబ్రహ్మహత్యాయై తృతీయం ప్రతి

గృహ్ణీతేతి తేఽబ్రువన్వరం వృణామహై ఖాతాత్పరా భవిష్యన్తో
మన్యామహే తతో మా పరాభూమేత్యా వ్రశ్చనాద్వో భూ
యాగ్ంస ఉత్తిష్ఠానిత్యబ్రవీత్తస్మాదావ్రశ్చనాద్వృక్షాణాం భూ
యాగ్ంస ఉత్తిష్ఠన్తి వారేవృతగ్గ్ హ్యేషాం తృతీయం బ్రహ్మహ
త్యాయై ప్రత్యగృహ్ణంత్స నిర్యాసోఽభవత్తస్మాన్నిర్యాసస్య నా
శ్యం బ్రహ్మహత్యాయై హ్యేష వర్ణోఽథో ఖలు య ఏవ లోహితో
యో వాఽఽవ్రశ్చనాన్నిర్యేషతి తస్య నాశ్యం కామమన్యస్య స స్త్రీ
షగ్ం సాదముపాసీదదస్యై బ్రహ్మహత్యాయై తృతీయం ప్రతి
గృహ్ణీతేతి తా అబ్రువన్వరం వృణామహా ఋత్వియాత్ప్రజాం
విందామహై కామమా విజనితోః సంభవామేతి తస్మాదృత్వి
యాత్స్త్రియః ప్రజాం విందంతే కామమా విజనితోః సంభవన్తి
వారేవృతగ్గ్ హ్యాసాం తృతీయం బ్రహ్మహత్యాయై ప్రత్యగృ
హ్ణన్ త్సా మలవద్వాసా అభవత్తస్మాన్మలవద్వాససా న సం
వదేత న సహాసీత నాస్యా అన్నమద్యాద్బ్రహ్మహత్యాయై హ్యే
షా వర్ణం ప్రతిముచ్యాస్తేఽథో ఖల్వాహురభ్యంజనం వావ స్త్రి
యా అన్నమభ్యంజనమేవ న ప్రతిగృహ్యం కామమన్యదితి
యాం మలవద్వాససగ్ం సంభవన్తి యస్తతో జాయతే సోఽభిశస్తో
యామరణ్యే తస్యై స్తేనో యాం పరాచీం తస్యై హ్రీతముఖ్యప
గల్భో యా స్నాతి తస్యా అప్సు మారుకో యాభ్యంక్తే తస్యై దు
శ్చర్మా యా ప్రలిఖతే తస్యై ఖలతిరపమారీ యాంక్తే తస్యై
కాణో యా దతో ధావతే తస్యై శ్యావదన్ యా నఖాని నికృన్త
తే తస్యై కునఖీ యా కృణత్తి తస్యై క్లీబః యా రజ్జుగ్ం సృజతి

తస్యాఉద్భం ధుకోయాపర్ణేనపి బతితస్యాఉన్మాదుకోయాఖర్వే ణాపిబతితస్యైఖరతి స్త్రిస్రోరాత్రేర్వ్రితం చరేదం దజలినావాప్పి చేదఖర్వేణవాపాత్రేణప్రజాయై గోపీథాయ.

(తై. సం. 2–5–1)

ఈ యనువాకములో రజస్వలాస్త్రీకి సంబంధింపని భాగమునకు సంగ్రహముగను నామెకు సంబంధించిన భాగ మునకు పూర్తిగను తాత్పర్య మీక్రింద వ్రాయబడుచున్నది:

విశ్వరూపుడనువాడు దేవతలను మోసగించుటచే నింద్రు డాతని సంహరించెను. అందువలన నింద్రునకు బ్రహ్మ హత్యా పాపము గలిగినది. ఈపాపములో మూడవ వంతును భూమి గ్రహించెను. మఱొక మూడవ వంతును వృక్షములు గ్రహించినవి. మిగిలిన మూడవవంతును గ్రహింపవలసినదని స్త్రీ లను కోరుటకై యాతడు స్త్రీల సభకు వచ్చెను. ఆతని కోరి కను విని స్త్రీ లీవిధముగ వరమును కోరిరి "ఋతుసంబంధ మగు స్రావమువలన మేము సంతానమును పొందుదుముగాక! గర్భవతుల మైనపుడు ప్రసవమగువఱకును సంభోగము ననుభ వింతుముగాక!" ఇంద్రు డావరము నిచ్చెను. స్త్రీలకు బ్రహ్మ హత్యాపాపము వచ్చెను. ఆపాపమే రజస్వల. కావున రజస్వ లతో మాట్లాడరాదు. ఆమె కూర్చున్నచోట కూర్చుండ రాదు. ఆమె యన్నము తినరాదు. ఏమన: రజస్వలాస్త్రీ బ్రహ్మహత్యారూపమును ధరించుచున్నది. స్త్రీలకు అభ్యం

జనమే ఆన్నస్థానము గావున నామె సంబంధమగు తైలాదిక మునే గ్రహింపరాదని కొందఱు చెప్పుచున్నారు.

రజస్వలయైన స్త్రీతో సంగమింపగా జన్మించినవాడు మిథ్యాపవాదములతో కూడుకొనినవాడగును. అరణ్యామం దీమెతో సంగమింపగా జన్మించినవాడు దొంగ యగును. ఉచ్చారణభయముచేతగాని లజ్జచేతగాని ముఖమును వెనుకకు త్రిప్పుకొనిన రజస్వలతో సంగమింపగా జన్మించినవాడు సభలో ముఖము ఎత్తి చూపలేనివాడుగను సభలో మాట్లాడలేని వాడుగను నుండును. ఎవతె రజస్వలయై యున్న దినములలో స్నానముచేయునో యామెకు నీటిలో చనిపోవు కుమారుడు కలుగును. ఎవతె అభ్యంజనము చేసికొనునో యామెకు దుశ్చ ర్మడు (కుష్ఠి) జన్మించును. గోడలమీద బొమ్మలు వేయుట మొదలగునవి చేయునామెకు బట్టతలగలవాడును దుర్మరణము గలవాడును జన్మించును. కాటుక పెట్టుకొనునామెకు గ్రుడ్డి వాడు పుట్టును. దంతధావనము చేసికొనునామెకు మలినదంత ములు గలవాడు జన్మించును. గోళ్లు గిల్లుకొనునామెకు పిప్పి గోళ్లుకలవాడు జన్మించును. గడ్డి మొదలగునానిని తెంపు నామెకు నపుంసకుడు జన్మించును. త్రాళ్లుపేనునామెకు ఉరి పెట్టుకు చచ్చువాడు జన్మించును. ఆకుతో నీరు త్రాగుదానికి పిచ్చివాడు జన్మించును. పొట్టిచెంబుతో త్రాగు నామెకు పొట్టివాడుజన్మించును. రజస్వలయేతద్వర్జనరూపమైన త్రిరాత్ర వ్రతమును ఆచరింపవలెను. దోసెలితోగానిపొడవైన పాత్రతో

గానినీళ్ళు త్రాగవలెను. పుట్టబోవు సంతానముయొక్క రక్షణ కొఱకీవ్రతము చేయవలెను.

(తై. సం. 2–5–1) రజస్వలాస్త్రీ కర్మలో గూడ పాల్గొనగూడదు. తైత్తిరీయబ్రాహ్మణములో నిట్లున్నది.

అథో వా ఏతస్య యజ్ఞస్య మీయతే। యస్య వ్రత్యేహన్ పత్న్యనాలంభుకా భవతి తామపరుధ్య యజేత॥

(తై. బ్రా. 3–7–1–9)

అర్థము :—యాగానుష్ఠానదినమందు యేయజమాని భార్య రజస్వల యగుచున్నదో యాతని యజ్ఞములో సగము నశించుచున్నది. అప్పు డామెను బయటనుంచి యజ్ఞము సాగింపవలెను.

వే ష ము

కట్టు, జుట్టు, బొట్టు మున్నగువాని సహాయమున సౌందర్యమును తెచ్చిపెట్టుకొనుట వేదకాలపు స్త్రీలకు గూడ నాచారమై యుండెను.

ఉన్నితో చేయబడిన వస్త్రములనే నాటి ప్రజలు తఱచుగ ధరించెడివారని తోచుచున్నది. ఏమన ఋగ్వేదము లోను నితరవేదభాగములలోను గూడ 'ఊర్ణము' యొక్క ప్రశంస తఱచుగ వచ్చుచున్నది.

స్త్రీణాం కర్మ యదూర్ణసూత్రం

అను శతపథబ్రాహ్మణవాక్యము 'స్త్రీలు—విద్యలు ; వృత్తులు' అను ప్రకరణమున వివరింపబడినది. మెత్తనియూలును

చేయుట కూడ గలదు. 'ఊర్ణమ్రద'యను పదము (ఋ. సం. 5-5-4) ఈవిషయమును తెల్పును. యజ్ఞదీక్షాసమయమున మాత్రము కుశతో చేయబడిన వస్త్రములను యజమానపత్ని ధరింపవలెనని శతపథబ్రాహ్మణము (5-2-1-8) లో నున్నది.

నాభియొద్ద ముడివైచి వస్త్రము కట్టుకొనుటయే కాని కట్టబడిన పరికిణీలు మున్నగునవి ధరించుట వేదకాలములో నున్నట్లు గాన్పింపదు. అట్లు ముడివైచి కట్టుకొను సంగతి శతపథబ్రాహ్మణములోని (1-2-4-13) 'నీవి' యను పదముచే తెలియుచున్నది. ఆముడివేయబడిన వస్త్రముగాని మఱొకవస్త్రముగాని పైటగ వేసికొనెడివారు. యుద్ధము చేయుచున్న ఇంద్రసేనయొక్క పైట గాలిచేత పైకెగురగొట్టబడుచున్నట్లు ఋక్సంహితలో (10-102-6) 'ఉత్స్మవాతో వహతివాసః' అనుచోట చెప్పబడినది. దీనియర్థము 'స్త్రీలు-బాహ్యప్రపంచము' అను ప్రకరణమున తెలుపబడినది. 'వాసః' యని మాత్రమే యిట నున్నను నిది పైటయనియే చెప్పవగును. లేకున్న ఎగురగొట్టబడుచున్నట్లు అని చెప్పుటకు వీలుండదు.

స్త్రీల వస్త్రములలో ననేకవిధములగునవి యుండెడివనియు మార్దవము, అందము మున్నగు గుణములలో ననేకభేదములు గల వస్త్రము లుండెడివనియు తెలియుచున్నది. భర్తను గోరుచున్న స్త్రీ యాతని నాకర్షించుటకై 'మంచి వస్త్రములను ధరించినట్లు (సువాసాః) ఋగ్వేదములో (4-3-2) నున్నట్లిదివఱలో చూచియుంటిమి.

నాటి స్త్రీలు కేశపాశములను గూడ వివిధపద్ధతులలో నమర్చుకొనెడివారు. సావిత్రి 'స్వోపశ' యని చెప్పబడినది. అనగా మంచి ఓపశముగలది యని యర్థము. ఓపశమనగా: ఈ పదుపశేతేత్యోపశం (కొంచెము పైకి నంపబడినది) అని యర్థము. సావిత్రి కేశములను పైకి కట్టుకొనుచుండెడి దని దీనివలన తెలియుచున్నది. కేశములను విరియబోసికొను టయు నుండెను. రోదసికి 'విషితస్తుకా' యను విశేషణము వాడబడినది. (ఋ. సం. 1—167—5) సాయణులు దీనికి 'విశిష్ట కేశసంఘా' (మంచి జుట్టుగలది) యని గాని 'విప్రకీర్ణ కేశ సంఘా' (విరియబోసికొనబడిన జుట్టుగలది) యని గాని యర్థము చెప్పవలెననిరి. జుట్టు పెద్దదిగ నుండుట స్త్రీకి మంచి యలంకారముగ భావింపబడుచుండెను. ఇంద్రుడు కోపగించి యున్న భార్య నోదార్చుచు నామెకు పృథుష్టో యను విశేష ణము (ఋ.స. 10-86-8) వాడినాడు 'పృథు కేశసంఘా తే' (పెద్ద జుట్టుగలదానా) యని సాయణులు దీనికర్థము వ్రాసియున్నారు.

ప్రస్తుతము నేపాలుదేశపుస్త్రీలు కొందఱు కేశములను మెలిపెట్టి పైకి చుట్టుసట్లుసు నేడు మహాశివుని పటములలో నాతని కారోపింపబడుచున్న కపర్దమను పేరుగల కేశపాశమును పోలునట్లుగాను వేదకాలములో కొందఱు స్త్రీలు కేశముల నమర్చుకొనెడివారు.

సినీవాలీ సుకర్దా॥ (తై. సం. 4—1—5—3)

అర్థము:—సినీవాలి యను దేవత మంచి కపర్దము గలది.

కంశిరః పిపర్తిపూరయతీతి కపర్దః అని లింగాభట్టీయము. శిరస్సును నింపుకొనియుండునది గావున కపర్దమని దీని యర్థము.

స్త్రీల యాభరణముల పరిశంస యిదివఱలో నీగ్రంథమున చాలసారులు సేయబడినది. స్త్రీలు స్వర్ణాభరణములను ధరించెడివారని చూపబడినది. వేదములలో ననేక స్థలములలో వివిధములగు నాభరణములు పేర్కొనబడినవి. కాని యవి స్త్రీలుమాత్రమే వాడునవిగావు. పురుషులు వాడెడి యాభరణములే యనేకము లున్నట్లు తెలియుండగ నిక స్త్రీలెన్ని వాడెడువారో మనము చెప్పలేము. మెడలో గట్టుకొను నిష్కమను నాభరణమును, రుక్మమను నాభరణమును చేతికడియమని చెప్పదగు ఖాదిష్టమను నాభరణమును పురుషులు ధరించునవిగ చెప్పబడినవి. పుష్పమాలలను గూడ పురుషులు ధరించుచుండినట్లు తెలియుచున్నది. స్త్రీలు విశేషముగ నాభరణములను ధరించెడువారని పూర్వప్రకరణములలో ఋజువు పఱుపబడియుండుటచేతను పురుషులీ యాయాభరణములను ధరించుచుండెడివారని తెలియుచుండుటచేతను స్త్రీలు వీనినిగాని వీనితో బోలిన మఱికొన్నిటిగాని ధరించుటయేకాక యింకను ననేకములగు నితరాభరణములను ధరించెడివారని చెప్పవచ్చును.

స్త్రీలు పుష్పములనుకూడ ధరించెడివారని పైన చెప్ప బడిన సినీవాలికి నాస్థలముననే వాడబడిన 'సుకురారీ' (మంచి మొగ్గలుగలది) అను విశేషణమునుబట్టి తెలియుచున్నది.

స్త్రీలు తిలకమును ధరించుట వేదకాలమునుండియు నున్నది.

సమ్భారైశ్చపత్నిభిశ్చముఖేలంకృత్య॥

(తై. బ్రా. 2-3-10-44)

అర్థము:—సావిత్రి సమ్భారమంత్రములను పత్నీ మంత్రములను చెప్పుకొనుచు (స్థాగరమును) ముఖములో నలంకరించుకొనెను.

పై వాక్యములో ముఖమును దలంకరించుకొనెననియే యున్నది. 'స్థాగరమును' అనునది యీక్రింది వాక్యమునుండి యధ్యాహారము గావలెను.

ఉహస్థాగర మలంకారం కల్పయిత్వా॥

(తై. బ్రా. 2-3-10-44)

అర్థము:—సావిత్రికి తండ్రి స్థాగరముచేత నలంకా రము చేసెను.

స్థాగర మనగా నొక సుగంధద్రవ్యము. అట్టి సుగంధ ద్రవ్యముతో వేదకాలపుస్త్రీలు తిలకము ధరించెడివారని చెప్పుటచే వారి శృంగారలాలసత తెలియుచున్నది.



# త్రయోదశాధ్యాయము.



## పరిశిష్టము.

పూర్వాధ్యాయములలో చెప్పవలసియుండి పొరబాటున వదలివేయబడిన యంశములను పాఠకులయెదుట బెట్టుట యీ యధ్యాయముయొక్క యుద్దేశము.

### వివాహవయస్సు,

వివాహమను ప్రకరణములో వేదకాలములో యువతీవివాహములే యుండెడివని ఋజువుచేయబడినది. వేదకాలములో యువతీవివాహములు లేనేలేవనియు శిష్టులందఱునుగూడ బాలికావివాహములనే చేసెడి వారనియు చెప్పు పండితులు కొందఱు గలరు. ఏయే హేతువులచేత వేదకాలములో యువతీవివాహములే యుండెడివని మేమిదివఱలో ఋజువుచేసి యుంటిమో యా హేతువులలో నొక్కటియుగూడ నిలచునది గాదని వారియభిప్రాయము. వారి వాదములోకూడ కొంత బలమున్నదని యంగీకరింప వలసియున్నది. సత్యమును లోకమునకెఱుకపరచుటయే ప్రధానముగా పెట్టుకొనిన యీగ్రంథములో నట్టిబలీయములగు వాదములకు తావొసంగకుండుట న్యాయముకాదు కావున వారివాదమును సంగ్రహముగనీ క్రింద నిచ్చుచున్నాము. ఈరెండు వాదములను పూర్తిగపరిశీలించి పాఠకులీరెంటిలో దేనినో యొకదానిని పరిగ్రహింతురుగాక! ఆవాదముయొక్క సారాంశమెట్లున్నదన :—

(1) కన్యలు యువకుల నాహ్వానించుచున్నారని చెప్పినంతమాత్రమున వారు యువతులని తేలదు. ఏమన: కన్యయున్నచోటుకు వివాహముకావలసిన యువకుడు పోయిగాని యెవరినైనను పంపిగాని వివాహ ప్రయత్నము చేయును. కావున వాగ్రూపముగ కాక కేవలము తన మునికి చేతనే కన్య యువకుని తనయొద్ద కాహ్వానించుచున్నది. బాలికావివాహము లాచరణలోనున్న యీదినములలోగూడ నిట్టిపని జరుగుచున్నది గదా! (2) సూర్యకు భర్తకావలెనని కోరుచున్నదని చెప్పినంతమాత్రమున నామె యువతియని తేలదు. ఏమన: అతి బాల్యమునుండియుకూడ స్త్రీపురుషులకు వైవాహికవాంఛ యుండవచ్చును. (3) పెండ్లికొమార్తె "ప్రథర్వ్య" యని చెప్పుటచేత నామె యువతియని తేలదు. తైత్తిరీయ మంత్రప్రశ్నలకు భాష్యము వ్రాయుచు హరదత్తుడు "ప్రథర్వ్య" యనగా ప్రథమవయస్సులో నున్నది యని అర్థముచెప్పినాడు. అనగా బాలికయని యర్థము. సాయణాచార్యులు చెప్పిన పెద్దనితంబములు గలది యనునర్థము గూడ దీనితో విరోధింపనవసరము లేదు. ఏమన: సాముద్రికశాస్త్రమునుబట్టి పృథునితంబములుండుట స్త్రీకి మంచిలక్షణము. అదియామెకు సౌందర్యము నొసంగును. ఈపిల్లకు కళ్లుపెద్దవని చెప్పినంతమాత్రమున ఆమె యువతికానక్కఱలేదుగదా! ఇది నితంబములవిషయములలో మాత్రమేల వర్తింపకూడదు.

(4) అవ్యక్తగాలగు బాలికను భర్తతో కాపురముచేయించునాచారము వేదకాలములో నుండెనని చెప్పుట యానాటి నాగరికతకు మహాపచారము చేయుటయే యగుననియు, నట్టిబాలిక గృహిణియగుట శశవిషాణతుల్యమనియు చెప్పుట సత్యమునకు విరుద్ధము. ఏమన: భావయవ్యుడను రాజును, ఉషస్తియను బ్రాహ్మణుడునుగూడ నవ్యక్తగాండ్రగు భార్యలతో కాపురముచేయుచుండినట్లు వేదములో నున్నది. ఆబాలికలు గృహిణులుగనే యుండిరి. ఉషస్తి యనునాతనియింట నతనిబాలికయగు భార్య తప్ప మరియొకస్త్రీ లేనేలేదని తెలియుచున్నది. ఇట్టిబాలికలతో కాపురముచేయుట యనాగరికమెన్నటికినిగాదు. వారితో మిధునకర్మచేయుచు

కాపురముచేయుట యనాగరికమే యగును. వ్యస్తరాంధ్రగు వఱికగు
వారితో భర్తలు మిథునకర్మ సలిపెడివారుకారని స్పష్టముగ తెలియుచునే
యున్నది. ఈపైనచెప్పబడిన యంశముల నన్నిటిని స్పష్టపఱచుటకై భావ
యవ్యుడును ఉషస్తియు నవ్యస్తరాంధ్రగు బాలికలతో కాపురముచేయుట
యను నంశమునకు సంబంధించిన మంత్రములను వానివివరణములును క్రింద
నీయబడినవి.

ఋగ్వేదములోని యీక్రిందిఋక్కులను పరికింతము.

ఆగధితాపరిగధితా యాకశీకేవజంగహే దదాతిమహ్యం యాదురీయా
శూనాం భోజ్యాశతా॥

ఉపోపమే పరామృశ మామేదభ్రాణిమన్యథాః। సర్వాహమస్మిరోమ
శాగం ధారీణామివావికా॥ (ఋ. సం. 1–126–6, 7)

సాయణాచార్యులీ ఋక్కులకుచెప్పిన ప్రకరణమీవిధముగనున్నది.

“భావయవ్యుడను రాజునకు బాలికయగు భార్యయుండెను. ఆ
భార్య యొకనాడాతని సంభోగమునకు పిలచెను. ఆమెయింకను యువతి
కాలేదను భావముతోనున్న భావయవ్యుడు ఆమెనిక్రిందివిధముగా పరిహ
సించెను.”

“ఈమె నా ... త బాగుగ పట్టుకొనబడినది. పూర్తిగ పట్టుకొనబడి
నది. ఆడుముంగిస మగముంగిసను పట్టుకొని వదలకుండునట్లీమె నన్నుపట్టు
కొని వదలుటలేదు. భోగయోగ్యయైన యీమె విశేషముగ రేతస్సుతో
కూడుకొనినదై నాకు వందలకొలది సంభోగముల నిచ్చుచున్నది.”
ఇదిపైనసీయబడిన రెండుఋక్కులలో మొదటిదానికర్థము. భోగమున
కయోగ్యయని తాను భావించుచున్న స్త్రీ తన్ను భోగమునకు పిలచుటచే
నామెను “భోజ్యా” మన్నగు విశేషణములను వాడియు నితరవిధములు
గను భావయవ్యుడు పరిహసించినాడు. లోకములో నిరుపేదయైనవాడొ
కడు లేనగ్రామములోనివారి కందఱికిని మృష్టాన్నపానాదులిడి సంతర్ప
ణము చేసెదనని చెప్పుచో వినువారలు “ఓహో! బహుబాగుగా పెట్టె
దవు. నీవేపెట్టవలెను. మేమే తినవలెను, మాకు కడుపునిండిపోయినది.”

అని యెట్లుపరిహాసింతురో యట్లే భోగానర్హాభోగమనకు పిలచినపుడు భావయవ్యుడు పరిహాసించినాడు.

అందుపైన క్రొత్తగా రజస్వలయై గుహ్యేంద్రియముపై రోమములు మొలచిన సార్థకనామ్నియగు రోమశభర్తకు తాను క్రొత్తగా యౌవనవతి యగుటను తెల్పుచు నీక్రిందివిధముగా నన్నది.

"ఓపతీ! నాయొద్దకువచ్చి నాయంగములను స్పృశింపుము. బాగుగాస్పృశింపుము. నాయంగములు చిన్నవని భావింపకుము. నేను బహురోమములు గలదాననైయున్నాను. సంపూర్ణములైన యవయవములు గలదాననైయున్నాను. గంధారదేశమందుండు గొఱ్ఱెలేవిధముగ రోమములుగలవో నేను నదేవిధముగ రోమములుగలదానను. (లేదా, 'గంధారి' లనగా గర్భధారిణులు. వారి యవయవముపలె నాయవయవము విస్తరించి యున్నదని యర్థము.)

ఇది పైబుక్కులలో రెండవదాని కర్థము. ఇచ్చట రోమశభర్త చేసిన పరిహాసములో ముక్కుముక్కకును సమాధానము చెప్పినదా యను నట్లు మాట్లాడినది. స్త్రీలకు గుహ్యాంగమందు రోమోత్పత్తి యగువఱకును సంభోగార్హత లేదనువిషయమిచట జ్ఞప్తియందుంచుకొనవలయును. కావు ననే యీామె తనసంభోగార్హతను స్థాపించుకొనుటకు రోమశాత్వమును స్థాపించుకొనుచున్నది. (లేదా, స్త్రీ రజస్వల యగువఱకును సంభోగార్హ కాదు. రజస్వలయగుటతో నవయవము విస్తృతమగును. కావున రోమశ తనయవయవము విస్తృతమైనదను సంగతిని స్వయముగా చూచుకొన వచ్చునని భర్తతో చెప్పుచున్నది.)

ఇంత అశ్లీలముగ మాట్లాడుట స్త్రీకి తగునాయను ప్రశ్నరావచ్చును. వేదవాఙ్మయము నొకపర్యాయము పరికించినవారికి మంత్రకర్త దృష్టిలో నశ్లీలమనునది లేనేలేదని తెలియగలదు.

భావయవ్యుడు రజస్వలకాని పిల్లనే పెండ్లిచేసికొనెననియు పిమ్మట నామె రజస్వలయయ్యెననియు నీవిధముగ తెలియుచున్నది.

రజస్వలకాకుండ బాలికగనే యున్నభార్యగల ఉషస్తిచాక్రాయణుడనునాతడు ఛాందోగ్యోపనిషత్తులో పేర్కొనబడియున్నాడు.

మటచీహతేషు కురుష్వాటిక్యా సహజాయయోషస్తిర్హచాక్రాయణ ఇభ్యగ్రామేప్రద్రాణక ఉవాస॥ (ఛాం. ఉ. 1–10–1)

అర్థము :—పిడుగులు పడుటచే దుర్భిక్షమునొందిన కురుదేశమునందలి యిభ్యగ్రామములో చక్రునికుమారుడగు నుషస్తియనునాతడు స్తనాది స్త్రీచిహ్నములింకను కలుగని భార్యతోకూడి నివసించుచు నన్నములేకపోవుటచే చాలదుర్గతిలోనుండెను.

పైనున్న యుపనిషద్వాక్యములోని "ఆటిక్యా" అనునదియే మనకిప్పుడు కావలసినపదము. ఆచార్యులవారీ పదమునకు భాష్యమువ్రాయుచు "అనుపజాత పయోధరాది స్త్రీవ్యంజనయా" అని వ్రాసినారు. అనగా పుట్టని స్తనాదులగు స్త్రీచిహ్నలుగలది యని యర్థము. వాచస్పత్యములోకూడ ఆటికీశబ్దమున కీయర్థమే యీయబడినది. అది యిట్లున్నది. "ఆటికీ స్త్రీ ఆటం ఆటనమర్హతి అణ్, జీప్। గృహాద్బహిర్గంతు మర్హాయాం, అనుపజాతపయోధరాయాం స్త్రీయాం॥ "స్తనాది స్త్రీచిహ్నలు కలుగనంతకాలము స్త్రీ బయటతిరుగవచ్చును గాన నట్టి స్త్రీయే ఆటికి" అని పైవాచస్పత్యములోని వాక్యముల కర్థము. ,అట' ధాతువునకు ,తిరుగుట' యనియర్థము.

అట్టి చిన్నపిల్లతో చాక్రాయణుడు కాపురము చేయుచున్నట్లు పైయుపనిషద్వాక్యమువలన తెలియనున్నది. ఈవిధముగఁ జూడ వేదకాలములో స్త్రీలకు యౌవనమువచ్చుటకు పూర్వమే యనగా రజస్వలలగుటకు పూర్వమే వివాహమగుటయు వివాహమగుచుండగనే భర్తృగృహమునకు కాపురమున కేగుటయు నుండెడివనియు సమావేశనముమాత్రము గుహ్యాంగమందు రోమోత్పత్తియయిన పిమ్మటనేకాని జరిగెడిదికాదనియు తెలియుచున్నది.

(రి) అట్లగుచో "భర్తతో స్వశరీరమునుకలుపుము" అని వధువుపదేశింపబడుటలో నర్థమేమనగా స్వపనివెంటనే జరుగవలసినది కాదనియు

నర్వాతవచ్చినపిమ్మటనే భర్తతో కూడవలసినదనియే యిందలి తాత్పర్య మనియు చెప్పవలసియున్నది. అట్లుకానిచో వధూవరులకుఁ జేయబడు నాశీర్వచనములలో పుత్రులతోను మనుమలతోను క్రీడించుచుండుడు" అనుదానికికూడ వెంటనే మనుమలెట్లుకలుగుదురని ప్రశ్నింపవచ్చును.

(6) వధువు వరుని యాయువులను కోరుటయు వరునినుండి సంతానమును కోరుటయు ననునవి యామెయవ్యక్తురాలగుచో నెట్లు సాధ్యములగునను ప్రశ్న రావచ్చును: ఇందులకుసమాధానమేమన: ముందురాబోవు దానినిప్పుడు జరుగుచున్నట్లే భావించుట వేదములలో చాలచోట్లనున్నది. వివాహములో (ఋ. సం. 10-85-41) వరుడిట్లు చెప్పును.

సోమోఽదదద్గంధర్వాయ గంధర్వోఽదద దగ్నయే। రయించపుత్రాగ్
శ్చాదాదగ్నిర్మహ్యమథోఇమాం॥

అర్థము:—ఈమెనుముందుగా సోముడు గంధర్వునకిచ్చెను. గంధర్వుడగ్నికిచ్చెను. అగ్ని యీమెను ధనమును పుత్రులను నాకిచ్చెను.

ఇచ్చట అగ్ని వరునకు భార్యను పుత్రులను నిచ్చెననియున్నది. ఇంకను పెండ్లియె కాకుండగా పుత్రులెటనుండి వచ్చినారని యడుగవచ్చునుగదా! ముందురాబోవు పుత్రులిప్పుడే తనకులభించిరని భావించుకొని వరుడు మాట్లాడుచున్నాడు.

ఈవిధముగానే భార్యముందుముందు దేమికోరునో యేయేవిధముగ నుండునో యదియంతయు వివాహసమయమందు జరుగుచున్నట్లే భావింపబడుచున్నది.

(7) వరునిపై వధువుయొక్క వస్త్రముపడుట యనుదానికి ప్రసక్తి కలుగుటచే వివాహమైనతోడనే గర్భాధానమగుచుండెనని చెప్పుటకు వీలులేదు బ్రహ్మచర్యము నవలంబించుచుకూడ భార్యాభర్త లేకశయ్యయందు రాత్రులను గడపవచ్చును.

(8) కృత్యయనుదేవత పోయినదగుచుండగా ననగా వివాహమికపూర్తియగునను సమయమున వరుడు సంసారబంధములందు బద్ధుడగుచున్నాడని చెప్పినంతమాత్రముచేత వధువు యువతికానక్కరలేదు. ఉషస్తిచా

క్రాయణుడు సంసారబంధములందు బద్ధుడుకాలేదా! అతనిభార్య యువతియా ?

పైన వివరింపబడిన యంశముల నన్నిటినిబట్టిచూచిన వేదకాలములో యువతీవివాహము లుండెనని చెప్పుటకు నాధారములులేవనియు, మిక్కిలి బాలికావివాహములే యానాడుండెనని చెప్పుటకు వీలున్నదనియు తేలుచున్నది. ఈసిద్ధాంతమును బలపరచుటకు తైత్తిరీయసంహితలో నొక్కచోట గాన్పించుచున్న కన్యాలక్షణములే సాక్ష్యములు. కన్య యవికావలెననియు నివిగావలెననియు నేడ్చుచు తలిదండ్రులచే నోదార్చబడుచున్నట్లు తైత్తిరీయసంహితలోని వాక్యములవలన తెలియుచున్నది.

ఉదప్రుతోమరుద స్తాగ్ ఇయ ర్త వృష్టింయే విశ్వేమరుతోజున న్తి। క్రోశాతిగర్ధాక న్యేవతున్నా పేరుంతుంజానా॥ (తై. సం. 3_1_11_8)

అర్థము :—ఓఋత్విగ్యజమానులారా, మీరు ఉదకదాతలగు మరుద్దేవతలను ప్రార్థింపుడు. ఆమరుత్తులు వృష్టినిత్తురు. ఆకలిగొన్నకన్య పీడింపబడినదై యెట్లేడ్చునో యట్లే మీరును వృష్టికావలెనని మరుద్దేవతల నుద్దేశించిప్రార్థింపుడు. పానాదికములను కోరుచున్నకన్యను తల్లియెట్లోదార్చునో యట్లే మరుద్దేవతలుకూడ మిమ్ములనోదార్చి మీకు కావలసినదానినిత్తురు.

దీనింబట్టిచూడ కన్య చిన్నపిల్లయే యనియు యువతికాదనియు తేలుచున్నది. కన్యాశబ్దము వివాహముకాని స్త్రీ యనునర్థమున వాడబడుటను. "వివాహ" మను ప్రకరణములో చూచియుంటిమి. కావునవేదకాలములో వివాహమగునప్పటికి వధువు చిన్నపిల్లగనే యుండెననియు యువతికాదనియు స్పష్టమగుచున్నది.

బాలికావివాహము వేదకాలమున నుండెనని చెప్పువారి వాదన పైన వివరింపబడినది. దీనిలోని యాచిత్ర్యమును నిర్ణయించుకొనుటకు పాఠకులే యర్హులైనను దీనిపై నొకటి

రెండుమాటలు చెప్పవలసిన బాధ్యత గ్రంథకర్తపై నున్నది. పైన వివరింపబడిన రెండుదాహరణములనుబట్టియు వేదకాలములో బాలికావివాహము లుండెనను నంశమును గ్రంథకర్త యంగీకరించుచున్నాడు. కాని "వివాహ" మను ప్రకరణమున యువతీవివాహములపక్షమున గన్పఱుపబడిన యుక్తులపైన ప్రస్తుత ప్రకరణములో చేయబడిన విమర్శనము నంగీకరింప జాలకున్నాడు. ఏమన వెనుక గన్పఱుపబడినయుక్తులు బాహాటమైనరాజమార్గమున నడచుచున్నవి. ఈ ప్రకరణములో గన్పఱుపబడిన విమర్శనములన్ననో రాజమార్గమునువీడి సంకుచితమార్గమును త్రొక్కుచున్నవి. కావున వేదకాలములో బాలికావివాహములు మాత్రమే యుండెననియు యువతీవివాహములు లేవనియు చెప్పుట గ్రంథకర్తకున్యాయ్యముగ గన్పట్టుటలేదు. ఈ రెండువిధములగు వివాహములును గూడ శిష్టులలో నున్నట్లు చెప్పవలసియున్నది. ఏమన బాలికావివాహము చేసికొనిన రాజొకడును, జ్ఞానసంపన్నుడగు బ్రాహ్మణు డొకడును మనకు గాన్పించుచున్నారు. సూర్యుని కుమార్తెయగు సూర్యకు యౌవనము వచ్చినపిమ్మటనే వివాహమైనదని కూడ నిదివఱలో ఋజువుచేయబడినది.

ఇక కన్యాశబ్దమునకు పైన నీయబడిన నిర్వచనముపై నొకముక్క చెప్పవలసియున్నది: బాలికావివాహములు చేసెడివారు కొందఱును యువతీవివాహములు చేసెడివారు కొందరును నాకాలములో నుండినట్లు పైనచెప్పియుంటిమి.

ఈ నిర్వచనము బాలికావివాహముచేయువారిదై యున్నది. యువతీవివాహము చేయువారి నిర్వచనము వేరు. యౌవనము వచ్చియుకూడ వివాహముకాని స్త్రీకి కన్యయను పేరున్నట్లథర్వవేదములోని యొకవాక్యమువలన తెలియుచున్నది.

బ్రహ్మచర్యేణ కన్యాయువానం విందతేపతిం॥

(అ. సం. 11-7-18)

అర్థము:—కన్య బ్రహ్మచారిణిగనున్నచో ననగా పురుషసంయోగములేక స్వచ్ఛముగనున్నచో మంచియువకుని పొందును.

ఇచట కన్య బ్రహ్మచర్యముతో నుండుచో మంచి భర్తవచ్చునని చెప్పుటచే కన్యయనగా ఏమైనను కావలసినచో నేడ్చుచు తల్లియొద్ద గారాబముగుడుచు పిల్లకాదనియు యౌవనముపొందినదనియు తెలియుచున్నది. బ్రహ్మచర్యమనగా వేదాధ్యయనమని చెప్పరాదా యనిన దానికైనను కన్య చిన్నపిల్లయగుటకు వీలులేదు. కాని యిచట బ్రహ్మచర్య శబ్దమునకు వేదాధ్యయనమని చెప్పుటకు వీలులేదు. ఏమన : ఈ పాదమునకు తరువాతి పాదములో

"అనడ్వాన్ బ్రహ్మచర్యేణ"

అని యున్నది. దీనికి "ఎద్దు బ్రహ్మచర్యముతో నున్నచో సులభముగ నావును పొందవచ్చును" అని యర్థము. ఏయెద్దు తన వీర్యమును కాపాడుకొని బలసియుండునో దానియొద్దకు ఆవులు సులువుగ వచ్చునని తాత్పర్యము. అట్లే ఏస్త్రీ పురుష

నెరుగక అక్షతయోనిగ నుండునో యూమెకు యువకుడు సులభు డని భావము.

కావున నీకన్య యౌవనవతి యని తేలుచున్నది.

పై విషయముల నన్నిటిని పరికించిన పాఠకునకు రెండు వాదనలలో నేది గ్రాహ్యమో తెలియకపోదు.

కొందఱుస్త్రీలు వివాహము లేకుండనే యుండెడివారని "వివాహ" మను ప్రకరణమున చెప్పబడినది. దానికి మఱొక సాక్ష్యముగూడ నిట నీయబడుచున్నది. "యత్కుమారీ మంద్రయతే" యను నారణ్యకవాక్యము "వివిధవిషయము" లను ప్రకరణమున వ్యభిచారమను శీర్షికక్రింద వివరింపబడినది. కుమారి యనగా వివాహముకానిస్త్రీ యని యర్థమనియట చెప్పబడినది. "వివాహముకాని" యనునర్థము తప్పుకాదు. కాని "వివాహములేని" యనుట యంతకంటెను సరి యగు నర్థ మని చెప్పవలెను. ఏమన శంకరాచార్యులవా రీపదమున కర్థము వ్రాయుచు 'వివాహరహితా' యనిరిగాని 'అవివాహితా' యనలేదు. దీనింబట్టి వివాహము లేనిస్త్రీలు కొందఱు వేదకాలములో నుండినట్లు తెలియుచున్నది.

ఇక నాటికట్నములసంగతినిగూర్చి మఱికొంచెము చూతము.

రూపంహిరణ్యం పశవోవివాహః॥ (ఐ. బ్రా. 3-1-11)

అర్థము:—బంగారము రూపము నిచ్చును. వివాహము పశువుల నిచ్చును.

రయించపుత్రాగ్ళ్చాదా దగ్నిర్మహ్యామథోఇమాం॥

(ఋ. సం. 10—85—41)

అర్థము:—అగ్ని నాకీ కన్యను ధనమును సంతానమును నిచ్చెను.

పై రెండువాక్యములలోను చెప్పబడిన 'పశువులు' ను 'ధనము'ను వరునకు వివాహముద్వారా వచ్చునవని తెలియుచున్నవి గావున నవి వధువుయొక్క తండ్రి యిచ్చు కట్నములే కావలెను. ఈకట్నములు కేవలము ఐచ్ఛికముగ నిచ్చినవే గాని వరుడు రొక్కించి పుచ్చుకొనునట్లు కానరాదు.

## వర్ణాన్తర వివాహములు

వేదకాలములో క్షత్రియస్త్రీలను బ్రాహ్మణులు వివాహమాడుట కలదని తెల్పుటకు చాల సాక్ష్యములున్నవి.

శతపథబ్రాహ్మణములో సుకన్యను చ్యవనుడు వివాహమాడిన ట్లున్నది. (శ. బ్రా. 5—1—5) సుకన్యతండ్రి శర్యాతుడని కూడ గలదు. శర్యాతుడు క్షత్రియుడనుటకు నీక్రిందివాక్యము ప్రమాణము.

శర్యాతఉవాఇదం మానవోగ్రామేణచచార॥

(శ. బ్రా. 5—1—5—2)

ఇచ్చట శర్యాతునకు 'మానవః' అను విశేషణము వాడబడినది. మానవుడనగా మనువంశములోని వాడని యర్థము. మనువు ఇక్ష్వాకుమున్నగువారు సూర్యవంశ క్షత్రియులు.

ఇచ్చట శర్యాతికి 'మానవః' అను విశేషణము వాడి నట్లే చ్యవనునకు ముందుఖండికలో 'ఆంగిరసః' అనువిశేషణము వాడబడినది. అంగిరసులు పురోహితులు, అంతియే కాక చ్యవనుడు ఋషి'యని 'సమస్తే స్తృషే' అను నైదవఖండిక లోని మాటలను బట్టి తెలియుచున్నది. కావున నాతడు బ్రాహ్మణుడని స్పష్టమగుచున్నది.

ఇట్టి వివాహములు ఋగ్వేదములో రెండుమూడు గల వని సాయణభాష్యమునుండి తెలియుచున్నది. కాని భార్యా భర్తల కులములంత స్పష్టముగ నందు తెలుపబడలేదు. ఆవివా హములలో నొకటి పంచమమండలములోని 61 వ సూక్తము లోను, మఱొకటి పదవమండలములోని 39 వ సూక్తము లోను నింకొకటి పదవమండలములోని 39 వ సూక్తములోను నున్నవి.

బ్రాహ్మణకన్య క్షత్రియుని వివాహమాడినట్లు కూడ ఋగ్వేదములో నొకచోట నున్నది. ఆసంగుడను రాజు అంగి రసునికుమార్తెయగు శశ్వతికి భర్తయని ఋగ్వేదము (ఋ. వే. 8—1—34) లో నున్నది. అసంగుడు క్షత్రియుడని యాతనికి వాడబడిన 'పరమజ్యాః' (8—1—30) అను విశేషణమును బట్టి తెలియుచున్నది. ఈశబ్దమునకు 'మంచినారి గలవాడు' అని యర్థము. 'నిందితాశ్వః' అను విశేషణముగూడ నీ ఋక్కు లోనే యాతనికి వాడబడినది. 'శత్రువుల యశ్వము లీతనిచే జయింపబడిన'వని దీని కర్థము;

పాతివ్రత్యము

"యత్కుమారీమంద్రయ తేయద్యోషిద్యత్పతివ్రతా"
యను వాక్యమునకు 'ఇతరవిషయములు' అను ప్రకరణమున
ర్థము వ్రాయబడినది. దీనింబట్టి పతినే వ్రతముగ గలిగియుం
ట వేదకాలములోని స్త్రీల ధర్మమని తెలియగలదు. పతి
చో దేహమున కే యవసరము లేదనియు నొకవేళ బ్రతికి
యున్నను నాతని మఱల కలసికొను నాశతోనే బ్రతికియుండ
లెననియు వితంతువులను ప్రకరణమున స్పష్టపఱుపబడినది.
యభిప్రాయమే తైత్తిరీయారణ్యకములోని షష్ఠ పపాఠక
మున ప్రథమానువాకములోని యుత్తరమంత్రములలోగూడ
న్నది. అంతయు భర్తతోనే యున్నది గావుననే

ఇంద్రాణీవావిధవా॥ (తై. బ్రా. 3–5–13–3)

శచీదేవివలెనే నవిథవనుగనుందును గాక! అను ప్రార్థ
లు వేదకాలపు స్త్రీలు చేసెడివారు. ఒకసారి భర్త చనిపో
యినచో నిక భర్తవచ్చుట యనునది లేదు కావుననే ధవుడు
పోయినదానికి 'విధవ'యనిపేరు. పత్నిపోయినవానికి మఱొక
త్ని రావచ్చును గావుననే యాతని 'విపత్నీకు'డనరు. అప
్నీకు డందురు. భర్తపోయినదానికి 'అధవ' యను పేరులేదు.

స్త్రీల సౌభాగ్యము భర్తయొక్క యాయువును బట్టి
యుండునను నభిప్రాయము వేదకాలమున నుండెననుట కిదియే
హేతువు. ఇంద్రాణిని స్తుతించుచు నొకడిట్లు చెప్పుచున్నాడు.
నహ్యస్యాఅపరంచనజరసామరతేపతిః॥ (తై.సం.1-7-11-1)

అర్థము :—ఈమె భర్తయెన్నడును జరామరణముల వాత బడడు.

పాతివ్రత్యము నాడెక్కువగ స్తుతింపబడుచుండెనని "దాంపత్యము" అను ప్రకరణమున స్పష్టపఱుపబడినది. ఇంద్రాణిని స్తుతించుటలో నామె పాతివ్రత్యము ముందుగ పేర్కొనబడుట కిదియే హేతువు.

ఇంద్రాణీమాసునారిషు సుపత్నీమహమశ్రవమ్॥

(తై. సం. 1—7—11—1)

అర్థము :—స్త్రీలందఱిలోను ఇంద్రాణి పతివ్రతయని వింటిని.

సర్వకాలసర్వావస్థలయందును భర్తతో నుండుటయు నెన్నడును వ్యభిచరింపకుండుటయు స్త్రీకి ప్రధానధర్మముగావున వివాహములో వధువును ఱాతిపై నెక్కించి యీక్రింది విధముగా నామె కుపదేశించుట వేదకాలములో నాచారమైనట్లు తైత్తిరీయమంత్రప్రశ్నములను బట్టి తెలియుచున్నది.

ఆతిష్ఠేమమశ్మానమశ్మేవత్వగ్ స్థిరాభవ॥

(తై. మం. ప్ర. 1—5)

అర్థము :—(ఓవధూ) ఈఱాతిపై నెక్కుము. నీవు ఱాయివలె స్థిరముగా నుండుము.

అనేకవిధములగు శిక్షణముల మూలముననను నలవాటుల మూలముననను స్త్రీకి పాతివ్రత్యరూపమగు స్థిరత్వమును గల్గించెడివారు. ఆమె మనస్సుదుర్వర్తనములలోనికుపోకుండున

నేక నియమము లామె కేర్పఱచిరి. ఆమె యువతియైన మ్మట బయట దిరుగుటకూడ నిషిద్ధమే. స్తనాదిస్త్రీ చిహ్న గలుగునంతవఱకే యామె బయట తిరుగుటకు వీలుండెను. యంశము వివాహవయస్సు అను శీర్షిక క్రింద వివరింపబడినది.

వితంతువులు

వేదకాలములో వితంతువులకు పునర్వివాహము లేదని ఋదివఱలో ఋజువు చేయబడియే యున్నది. మృతుడగు ర్తను లోకాంతరమున కలసికొనుటతప్ప మఱొక దృష్టి తంతువునకు లేదని తెల్పుటకు మఱొక వాక్యము నీక్రింద చ్చుచున్నాము.

మైమాగ్ స్త్వాప్రియేహం దేవీసతీపిత్రులోకం యదైషి । విశ్వ వారానభసా సంవ్యయంత్యుభానో లోకాపయసాభ్యావ వృత్స్వ॥ (తై.ఆ. 6-1-2)

ప్రేతాత్మ భార్యతో నీమాటలు చెప్పుచున్నాడు.

అర్థము:—ఓప్రియురాలా, నేనీవిధముగనైతినని (చని తినని) తలపవలదు. ఏమనగ నీవు దేవతారూపముగల నవై పితృలోకమునుగూర్చి వచ్చెదవు. అందఱిచేతను దగిన యాకాశమార్గముచేతవచ్చి ద్యులోకము నావరిం వు. మనముండు నిహపరలోకములు క్షీరాదులచేత సమృ ములగునట్లు చేయుము.

దీనింబట్టి భర్త చనిపోయినపిమ్మట భార్య యాతని

కలసికొనుటకై చనిపోవుట యానాడుండెనని తెలియగలదు. ఈ యభిప్రాయమే దీనిపై మంత్రమువలన తెలియుచున్నది. అందు చనిపోయినవాని భార్య 'పురుషస్యసహాయం' యని చెప్పబడినది. భర్తతో వెళ్ళు స్వభావముగలదని యర్థము.

భర్తలతో కాపురము చేయుచు వ్యభిచరించు స్త్రీ లున్నట్లే భర్తపోయినపిమ్మట మఱొకని నుంచుకొనిన స్త్రీలు కూడ నాడుండిరి. భర్తయుండగనే యాతనివదలికాని యాతడు చనిపోయినపిమ్మటగాని మఱొకని నుంచుకొనిన యామెకు 'దిధిషూః' అని పేరు. అమె నుంచుకొనినవానికి 'దిధిషూపతిః' యని పేరు. కూడనిపనులు చేయువారన్ని కాలములలోనునుందురు.

అరాద్యై దిధిషూపతిం॥ (తై. బ్రా. 3-1-1-4)

అర్థము :—కార్యసిద్ధి ప్రతిబంధాభిమానియైన దేవతకు మాఱుమనువు దానిని చంపవలెను.

సాధారణధార్మికజీవితమును జరిపెడిస్త్రీ భర్త చనిపోయినచో నాతనితో చచ్చుటయో యాతని తలచుకొనుచు జీవించుటయో చేసెడిది.

### వ్యభిచారము

మంచిచెడుగులు రెండునుకూడ లోకములో నెప్పుడు నున్నవి. వేదకాలములోగూడ వ్యభిచారిణు లుండిరని మనకు తెలియుచున్నది. భర్తతో కాపురము చేయుచునే వ్యభిచరించువారు కొందఱుండిరి.

గేహాయోపపతిం॥ (తై. బ్రా. 3-1-1-4)

అర్థము :—మిండని గృహముకొఱకు చంపవలెను.

భర్తను పూర్తిగ వదలివైచిగాని యాతడు చనిపో
...నపిమ్మటగాని మఱొకని భర్తనుగ వ్యవహరించు (నీ వ్యవ
...ము కామవిషయమునందు మాత్రమే) స్త్రీకి 'దిధిషూః'
...ని పేరు.

అరాద్యై దిధిషూపతిం॥ (తై. బ్రా. 3-1-1-4)

అర్థము :—కార్యసిద్ధి ప్రతిబంధాభిమానియైన దేవ
...ను దిధిషూపతిని చంపవలెను.

ఈవిధములగు వ్యభిచారములు గర్హ్యములేయైనను
...షము గావించిన స్త్రీని భర్త బహిష్కరింపవలెనని వేద
...లు చెప్పుటలేదు. దిధిషువును భర్త మఱల పరిగ్రహింప
...చ్చునని స్పష్టముగ నథర్వవేదములో చెప్పబడి యున్నది.
...సందర్భ మిట్లున్నది:—

బృహస్పతి బ్రాహ్మణుడు. ఆతనిభార్య తార. ఆమెను
...త్రియుడగు సోముడు పొందెను. బ్రాహ్మణభార్యను పొం
...ట చాల యనర్థదాయకమని గ్రహించి యాతడు తారను
...హస్పతికి నిచ్చివేసెను బృహస్పతి యామెను గ్రహించెను
...త్రియునితో వ్యభిచరించిన భార్యను బ్రాహ్మణుడు మరల
...హింపవచ్చునా కూడదా యను సందేహము గలిగినది.
...షిఋషులు ఈసందేహమును తీర్చుచు నిట్లు చెప్పిరి:—

ఉతయత్పతయో దశస్త్రియాః పూర్వేఅబ్రాహ్మణాః।
బ్రహ్మాచేద్ధ స్తమగ్రహీ త్సఏవపతి రేకధా॥
బ్రాహ్మణఏవపతిర్న రాజన్యోన వైశ్యో తత్సూర్యప్రబ్రువా
నితిపంచేభ్యోమానవేభ్యః॥ (అ. సం. 5–17–8–9)

అర్థము :—ఒక బ్రాహ్మణుని భార్య పదిమంది అబ్రాహ్మణులను పతులుగ చేసికొనినను ననగా నుంచుకొనినను పిమ్మట నాబ్రాహ్మణు డామె హస్తమును గ్రహించుచో నాత డిదివరలోవలెనే యిప్పుడుకూడ నామెకు పతియగుచున్నాడు. వెనక నామెనుంచుకొనిన క్షత్రియుడు కాని, వైశ్యుడుగాని యామెకు పతులుగారు. ఈవిషయమును సూర్యుడు అయిదుజాతుల మానవులకును జెప్పెను.

భర్తను విడచిపెట్టి మఱొకని నుంచుకొని మఱలభర్త యొద్దకు తిఱిగి వచ్చిన పునర్భువునకు కూడ తరణసాధనము అథర్వవేదములో చెప్పబడినది. ఆమె భర్తతో గలసి యజా పంచౌదనముచేసిన నామె యికపైన నట్లు వ్యభిచరింపదనియు భర్తయేగిన లోకమునకే యేగుననియు నీక్రిందివాక్యములలో నున్నది.

యాపూర్వం పతిం విత్వాఅథాన్యం విందతేపతిం।
పంచౌదనంచతావజం దదాతోనవియోషతః॥
సమానలోకోభవతి పునర్భువాపరః పతిః। యో
జంపంచౌదనం దక్షిణాజ్యోతిషం దదాతి॥ (అ.సం.9-3-5)

అర్థము :—ఎవతె ముందుగ నొకని వివాహమాడి

యనంతరము మఱొకపతిని అనగా మిండని పొందుచున్నదో యట్టి స్త్రీ మొదటివానితో ననగా పతితో గలసి యజ్ఞాపం చాదనము చేయుచో నామె యికముం దెన్నడును నట్లు వ్యభి చరింపదు. భర్తతో కలసియే యుండును. ఉత్కృష్టుడగు పతి (అనగా అసలుపతి) మిండనివదలి తనయొద్దకు తిఱిగివచ్చిన భార్యతో నజాపంచౌదనము చేసినచో నాతడును నామెయు నాకేలోకమున కేగెదరు.

వేదపఠనము ; వైదికకర్మ.

ఈవిషయము లుచితస్థలములో పూర్తిగ విచారింపబ డియేయున్నవి. ఇచ్చట నొకటిరెండు మాటలుమాత్రము చెప్పబడును.

ఆనాడు స్త్రీలకు బొత్తుగ వేదాధికారము లేకుండలేద నియు పురుషులయంత విరివిగ వారు వేదపఠనము చేసెడివా రని చెప్పుటకుమాత్రము వీలులేదనియు నిదివఱలో చూచితిమి. ఈవిషయమును సమర్థించు యజుర్వేదవాక్యములు కొన్ని యున్నవి. అవసరమునుబట్టి స్త్రీకి ఉపనయనముచేసి వేదపఠ నము చేయింపవచ్చునని వానివలన తెలియుచున్నది. దీనిం బట్టి కొన్నికొన్ని సమయములలో వేదపఠనాధికారము వారికి కల్పింపబడుచుండెనని తెలియగలదు. సాధారణముగ స్త్రీకి వేదాధికారము లేదనికూడ నందువలన తెలియుచున్నది. అదియెట్లన :

యజ్ఞకర్మలోను నిష్టులలోను నాదియందు యజమాన పత్నినడుమును ముంజిగడ్డిలో చేయబడిన త్రాటిని కట్టుదురు. ఆత్రాటిని మౌంజియందురు. ఆకట్టుటను పత్నీసన్నహన మందురు. దీనిప్రయోజన మేమనగా: యజ్ఞములో యజమానపత్ని కొన్ని మంత్రములను పఠింపవలసి యున్నది. సామాన్యముగ నామెకు వేదపఠనాధికారము లేదు. కావున నామెకు తత్కాలికముగ నాయధికారము కల్పింపబడును. అందులకు వ్రతోపనయనము సంస్కారము చేయబడును. అపుడు బ్రహ్మచారి ధరించు మౌంజ యీమెనడుముకు కట్టబడును. ఇదియే పత్నీసన్నహనము.

ఆశాసానాసౌమనసంప్రజాగ్ సౌభాగ్యంతనూం। అగ్నేర నుతాభూత్వా సన్నహ్యే సుకృతాయకం॥

(తై. సం. 1–1–10–1)

అనుమంత్రమును చదివి యజమానుడీత్రాటిని కట్టును. దీనితో పత్నికుపనయనము సిద్ధించునని తైత్తిరీయ బ్రాహ్మణము చెప్పుచున్నది.

ఏతద్వైపత్న్యైవ్రతోపనయనం। తేనైవైనాం వ్రతముపన యతి॥ (తై. బ్రా. 3-3-3)

అర్థము :—ఇదియే పత్నికి వ్రతోపనయనము. దీని చేత నామెను యజ్ఞపవిత్రమును పొందింతురు.

దీనింబట్టి తేలుసారాంశము ముందుగనే చెప్పబడినది. ఇంకను నెట్టిసమయములలో స్త్రీకి వేదాధికార ముండెనో

యంతస్పష్టముగ తెలియదు. యాజ్ఞవల్క్యుడు మున్నగు మహాజ్ఞానుల స్త్రీలలో కొందఱికట్టి యధికారముండవచ్చునని తోఁచుచున్నది.

ఇక వైదికకర్మవిషయమున స్త్రీకిగల సంబంధమును గూర్చికూడ మఱొక యంశము చూతము.

అయజ్ఞోవాఏషః। యోపత్నీకః॥ (తై. బ్రా. 2-2-2-6)

అర్థము :—పత్నీసంభారమంత్రములు లేనిది యజ్ఞము కాదు.

వీనిలో పత్ని పఠించితీఱవలసిన మంత్రములున్నవి. కావున పత్ని లేకుండ యజ్ఞముచేయుటకు వీలులేదని తెలియుచున్నది.

విశ్వవారయను నొకస్త్రీ యగ్నిలో స్వయముగా హోమముచేసి దేవతలను తృప్తినొందించినట్లే క్రిందిబుక్కువలన తెలియుచున్నది. ఇది యాప్రకరణములో (3) అను గుర్తుగలచోట తెల్పినవిధమగు కర్మయే యని గ్రహింపవలెను.

సమిద్ధోఅగ్నిర్దివిశోచిరశ్రేత్ప్రత్యఙ్ ఉషసముర్వియావిభాతి।
ఏతిప్రాచీవిశ్వవారా నమోభిర్దేవాఁ ఇళానాహవిషాఘృతాచీ॥ (ఋ. సం. 8-28-1)

అర్థము :—సందీప్తుడైన యగ్ని ప్రకాశించుచున్న యంతరిక్షమందు తేజస్సును పొందినాడు. ఉషస్సు కభిముఖుడై యెక్కువగ ప్రకాశించుచున్నాడు. నమస్కారములచే

దేవతలను స్తుతించుచున్నదై హవిస్సుతోను స్రుక్కుతోను కూడినదై విశ్వవార ప్రాఙ్ముఖియై యగ్నినిగూర్చి వెళ్ళు చున్నది.

## స్త్రీసంతతి

వేదకాలములో పురుషసంతతియే వాంఛింపబడుచుం డెడిదనియు స్త్రీసంతతి యరుదుగను, స్వల్పముగను మాత్రమే కోరబడు చుండెడిదనియు నిదివరలో (ప్రథమప్రకరణములో) చూచియుంటిమి. ఇప్పు డీవిషయమై మఱిరెండు సంగతులను చూతము యజుర్వేదములోని యొక మంత్రమునుబట్టి స్త్రీసం తతి వలదను కోరికలుగూడ నాడుండెనని తెలియగలదు.

> నవిష్వంచం వియుయాద్యద్విష్యంచం వియుయాత్ స్త్ర్య
> స్యజాయేతోర్ధ్వముద్యాత్యూర్ధ్వమివహిప్రుగ్ సః పుమానే
> వాస్యజాయతే॥ (తై. సం. 2-6-5-4, 5)

అర్థము :—(యజ్ఞములో) దర్భలయగ్రములు కలపి దండమువలె నుంపవలెను. అట్లగుచో యజమానునకు పుత్త్రు డుకలుగును. దర్భలకొసలు విప్పబడి యుండకూడదు. అట్లుం డుచో యజమానునకు కుమార్తె గలుగును.

ఇచ్చట కూడనిపని చేయుటకు ఫలితముగ కుమార్తె పుట్టునని చెప్పబడియున్నది. కావున ఆడపిల్ల కలుగుట యొక దురదృష్టముగ భావింపబడుటకూడ నుండెనని తెలియుచున్నది.

ఆడపిల్లపట్ల ప్రజలకు అరతి యెందులకుండెడిదో ప్రథ

మాధ్యాయమున వివరింపబడియే యున్నది. ఆమె యితరుని యధీనము చేయబడి యాతని శక్తులు నభిరుచులు మున్నగు వానిని బట్టి కష్టమునో సుఖమునో యనుభవింపవలసినదేగాని స్వతంత్రముగ జీవితము గడుపునదిగాదు కావునను వైధవ్యము మున్నగు ననేకదురవస్థ లామెను నెప్పుడైనను దుఃఖముల పాలు చేయవచ్చును గావునను కుమార్తె కోరబడెడిది గాదని చెప్పబడినయంశమే యీక్రింది ఐతరేయబ్రాహ్మణములోని వాక్యములో సంక్షిప్తముగ గాన్పించుచున్నది.

కృపణం హదుహితా॥ (ఐ. బ్రా. 3–1–1l)

అర్థము:—కుమార్తె జాలిని కల్గించును.

ఆమె యెందులకు జాలిని గల్గించునో ప్రథమాధ్యాయములోనే చూచియుంటిమి. నవమాసములు మోసి కష్టించిన తల్లికిని పిత్రాదీతరబంధువులకును గూడ నామె నత్తింటికి పంపునపుడు పట్టరాని దుఃఖముగల్గుట సహజము. వివాహసమయమున నేడ్చుచున్న వధూవరులను జూచి వరు డిట్లను చున్నాడు.

జీవాగ్ రుదన్తి విమయన్తే॥ (తై. మ. ప్ర. 1)

అర్థము:—జీవించియున్న యీ మీ పిల్లకొఱ కెందుల కేడ్చుచున్నారు? శుభసమయమున నేడ్చుట విపరీతముగ నున్నది.

ఆడపిల్లలంపఱకును వివాహమగుటయే యానాటి యాచారమనియు వివాహముకాని పిల్లలు కొలదిగ మాత్రమే

యుండిరనియు నిదివఱలో చెప్పబడినది. ఇందుల కీక్రింది యజు ర్వేదవాక్య మొక ప్రమాణము:—

అవభృథమవయం తిపరాస్థాలీరస్యం త్యుద్వాయవ్యానిహ రంతితస్మాత్స్త్రియం జాతాంపరాస్యంత్యుత్పుమాగ్ సగ్ హరంతి॥ (తై. సం. 7—5—10—౩)

అర్థము:—అవభృథమైనపుడు (అవభృథ మనగా యజ్ఞపరిసమాప్తియందు చేయు నొక యిష్టి) వాయవ్యము (పాత్రవిశేషము) లను అచట వదలివేసి స్థాలులను (ఇవి యొకవిధమగుపాత్రలు) తీసికొని పోదురు. అట్లే పుట్టినయాడు పిల్లలను మఱియొకచోట (అనగాభర్తృగృహమున) నుంతురు. పుట్టిన మగపిల్లవానిని తమతోకూడనుంచుకొందురు.

స్త్రీసంతతి విషయమై ప్రథమప్రకరణమునను నీ ప్రకరణములోని యీభాగమునను నీయబడిన వేదవాక్యముల నన్నిటిని చూచినచో స్త్రీసంతతిపట్ల నాటి ప్రజలకందఱకును నొకే యభిప్రాయము లేదనియు వారివారి స్థితినిబట్టియు, దృక్పథమును బట్టియు నీవిషయమై యభిప్రాయ మనేకవిధములుగ నాడుండెననియు తెలియగలదు. ఒకచోట స్త్రీసంతతి యనిష్టమని సూచించుచున్న యజుర్వేదమే మఱొక స్థలమున స్త్రీసంతతి వాంఛనీయమని సూచించుచున్నది.

యంకామయేత స్త్ర్యస్యజాయే తేత్యుపాన్తేతస్యవ్యతిషజేత్స్త్ర్యేవాస్యజాయ తే।యంకామయేతప్రపుమానస్యజాయేతే

త్యాంతం తస్యప్రవేష్టయేత్పుమానేవాస్యజాయతే॥

(తై. సం. 6–6–4–3)

అర్థము :—యజమానునకు కుమార్తె కలుగవలె నన్నచో రెండుప్రాళ్లను కొసకు సమీపమున సమ్మేళనచేయ వలెను. పురుషసంతతి కలుగవలెనన్నచో మొదటినుండి చివఱ వఱకును పేనవలెను.

ఋగ్వేదములో నొక్కచోటనుగూడ స్త్రీసంతతి కోరబడకుండుటయు పురుషసంతతి మిక్కుటముగ కోరబడుటయు ననేకస్థలములలో స్త్రీసంతతి యనిష్టమని సూచింపబడుటయు నొకటి రెండుచోట్ల మాత్రమే స్త్రీసంతతికై కోరికలు గాన్పించుటయు జూడ మొత్తముపైన వేదకాలములోని ప్రజలకు స్త్రీసంతతిపట్ల నెట్టి యభిప్రాయముండెడిదో తెలియగలదు. వేదకాలములో స్త్రీల జీవితము పురుషుల జీవితముకంటె నెక్కుడు దుఃఖభాజనమును తక్కువ ప్రయోజనకారియు గాకుండినచో నీరెండు సంతతులపట్లను ప్రజలకుండిన దృక్పథములలో నింతభేదముండుట కవసరములేదు.

## స్త్రీ ప్రకృతి

స్త్రీ ప్రకృతిని గుఱించి యిదివఱలో విస్తారముగ చెప్పబడియే యున్నది. ఇపుడు మఱియొక యంశము చెప్పబడును. తైత్తిరీయబ్రాహ్మణములో నిట్లున్నది.

తగ్ హోవాచ। భోగంతుఆచక్ష్వపతన్మ ఆచక్ష్వాయత్తేపా

ణావితి। తస్యాఉపహ్త్రీన్ వేదాన్ ప్రదదౌ। తస్మాదుహ స్త్రియో భోగమైవహారయన్తే॥ (తై. బ్రా. 2-3-10)

అర్థము:—సావిత్రి సోముని కామించెను. సోముడామెను కామింపలేదు. కావున నామె సంభారమంత్రములచేతను పత్నీమంత్రములచేతను స్థాగరమును ముఖమువిూద అలంకరించుకొని సోముని యొద్దకు వెళ్లెను. సోముడామెను దగ్గఱకు రమ్మనెను. ఆమె నాకు భోగము నిచ్చెదనని ప్రతిజ్ఞ చేయుమనెను. ఆతడట్లు చేసెను. అంత నామె చేతిలో నున్నది నాకిమ్మనెను కావున లోకములోని స్త్రీలు భోగము నుద్దేశించి పురుషుని స్వాధీనము చేసికొందురు.

దీనింబట్టి స్త్రీలు తమ ప్రయోజనమును నెఱవేర్చుకొనుటకు పురుషుని వలలో వేసికొను శక్తిగలవారని తెలియగలదు.



## చతుర్దశాధ్యాయము



### సారాంశములు

ఇంతవఱకును నీగ్రంథములో హేతుపూర్వకముగ ప్రతిపాదింపబడిన సిద్ధాంతములను సంగ్రహముగ నీక్రింద నిచ్చుచున్నాము.

1. వేదములో వందలకొలది స్థలములలో పురుషసంతతికై కోరికలున్నవి.
2. ఒక్కచోట మాత్రమే స్త్రీసంతతి కోరబడినది.
3. అనేకస్థలములలో స్త్రీసంతతి పురుషసంతతియంత వాంఛనీయము గాదని యున్నది.
4. దత్తపుత్రునికంటె కుమార్తెయే సన్నిహితురాలు.
5. కుమార్తెకంటె దౌహిత్రుడు సన్నిహితుడు.
6. స్త్రీసంతతి పురుషసంతతియంత ప్రయోజనకారి కాదు. స్త్రీలు పురుషులకంటె నెక్కుడు దుఃఖము లనుభవింపవలసి యుండిరి.
7. యజ్ఞము, సంతానము, అర్థము, కామము అనువానికొఱకు భార్య అవసరమాయెను. సంతానముద్వారా భార్య అమృతత్వము నిచ్చును.
8. స్త్రీకూడ పురుషునివలెనే వివాహమువలన లాభములను పొందుచుండెను.
9. యువతీ వివాహములును, బాలికా వివాహములునుకూడనా డుండెను. యువతీవివాహములు లేనేలేవను వాదన బాగులేదు.
10. వివాహమగుచుండగనే పిల్ల నత్తింటికి పంపెడువారు.
11. వరునకు కట్నమిచ్చుట యుండెను.
12. స్వయంవరములు కూడ నుండెను.
13. బ్రాహ్మవివాహమే సాధారణముగ జరుగుచుండెను.

14. కొలఁదిస్త్రీలు వివాహములేకయే యుండిరి.
15. స్త్రీకి బహు భర్తలుండరాదు. పురుషున కనేకభార్య లుండవచ్చును.
16. సవతులలో పోరుండెను.
17. భార్యలనందఱిని సమదృష్టితో చూచుట భర్తవిధి.
18. వితంతువులకు పునర్వివాహములేదు.
19. వారు కఠినజీవనము నడుపుచుండిరి.
20. సహగమనముకూడ నుండెను.
21. సంతతిలేని వితంతువు మఱిదివలన సంతానము బడయుట యుండెను.
22. భార్య భర్తలోను, భర్త భార్యలోను నర్ధభాగములు.
23. పరలోకములోకూడ దంపతులు విడరు.
24. పతిసేవయే వ్రతముగ గలిగియుండుట స్త్రీలయుత్కృష్ట ధర్మము.
25. పతిని ద్వేషించుస్త్రీ పాపిష్ఠ.
26. భార్య భర్తకు స్నేహితురాలు.
27. భార్యతో స్నేహము నెన్నడును భర్తవీడరాదు.
28. భర్త భార్యకాత్మార్పణముకూడ చేసికొనును.
29. కొంతమంది స్త్రీలకు ఘోషా యుండెను.
30. భార్యయే గృహము.
31. ఇంటిలోని యందఱకును నామె పాలకురాలు.
32. మామగారియం దామెకు భక్తిమెండు.

33. ఆడపిల్ల నెక్కుడు జాగ్రత్తగా పెంచెడివారు.
34. ఆడపడుచునకు యింటిలోని పశువులకు పాలుపితుకుట యను పనియుండెను.
35. స్త్రీలు ప్రత్యేకము సభలుచేసికొనెడివారు.
36. కొలదిమంది స్త్రీలు పురుషులసభకు వెళ్ళెడివారు.
37. రాజసేవ చేయు స్త్రీలుకూడ నుండిరి.
38. కొలదిమంది స్త్రీలు యుద్ధము చేసెడివారని తెలియు చుండుటచేవార దేవిధముగ నితరములగు పురుషోచిత కర్మలన్నిటియందును పాల్గొనెడివారని చెప్పవచ్చును.
39. స్త్రీలతో యుద్ధముచేయుట పాపావహము.
40. స్త్రీలు సాధారణముగ భర్తలకు సహాయభూతలుగనే యుద్ధమునకు వెళ్లుచుండిరి.
41. స్త్రీఋషులుండిరి.
42. కొన్నిసమయములలో స్త్రీలకు వేదపఠనాధికారముండె నని స్పష్టముగ తెలియుచున్నది.
43. పురుషులలో నున్నంత విరివిగ స్త్రీలలో వేదపఠనము లేదు. ఎల్లప్పుడును స్త్రీకి వేదపఠనాధికారములేదు.
44. కొలదిమంది స్త్రీలు తత్త్వగోష్ఠులలో పాల్గొనెడివారు.
45. నృత్యము, గానము, చిత్రలేఖనము మున్నగు కళల నభ్యసించు స్త్రీలు కొందఱుండిరి.
46. కత్తివరలుచేయుట, చాపలల్లుట, ఉన్నిపనులు మున్నగు శిల్పములు వృత్తులుగగల స్త్రీలు కొందఱుండిరి.

47. భార్యలేనిదే పురుషునకు యజ్ఞాధికారములేదు.

48. యజ్ఞములలో పురుషుడే ప్రధానకర్త.

49. యజ్ఞఫలము నిరువురునుకలసియే యనుభవింతురు.

50. యజ్ఞములలో భార్యాభర్తలకు ప్రత్యేకఫలము లిచ్చు భాగములు కొన్నికలవు.

51. అభ్రాతృస్త్రీకే పితృకర్మాధికారముండియుండవచ్చును.

52. పుత్రికాకరణముజరిగిన స్త్రీకి జన్మించినవాడు మాతామహునకు పితృకర్మచేయవలెను.

53. స్త్రీలు దేవతలను ప్రార్థించి వరములబడయుటయుండెను.

54. స్త్రీలకు దానప్రతిగ్రహణాధికారము లుండెను.

55. కుమార్తెలకు కుమారులతోపాటు తండ్రియాస్తిలో భాగములేదు.

56. పెండ్లికాని కుమార్తెకు ఏదో కొంత యాస్తిని తండ్రి యిచ్చెడివాడు.

57. అన్నదమ్ములు లేని స్త్రీకి తండ్రియాస్తి వచ్చుచుండి నట్లు కాన్పించును.

58. వితంతువుకు భర్తయాస్తిలో కొంతభాగము వచ్చుచుండెను.

59. స్త్రీలు ధనము సంపాదించుటకూడ నుండెను.

60. స్వర్ణాభరణరూపమగు ధనము స్త్రీలకుండెను.

61. పుట్టింటివారామెకు ఏదో ముట్టచెప్పుచుండిరి.

62. గృహములోని సమస్త ద్రవ్యమునకును గృహపత్నియే యధికారిణి.

63. మొత్తముపైన స్త్రీయార్థికస్థితి భర్తనుబట్టియేయుండెను.
64. సృష్టిలో పురుషునకే ప్రాధాన్యము.
65. స్త్రీ లేనిచో పురుషుని జీవితము వ్యర్థము.
66. స్త్రీ యాతనికొఱకే సృష్టింపబడినది.
67. శారీరకముగను, మానసికముగను, బుద్ధివిషయకముగను పురుషుడే యుత్కృష్టుడు.
68. దేవతలలోకూడ పురుషులకే ప్రాధాన్యము.
69. స్త్రీ యెవరిని హింసింపదు.
70. స్త్రీ నెవరును హింసింపరాదు.
71. లజ్జ, హృదయగాంభీర్యము స్త్రీలకు లక్షణములు.
72. పురుషులకు బలశౌర్యము లెట్టివో స్త్రీలకు సౌందర్యాలంకారము లట్టివి.
73. స్త్రీలు పరోపకారబుద్ధి గలవారు.
74. వారు చపలచిత్తలు.
75. మాత విశేషగౌరవస్థానము.
76. వ్యభిచారము చాలగర్హ్యము.
77. వ్యభిచారమునకు ప్రాయశ్చిత్త మున్నది.
78. వేశ్యలు దుఃఖమునకు స్థానములు.
79. పదిమంది పుత్రులను కనినపిమ్మట మిధునకర్మమానవలెను.
80. కొన్నిసమయములలో సంభోగము వర్జ్యము.
81. భార్య లందఱియందును సమభావముండవలెను.

82. అవ్యక్తస్వరాలు భోగమున కనర్హా.
83. మేనరికము, ఎదురుమేనరికముగూడ నుండెను. సోదరిని వివాహమాడుట మహాపాపము.
84. సంతానము లేనిస్త్రీకి సుఖములేదు.
85. గర్భిణులకు చాల గండము లుండెను. వానినుండి తప్పించుటకు మంత్రము లున్నవి.
86. గర్భిణి నీలశ్వేవర్ణముగలదనుట కొక కథ యున్నది.
87. రజస్వల బ్రహ్మహత్యారూపము.
88. ఆమెకు చాల నియమము లున్నవి.
89. స్త్రీల వేషములను గుఱించి కొన్ని వివరములు తెలియుచున్నవి.

సంపూర్ణము

# సవరణలు

| పుట. | పఙ్క్తి. | ఉన్నది. | ఉండవలసినది. |
|---|---|---|---|
| 3 | 20 | పుత్రులతో | పుత్రులతోను మనుమలతోను |
| 5 | 3,4 | పోయెదడు | పోగలడు |
| 8 | 13 | చేయుచుండిరి | చేయుచుండినట్లు చెప్పటకుకొంచెమువీలున్నది. |
| 8 | 8 | స్థలాంతరమున | స్త్రీలు - బాహ్యప్రపంచము అను ప్రకరణమున |
| 9 | 17 | స్థలాంతరమున | తృతీయచతుర్థాధ్యాయములలో |
| 9 | 22 | స్థలాంతరమున | తృతీయాధ్యాయములో |
| 10 | 12 | సూ | ఘా |
| 15 | 18 | శేషవా | ఏషవా |
| 17 | 4 | పురుషుడున్నచో | పుత్రుడున్నచో |
| 20 | 3 | దేవతను | యాతని |
| 23 | 8 | వివాహమునకై | వివాహపరిసమాప్తికై |
| 31 | 19 | పొందునట్లు అని | "పొందునట్లు" అనుచోటుకు పేరాసమాప్తము |
| 38 | 20 | (10-159-1) | (ఋ. సం. 10-159-1) |
| 39 | 6 | లోనె | లో |
| 41 | 18 | పోయినట్లు | పోవునట్లు |

| పుట. | పఙ్క్తి. | ఉన్నది. | ఉండవలసినది. |
|---|---|---|---|
| 44 | 12 | ఉదీర్ణశ్రీ | ఉదీర్ణవ |
| 45 | 6 | అనిష్ఠితునాం | అనుష్ఠితానాం |
| 45 | 12 | అసాది | అనాది |
| 45 | 13 | ప్రదాయా | సంప్రదాయా. |
| 48 | 14 | వ్రాయబడుచున్నది | వ్రాయుచున్నాము. |
| 48 | 18 | తథా క్తః | తథోక్తః |
| 49 | 4 | రమ్యమ్.రమ్యమ్ | రమ్యమ్. |
| 97 | 21 | చి త్తలేఖనము | చిత్రలేఖనము. |
| 98 | 8 | వేదకాలపు | (2) వేదకాలపు. |
| 100 | 10 | భర్తాభర్తలిరువురును | భార్యాభర్తలిరువురును |
| 101 | 9 | యిగ్ని | యగ్ని. |
| 108 | 22 | నుండెను | నుండెనో. |
| 112 | 9 | స్త్రీసంతతి | స్త్రీ. |
| 112 | 9 | అనర్హము | అనర్హ. |
| 112 | 22 | యంతో | యెంతో. |
| 114 | 10 | అప్స్యః | అప్సః. |
| 134 | 7 | యున్నది | యున్నవి. |
| 134 | 17 | పౌతిమాషి | పౌతిమాషీ |
| 137 | 12 | నగ్ని | నారుణికేతుకాగ్ని. |



# అనుబంధము 1

## రు 12000 లకు డిక్లరేషన్ ఆఫు ట్రస్టు దస్తావేజు

ఆ 1931 సం॥ యేప్రియల్ 9 వ తారీఖున, పశ్చిమ గోదావరిజిల్లా కొవ్వూరు రిజస్ట్రేషన్ సబుడిస్ట్రిక్టు, కొవ్వూరు గ్రామకాపురస్తులు బ్రాహ్మణులు, హైకోర్టు అడ్వకేటున్నూ లేటు వల్లూరి వెంకటకృష్ణయ్యగారి కొమారుడున్ను నగు వల్లూరి సూర్యనారాయణరావు వ్రాసిన డిక్లరేషన్ ఆఫు ట్రస్టుదస్తావేజు.

1. నా చిరకాలపు స్నేహితుడును, నిర్మలస్వార్థత్యాగముతో చిన్నతనములోనే తన న్యాయవాదవృత్తిని వదలుకొని, సుమారు 15 సంవత్సరములు కష్టించి తన ధనమును, ఆరోగ్యమును తుదకు తన ప్రాణములనుకూడ నర్పించి, కొవ్వూరు గ్రామములో యేబదివేల రూపాయిల స్థిరాస్తితో "ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ మను" నొక సంస్థాపనను నిర్మించినవాడగు లేటు తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు ది 6-3-26 తారీఖున శివసాన్నిధ్యమును చేరినారు. ఆయన నామము ఆచంద్రార్కముగ నుండునట్లు తోడ్పడుట నావిధాయకకృత్య మని యెంచి, నాస్వార్జితమగు తూర్పుగోదావరి జిల్లా రామచంద్రపురంతాలూకా ఆలమూరుకోఆపరేటివ్ ల్యాండుమార్గేజి బాంకులోనున్న నెం 31 to 42 నెంబర్లుగల పండ్రెండువేల రూపాయిల డిబెంచర్లను యీక్రింది షర

తులతో యీక్రింది వివరింపబోవు విషయములను నెరవేర్చుటకు కోవూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ పాలకసంఘమువారిని ట్రస్టీలుగా యేర్పరచి యీడిక్లరేషన్ ఆఫు ట్రస్టు దస్తావేజును వ్రాయుచున్నాను.

2. పైన ఉదహరించిన డిబెంచర్లమీద ప్రతి ఆరు మాసములకు వచ్చువడ్డీని మాత్రమే కోవూరు విద్యాపీఠ పాలకసంఘము ఖర్చుచేయుచుండవలెనుగాని, అసలు మొత్తము శాశ్వతమూలనిధిగా, యెల్లకాలముండవలెను. ఈడిబెంచర్ల గడువానంతరముకూడ వీనిమీదవచ్చు వడ్డి తగ్గినను, హెచ్చినను కోఆపరేటివుల్యాండుమార్గేజిబ్యాంకులలోనే యీఅసలు మొత్తము వేయుచుండవలెను. గాని భూములు, యిల్లు మొదలగు స్థిరాస్తులను కొనకూడదు.

3. నేనున్ను, నాయిద్దరు కొమాళ్లు కృష్ణమోహన్ M. A. B. L. Advocate మద్రాసున్ను, జగన్మోహన్ L. E. E. Electrical Engineer బొంబాయిన్ని కోవూరు ఆంధ్రగీర్వాణవిద్యాపీఠ పాలకసంఘములో జీవితకాలపు మెంబర్లుగా నుండవలెను. ఈముగ్గురులో యెవరైనను అన్యగ్రామములలో నున్నపుడు సదరు విద్యాపీఠపాలకసంఘకార్యనిర్వాహకసంఘసమావేశములలో పాల్గొని వోట్లు వేయుటకును, ఉద్యోగీయులుగా నుండుటకును, వారి యిష్టమువచ్చినవారిని, మరియొక్కొక్కరిని రాజమహేంద్రవరము, కోవూరు గ్రామస్థులలోనుండి మెంబర్లుగా నామినేటుచేసి, పాలకసంఘ సెక్రట

రీకి ముందుగా తెలియచేసి, తగిన యేర్పాట్లు చేసికొనుటకు అధికారము కలిగియుందురు.

4. పైన ఉదహరించిన ట్రస్టు ఫండుమీద రాగల వడ్డీలోనుంచి నెలకు యిరువది (రు 20) రూపాయల చొప్పున కొవ్వూరు ఆంధ్రగీర్వాణవిద్యాపీఠమున కనుబంధముగా నెలకొల్పబడిన శ్రీవాడ్రేవు జోగాయమ్మ బహద్దరు జమీందారు గారి కళాశాలాధ్యక్షుని (Principal) గౌరవభృతిక్రిందనిచ్చుచుండవలెను. ఒకవేళ యీస్వల్పమొత్తమును తన ఖర్చులకు స్వీకరించుటకు ఆయన యిష్టపడనియెడల సదరు కళాశాలలో పరిశోధనకును (research) అధ్యాపకమునకును (teaching) సమర్థుడగు ఒక పండితుని జీతముక్రింద నీయవలయును.

5. పైమొత్తము పోగా మిగిలిన వడ్డీని ఆంధ్రభాషలో సులభశైలిని పండితపామరులకు బోధపడునట్లు చిన్నచిన్న గ్రంథములను యీక్రింద నుదహరించిన విషయములలో విద్యాధికులచేత కొద్ది పారితోషిక మిచ్చిగాని, ఉచితముగా గాని, వ్రాయించి అచ్చొత్తించి ఆంధ్రదేశములోని ముఖ్యమైన గ్రంథాలయములకు ఉచితముగ పంచిపెట్టుటకును, వ్యక్తులకు స్వల్పఖరీదుకు విక్రయించుటకును, విద్యాపీఠపాలకసంఘమువారు వినియోగించుచుండవలెను.

(ఏ) వేదకాలమునాటినుండి హైందవుల ఆర్యమతములోని శ్రౌతస్మార్త కర్మకాండల జ్ఞానకాండల పరిణామము, ప్రస్తుతము వారిలోనున్న సాంఘికాచారములు, విశ్వాస

ములు, సాంప్రదాయములు, పట్టింపులు, వర్ణములు, వివాహ ములు, స్త్రీల విద్యాస్వాతంత్ర్యయములు, జ్యోతిషములు, మంత్రతంత్రములు, దేవతలు, దయ్యములు, వర్జములు, లగ్న ములు, శకునములు, గ్రహణములు, మంచి చెడుదినములు, అశుచి, ప్రాయశ్చిత్తఆచారకాండలు, తద్దినములు, దృష్టి దోష, పంక్తిదోష, అంటుదోష, వాయుదోషములు, సాము ద్రికము, రసవాదము మొదలగువానిని గురించి మూఢవిశ్వా సములను సప్రమాణముగ ఖండించి విమర్శించుట.

(బి) షోడశకర్మలను గురించి ఆంధ్రటీకాతాత్పర్య ములతో గ్రంథములను వ్రాయించి అనవసరమని తోచిన కర్మకాండవిభాగములను సంకుచితపరచి వేదలక్షణము నేర్చు కొని తగు విమర్శనజ్ఞానమును తెలివియుగల పురోహితులను, దేవాలయార్చకులను, అన్నివర్ణములలోను బయలుదేరునట్లు చేయుట, ప్రపంచములో తక్కిన జాతులమతములు, సాంఘి కాచారములు, నీతి వీని పరిణామములు, మొదలగునవి తెలియజేయుట.

(సి) ఆర్యమతమునుండి బయల్వెడలిన బౌద్ధమతము, జైనమతము, బ్రహ్మసమాజమతము, ఆర్యసమాజమతము మొదలగువానిలోని సూత్రములను, తెలియజేసి విమర్శించుట, ప్రపంచములో వ్యాప్తినొందియున్న యితరమతములతో ఆర్యమతమును పోల్చి వానిని గురించి ప్రజలకు బోధించుట.

(డి) మన పూర్వులు రచించిన మానసిక భౌతికశాస్త్ర

ములు, కళలు, అధునిక పరిశోధనలనుబట్టి విమర్శించి, వానిలో అవసరమగుమార్పులనుజేసి మన దేశీయ పారిభాషికపదములతో ఆంధ్రములో గ్రంథములను వ్రాయించుట.

(ఇ) గాంధిమహాత్ముల వారి సత్యాగ్రహతత్వములు, వానిలో నిమిడియున్న వేదాంతము, నానారాష్ట్రపరిపాలనా విధానములు, ప్రపంచములో యిదివరకు జరిగిన, యిప్పుడు జరుగుచున్న సమస్త సాంఘిక రాజకీయార్థిక విప్లవములు, ఉద్యమములు, గ్రామ పునర్నిర్మాణము, సహకార, అసహకారోద్యమములు, నానావిధ సమిష్టివాదములు, మొదలగు వానిని గురించి గ్రంథములను ప్రచురించుట.

6. పైన వ్రాసిన విషయములను నిర్భయముగను, నిర్మొగమాటముగను, సత్యము తప్పకుండ సప్రమాణముగ సంపూర్ణస్వాతంత్ర్యములతో (Free thought) ఆంధ్రుల యెదుట వారిభాషలో పెట్టుచుండవలెను. ఏగ్రంథముగాని రూపాయకంటె హెచ్చు వెలను కలిగియుండకూడదు. నా జీవితకాలములో నే నంగీకరించిన గ్రంథములనే ప్రచురించవలెను. నా జీవితానంతరము విద్యాపీఠపాలకసంఘమువారు యిప్పు డేర్పరచు పండితబృందము (Academic Council) చే అంగీకరింపబడిన పిమ్మట ఆ సంఘమువారి శాశ్వత సభ్యుల మెజారటీ వారి యామోదమును బడయనిదే యేగ్రంథముగాని వెలువడకూడదు.

7. నాపై యుద్దేశములను నెరవేర్చుటకు యితర దాత

లనేకమంది ట్రస్టుఫండుకు సహాయపడుదురని నేను నమ్ముచున్నాను. అప్పటి దేశకాలపరిస్థితులనుబట్టి పైన నేను తెలియజేసిన విషయములలో దేనికైనను యీ నిధిమీద వచ్చువడ్డీని అంతగాని కొంతగాని వీలుకొలది ప్రజోపయోగమునకు వినియోగించవచ్చును. సాలుకు ఒక చిన్నగ్రంథము వెలువడినను నాయాత్మ తృప్తినొందగలదు.

8. నే నిదివరకు ది 16-5-1928 తేదీని కొవ్వూరు ఆంధ్రగీర్వాణవిద్యాపఠనమునకు కొవ్వూరులో నాయింటిమీద రిజస్టరుడీడ్డు ద్వారా యేర్పరచిన రు 120 లు వార్షికము యీట్రస్టుడీడ్డు మొత్తములోనే చేరి యున్నందున సదరు చార్జిరద్దు అయినట్లు భావించుకొని యీట్రస్టును ఆంధ్రగీర్వాణవిద్యాపీఠపాలకసంఘమువారు అంగీకరించవలెను.

9. ఏకారణమువలననయినను నాపైయుద్దేశములను కొవ్వూరు, ఆంధ్రగీర్వాణవిద్యాపీఠపరిపాలకసంఘమువారు సరిగా నెరవేర్చజాలనిచో ఆంధ్రవిశ్వవిద్యాలయాధికారులు శివిల్‌కోర్టుగుండా యీట్రస్టుఫండును స్వాధీనము చేసికొని దీనిలో నుదహరించిన కార్యవర్గములను సక్రమముగ యీ కొవ్వూరు విద్యాపీఠములోనే నెరవేర్చుచుండవలెను.

ఇది నాసమ్మతిని నాస్వదస్తూరీని వ్రాసియిచ్చిన డిక్లరేషన్ ఆఫ్ ట్రస్టు దస్తావేజు.

అడ్వకేటు నల్లూరి సూర్యనారాయణరావు సెక్రటరీ
ఆంధ్రగీర్వాణవిద్యాపీఠము, కొవ్వూరు
పశ్చిమగోదావరిజిల్లా
9—4—31.

1. మద్వంశజాః పరమహీపతివంశజాః ।
యేభూమిపాః సతతముజ్వలధర్మచింతాః ।
మద్ధర్మమేవసతతం పరిపాలయంతి ।
త్వాత్పాదుకాద్వయమహంశిరసావహామి॥

2. స్వదత్తాద్వి గుణంపుణ్యం
పరదత్తాను పాలనం ।
పరదత్తా పహారేణ
స్వదత్తం నిష్ఫలంభవేత్ ॥

---

# APPENDIX II

రెండవ అనుబంధము

—: వ్రాయతగిన కొన్ని విషయముల పట్టిక :—

1. వర్ణములు. 2. అంతర్వర్ణ, అంతర్జాతీయవివాహములు. 3. వింతతు, రజస్వలానంతరవివాహములు. [illegible]వావి 4. వివాహచ్ఛేదనము. 5. స్త్రీలవిద్యాస్వాతంత్ర్యములు. 6. ప్రకృతిపరిణామము. 7. మతపరిణామము. 8. నీతిపరిణామము. 9. నీతిమతసంబంధము. 10. విగ్రహారాధనము. 11. పితృపూజ. 12. ఆర్యబ్రాహ్మణమతములు. 13. పునర్జన్మ. 14. స్వర్గనరకములు. 15. దేవుళ్ళు దయ్యములు. 16. దైవప్రార్థనము. 17. పురాణములు. 18. హైందవ ధర్మశాస్త్రకాలనిర్ణయము. 19. దైవస్వరూపపరిణామము. 20. అవతారములు. 21. ఆత్మస్వరూపపరిణామము. 22. మంత్రతంత్రములు. 23. కర్మజ్ఞాన భక్తిమార్గములు. 24. యోగవిద్య. 25. దృష్టిపంక్తి అంటువాయుదోషములు. 26. మంచిచెడుదినములు. 27. శకునములు, వర్జములు, లగ్నములు. 28. జ్యోతిషము. 29. యజ్ఞములు, యాగములు. 30. శుద్ధాద్వైత జడాద్వైతములు. 31. అహింస, జీవహింస. 32. ఆత్మహత్య. 33. విశ్వాసనంశయయాత్మతత్వములు. 34. దానధర్మములు. 35. అభక్ష్యశాకాహారము. 36. సమిష్టివాదములు. 27. మహాత్మగాంధిగారి సత్యాగ్రహతత్వము. 38. రాజకీయ, సాంఘికవిప్లవములు. 39. భౌతికశాస్త్రములు. 40. బాలుర విద్యావిధానము.